"నీకు ఉన్నది ఇతరుల కిచ్చి, వా రిచ్చినది సంతోషంగా స్వీకరించడంలోనే ఆనందం ఉంటుంది. వ్యక్తి తన ఆలోచనలను తనమట్టుకే పరిమితం చేసుకోక, తనకు సంబంధించిన వారిని కూడా అందులో ప్రవేశపెట్టుకోవాలి. అప్పుడే జీవితపు విలువలను, అనుబంధాన్ని అర్థంచేసుకో గలుగుతారని అక్షరాలా అవగాహపరుస్తూ భారతికి పట్టిన గ్రహణం విడిపించిన విచిత్ర నవల.

శ్రీమతి విశాలాక్షి విశాఖ జిల్లా విజయ నగరంలో 1928 ఆగస్టు 15 వ తేదీన జన్మించింది. అక్కడే విద్యాభ్యాసం చేసింది. ఆంధ్రా మెట్రిక్ ప్యాసయింది.

సరదాగా, సాయిలాపాయిలాగా, కాలక్షేపం కోసం 1953 లో రచనా వ్యాసంగం మొదలా పెట్టారు. ఇప్పటివరకూ రెండు నవలలూ (వైకుంఠపాళి, మారిన విలువలు), ఒక కథల సంపుటీ (ఆమె కోరిక) ప్రచురిత మైనాయి.

వీరి రచనలు ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ, ఆంధ్ర జ్యోతి వార పత్రికల్లో ప్రచురితమవుతుంటాయి.

# గ్రహణం విడిచింది

ద్వివేదుల విశాలాక్షి



యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాద్

రూ. 2

**GRAHANAM VIDICHINDI**
*by*
**Smt. DWIVEDULA VISALAKSHI**

*Published by* :
**M. SESHACHALAM & CO.**

*First Edition* : **SEPTEMB**

*Printed at* :
**KRANTI PRESS,**
**MADRAS-1**

*Cover Design*:
**BAPU**




**4**

# రెండు మాటలు

ఆరేళ్ల క్రిందటి మాట. అప్పుడు మేము మసూరీలో ఉండేవాళ్ళం. మా పొరుగున ఒక పెద్ద ఆఫీసరు గారి కుటుంబం ఉండేది. నౌకర్లు, చాకర్లు, వచ్చేవారు, పోయేవారు-ఒకటే సందడిగా ఉండేది వారి ఇల్లు. కొన్ని కారణాల వల్ల అతడు అటుతరువాత కొద్దికాలానికే ఆ ఉద్యోగం మానుకోవలసి వచ్చింది. ఆ ఇంటిని అహో రాత్రాలూ పావనంచేసే జనసందోహం ఒక్కసారిగా ఆగి పోయింది. బహుశ ఆ ఉద్యోగికి అప్పుడు తెలిసి ఉంటుంది- నిజమైన మిత్రు లెవరో!

పై సంఘటనకి, ఈ కథకి పోలిక లేదు. కాని మూలం ఒక్కటే. డబ్బూ, అధికారం ఉన్నప్పుడు అంతా ఆప్యాయత ఒలకపోస్తారు. మేమంటే, మేమంటూ ముందుకి వస్తారు. అందులో నిజమైన ఆప్తు లెవరో తెలుసుకోవడం కష్టం. అలాగని అందర్నీ అనుమాన దృష్టితో చూడడం అవివేకం. కాని ఆ స్థితిని అనుభవించేవారి ఆరాటం అంత సులువుగా తగ్గేది కాదు.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు ఆంధ్రజ్యోతి వార పత్రిక ప్రారంభించ సంకల్పించి నన్నొక సీరియల్ నవల కావాలని కోరేవరకూ ఆ సంఘటనపై కథ రాయాలని మసూరీలో వచ్చిన ఆలోచన మనసులో అడుగున పడి ఉండి పోయింది. కలం పట్టుకొని 'ఏమి రాయనా' అని ఆలోచి స్తుంటే నేను ఉన్నానంటూ మద్రాసులో తిరిగి ప్రత్యక్ష మయింది ఆ విషయం. వారంరోజులపాటు నా ఆలోచనలతో

దాగుడుమూతలు ఆడి 'గ్రహణం విడిచింది' నవలకు నాంది పలికింది.

మసూరీలో మొదటిసారిగా నా మనసులోకి ఈ ఆలోచన వచ్చిన సమయం శీతాకాలం. హిమాలయాలు సార్థక నామధేయంతో మెరిసిపోతున్న సమయం. ఏదో రాయాలన్న తపనతో ఇంట్లో వెచ్చగా కుంపటిముందు కూర్చుని కాగితాలు చించి పోస్తుంటే బయట మంచుకన్న చల్లనైన గాలి వీచ సాగింది. అంతలోనే కర్పూరపరాగంలా తెల్లగా మంచు భూమ్యాకాశాలమధ్య పల్చని తెర పట్టినట్లు పడడం మొదలు పెట్టింది. కాగితాల్ని, ఒక మూలకి నెట్టి బయటికి నడచేను. మెత్తని ఆ మంచులో మనసు తీరా తిరుగుతుంటే కథ కుదర లేదన్న ఆరాటం మనసులోంచి ఎప్పుడో చల్లగా జారుకొంది.

తిరిగి ఈ నవల రాయ సంకల్పించేసరికి మద్రాసు ఎండలు నెత్తి మాడుస్తున్నాయి. అయినా ఆనాటి మసూరీ చలి గాలులు అప్రయత్నంగా నా ఆలోచనలలోకి దూసుకు వచ్చేయి. ఆ ప్రకృతిచిత్రాన్ని అంత సులువుగా కళ్ళముందు నుంచి తప్పించలేకపోయేను. అందుకే ఈ కథలోని నాయికను భర్తతో సహా ఆ చలిలో, మంచులో తిప్పి వారితో నా ఆనందాన్ని పంచుకొన్నాను. ఈ కథ పుట్టిన స్థలాన్ని పాఠకులకు పరిచయం చేసేను.

ఈ కథలో భారతిని నే నెరుగుదును. కాని అందమైన బాల వితంతువుగా కాదు. నడివయసులో ఉన్న గృహిణిగా. కథ నడవడానికి ఆమెకి లేని కొన్ని గుణాల్ని భారతికి అంట గట్టవలసి వచ్చింది.

"పారపోయాలంటే పాలు - తాగాలంటే విషం కలిసిం దేమో అనే అనుమానం. ఏం చెయ్యాలో తెలియకుండా ఉంది" అని ఆరాటపడేది ఆవిడ.

పాలు పోరబోయడం అమంగళకరం. అలాగని తాగి ఊరుకుంటే ప్రాణమే పోతుందేమో మరి! అటువంటి భయం తోనే భారతి తనవారందరికీ దూరంగా పారిపోయింది. ఆ భయం పూర్తిగా తీరకుండానే పరిస్థితులు ఆమెని తిరిగి వెనక్కి తీసుకువచ్చేయి.

ఆఖరి క్షణంలో ఆమె ఆ భయాన్ని జయించింది. ఆ పాలలో తగుమాత్రం విషం కలసివున్నా తన ప్రాణాల కేం ముప్పురాదు. ఆ విషాన్ని అరగించుకొనే శక్తి తను సంపా దించుకొంది - అనే నమ్మకం ఆమెకి కలిగేకనే అసలు పాల రుచి ఏమిటో ఆమె తెలుసుకొంది.

ఈ కథలో ఉన్న ఇంకొక సజీవపాత్ర ఋషీకేశ్ బాబా. శీతోష్ణాల బాధ లేకుండా, చాలీచాలని బట్టలతో అతడు మసూరీ వీథుల్లో తిరగడం నాకు తెలుసు. అతడి యొక్క మంచిచెడ్డల నిర్ణయం సరిగా చెయ్యకుండా గోడమీది పిల్లి వాటంగా వదలివేసే వన్నారు ఒక మిత్రుడు. నిజమే. అతని గురించి నాకు సంపూర్ణంగా తెలియదు. అందుకే ఆ సాహ సానికి పూనుకోలేకపోయేను. ఆ నిర్ణయం పాఠకుల ఊహ లకే వదలివేసేను.

మంచికథగా రాణించాలంటే బలమైన ఇతివృత్తంతో పాటు ఏదో ఒక సందేశం వంటిదికూడా ఉండా లంటారు. ఈ కథలో సందేశం ఏమైనా ఉందా? ఏమో మరి!

వితంతువులంతా విధిగా పెళ్ళిచేసుకోవా లనేది మాత్రం నా సందేశం కాదు. కాని వారి వ్యక్తిగత జీవనానికి, వికాసానికి అది అవసరం అని వారు భావిస్తే, తిరిగి వివాహం చేసుకోవడంలో తప్పులేదని నా నమ్మకం. అందువల్ల చని పోయిన భర్తకి అన్యాయం చెయ్యడం అవుతుందని నేను అను కోను. నిజంగా ఆ స్త్రీని భర్త తన జీవితకాలంలో ప్రేమించే ఉంటే, అతని ఆత్మ ఏ లోకాల్లోనో తిరుగుతూవుంటే ఆమె సంతోషంగా ఉన్నందుకు ఆనందించాలి కాని, బాధపడడం కాదు. ఆత్మీయులైన వారి సుఖసంతోషాలు కాక ఎవరైనా మరేం కోరారు?

పుస్తకం అంతా చదివేక మీ రేమైనా చెప్పా లను కొంటే వినేందుకు నేను సిద్ధంగా ఉన్నాను. అరగించుకో గలనా లేదా అన్నది వేరేసంగతి.

ఈ నవలారచనకి నాకు ప్రోత్సాహమిచ్చి, తమ 'ఆంధ్ర జ్యోతి' వారపత్రిక ప్రారంభ సంచికనుండి సీరియల్ గా ప్రచు రించిన శ్రీ నార్ల వారికి, తమ 'ఎమెస్కో-పాకెట్ బుక్స్' ప్రణా ళికలో తొలిసారిగా వెలువడుతోన్న నాలుగు పుస్తకాల్లో నాదీ ఒకటిగా ఎన్నుకొన్న యం. శేషాచలం అండు కో వారికీ నా కృతజ్ఞతలు.

ద్వివేదుల విశాలాక్షి.

# 1

తెల్లవారు ఝామున నాలుగుగంటలకు వచ్చే జనతా ఎక్స్‌ప్రెస్ ఆరోజు అరగంట ఆలస్యంగా వచ్చింది. ఆ రైలు కూత విని నిద్ర లేవడం అత్తయ్యకి అలవాటు. అరగంట ఆలస్యంగా లేచిన అత్త, వేళకి పని తెమలదేమో అని ఆరాటపడుతున్నది. ఆమె ఇంట్లో సందడిచేస్తూ ఇటు అటు తిరుగుతుండడం నా చెవులలో పడుతున్నా నాకు లేవబుద్ధికాలేదు. ఆరుగంటలకు డ్యూటీ నుండి వచ్చిన మామయ్య, "భారతీ! ఇంకా లేవలేదమ్మా?" అన్నాడు.

అప్పుడే మెలుకువ వచ్చినట్లు బద్ధకంగా ఒళ్లు విరుచుకొన్నాను. నిజానికి అత్తయ్య లేచినప్పుడే నాకూ మెలుకువ వచ్చింది. ఆనాడు జరుగబోతున్న తతంగాన్ని ఆలోచిస్తూ కళ్ళు మూసుకొని పడుకొన్నాను.

"లే తల్లీ! లేచి నీళ్ళుపోసుకొని బట్టలు మార్చుకో. అన్నయ్యా, వదినా ఈ పదిగంటల బండికే వస్తున్నారు. ఇంటిలో ముందుగా చూసుకోవలసినవి ఎన్నో వున్నాయి. అన్నీ వాళ్ళు వచ్చేకే అంటే అవడం కష్టం" అంది అత్తయ్య, మాకు కాఫీ అందిస్తూ.

అన్నయ్యా, వదినా వస్తున్నారంటే నాకు సంతోషంగానే వుంది. కాని, వాళ్ళ రాకకి కారణమైన పెళ్ళిచూపుల తతంగం మాత్రం నాకు విసుగు కలిగిస్తున్నది.

ఒకసారా, రెండుసార్లా, వచ్చిన ప్రతివాడి ముందూ ఎంతకని నన్ను నేను ప్రదర్శించుకోవడం? నాకు ఇవి వచ్చు, అవి వచ్చు; నేను ఇంత మంచిదాన్ని, అంత గొప్పదాన్ని అని చెప్పుకోవడం? వాళ్ళు

చేసే ప్రతి పనికిమాలిన ప్రశ్నకీ జవాబు చెప్పవలసిన బాధ్యత ఉన్నట్లు తడుముకొంటూ ఏదో ఒకటి తప్పనిసరిగా చెప్పడం? "ఈ పెళ్ళి చూపుల తంతు ఒక నాటకం వంటిది మామయ్యా. ముందు వాళ్ళకి ఎంత కట్నం కావాలో నిశ్చయంగా తెలుసుకొని అప్పుడు ఇంటికి తీసుకరా. పిల్ల నచ్చినా, కట్నం నచ్చకపోతే ఎవరూ చేసుకోరు" అంటే మామయ్య నా మాట వినడు. "వీళ్ళు చాలా మర్యాదస్థులమ్మా! అలా డబ్బుకి పడిచచ్చేవాళ్ళు కాదు" అంటాడు.

"మర్యాదస్థులైనంత మాత్రాన వారికి డబ్బుతో అవసరం ఉండదనీ, డబ్బు కావలసినవారంతా మర్యాదస్థులు కారనీ నా అభిప్రాయం కాదు మామయ్యా. వారికి పిల్లా, కట్నమూ ఈ రెండింటిలో ఏది ముఖ్యమో ముందుగా తెలుసుకొని, అది సంతృప్తికరంగా ఉంటే రెండో విషయంగురించి మాట్లాడు కోవాలి. అంతేకాని చిన్న పిల్లల ఆటల్లా ఇట్టే జట్టుకట్టి, అట్టే వెళ్ళిపెట్టే ఈ పెళ్ళి చూపులకి అర్థం ఏమిటి?"

"ఈసారి అలా జరగదమ్మా! ఈ కుటుంబం చాలా మంచి వారు" అన్నాడు మామయ్య.

మామయ్య ప్రతిసారీ ఇలాగే అంటూంటారు. అతని ఆశ అతనికా నమ్మిక కలిగిస్తుంది. నన్నొక అయ్యచేతిలో పెట్టవలసిన బాధ్యత అతనికి ఉంది. ఈడొచ్చిన ఆడ పిల్లని. మామయ్య బాధ చూసి జాలిపడడం మినహా నేనేం చెయ్యగలను?

"ఇంకా ఇలాగే కూర్చున్నావా, భారతీ! లేచి నా కొంచెం పని సాయం చెయ్యమ్మా! ఆ హాలులో టేబిలు గుడ్డలూ అవీ మార్చి, ఆ పూసల తోరణం హాలుగుమ్మానికి కట్టు. అచ్చెమ్మతో చెప్పి సుభద్ర పిన్నిగారింటి నుంచి నాలుగు పువ్వులు తెప్పించి ఆ పూలకుండీలో పెట్టు."

"అత్తా, నేనొక మాట అంటాను. నువ్వు కోపగించుకోవు కదా?"

"పిచ్చిపిల్లా, నీమీద కోపమేమిటే? నేడో, రేపో అత్తింటికి వెళ్ళిపోవలసిన దానివి."

"అదికాదు అత్తా. ఇప్పటికి మూడుసార్లుగా ఇల్లు అలంకరించి, నీ పాకకళాచాతుర్యాన్ని వచ్చిన వాళ్ళముందు ప్రదర్శించావు. ఒక్కసారైనా అది ఉపయోగపడిందా? మనిల్లు ఎప్పుడూ పరిశుభ్రంగానే వుంటుంది! వారికోసం ప్రత్యేకం ఏ అలంకరణా చెయ్యనక్కరలేదు."

"మూడు—భారతీ! యక్షప్రశ్నలు వేస్తూ కూర్చోక ఈ రోజుకి నే చెప్పినట్లు చెయ్యి. ఆ పైని నీ కెలా తోస్తే అలా చేయొచ్చు కాని!" అంటూ అత్తయ్య ఆజ్ఞాపిస్తూ వంట ఇంటిలోకి వెళ్ళిపోయింది.

పది గంటలకి అన్నయ్యా, వదినా వచ్చారు. చంటిపాపని మాత్రం వెంటతీసుకొచ్చి పెద్ద పిల్ల లిద్దర్ని ఇంటిదగ్గర వదిలింది వదిన.

"పిల్లల్ని ఇంటిదగ్గర వదలి రాకపోతే వాళ్ళని కూడా తీసుకురాలేకపోయారా?" అన్నాడు మామయ్య.

"సెలవులేదు మామయ్యా. మళ్ళా రాత్రి బండికే వెళ్ళిపోవాలి. ఈ కాస్త సేపటికి వాళ్ళు కూడా ఎందుకు, గొడవచేస్తారని తీసుకురాలేదు" అన్నాడు అన్నయ్య.

సాయంకాలం నాలుగయింది. వదిన నా జడలో పూలచెండు పెట్టి ముంగురులు సవరించింది. నుదుటి తిలకాన్ని కొనగోటితో సరిచేసింది.

"వదినా!" అన్నాను, ఆమె కళ్ళలోకి చూస్తూ.

"ఏం భారతీ!" అంటూ, చేస్తున్న అలంకరణ నుంచి దృష్టి తిప్పకుండానే ప్రశ్నించింది వదిన.

"వదినా! ఆడదాని జీవితంలో ప్రసవం బాధాకర సమయం అంటారు. ఇది అంతకన్న హెచ్చు యాతనని మానసికంగా కలిగిస్తుంది వదినా! ఎవరో ముక్కూ ముఖం తెలియని పురుషుడి ముందు ఇలా ఎన్నిసార్లు ఆడపిల్ల తన స్త్రీత్వాన్ని ప్రదర్శించుకొంటూ, నేను నీకోసమే పుట్టేను అని చెప్పుకోవాలి?" మన దేశంలో ఆడపిల్ల ఈ బాధనుండి తప్పుకొనే మార్పు ఎప్పుడైనా వస్తుందంటావా?"

"ప్రతి విషయాన్నిగురించీ అంత విమర్శగా ఆలోచింప కూడదు భారతీ! ఇది నీ వొక్కతెకోసం ఈ నాడు జరుగుతున్న ఆచారం కాదు. ఆడదాని అదృష్టం పండే ఘడియ వస్తే, ఇప్పుడు నువ్వు శాపం అనుకొంటున్న కాలం జీవితాంతం మధుర ఊహాల్ని మనసుకి తెచ్చే సమయంగా మిగిలిపోతుంది. ఈ రోజు నువ్వు నీ జీవితంలో ఏనాటికీ మరువలేని రోజుగా నిలుస్తుందేమో? ఎవరు చెప్పగలరు" అంది వదిన, లాలనగా.

ముందు గదిలో మనుష్యుల అలికిడి అయింది.

"అదిగో, వాళ్లొచ్చేరు" అంటూ వెళ్ళిపోయింది వదిన.

అరగంట కల్లా నాకు పిలుపు వచ్చింది. వదిన చేయి పట్టుకొని మెల్లగా హాలులోకి వచ్చేను. అప్పటికే, వచ్చిన వారి పరిచయాలూ, ఫలహారాలూ పూర్తయేయిలాగుంది. అంతా నా రాక కోసం ఎదురు చూస్తున్నట్టు మాటలు లేకుండా కూర్చున్నారు.

"రా అమ్మా, భారతీ!" అంటూ అత్తయ్య చాపమీద తన పక్కగా కూర్చోపెట్టుకొంది.

"ఏం చదువుకున్నావమ్మా? వంటొచ్చా? అల్లికలు, కుట్లు చాతనవునా? ఆ పూసల తోరణం నువ్వే అల్లేవా?" మొదలుగాగల పెళ్ళి చూపుల ప్రశ్నల కోసం ఎదురు చూస్తున్నాను. పది నిమిషాలు గడిచినా పెద్దవాళ్ళు తమలో తాము మాట్లాడు కొంటున్నారే కాని, నన్నేం ప్రశ్నించలేదు.

మా అమ్మా, నాన్నా మేము చిన్న పిల్లలుగా ఉంటున్నప్పుడే, కారు ప్రమాదంలో చనిపోవడం, మమ్మల్ని పెంచి పెద్దచేసి, అన్నయ్యకి చదువూ సంధ్యా చెప్పించి, పెళ్ళి పేరంటం చేసి, ఒక ఇంటివాణ్ణి చెయ్యడం వగైరా చరిత్రంతా చెపుతున్నది అత్తయ్య. అటువైపునుంచి వచ్చినావిడ కూడా 'నేనేనా తక్కువ తిన్నది' అన్నట్టు, ఆమె చెల్లెలు చనిపోతే పురిటి మంచం ఎక్కి పిల్లాడిని ఎలా పెంచుకొచ్చిందీ చెప్పి బాకీ తీర్చుకొంది. వారి సంభాషణ వినేందుకు నాకేం సుఖంగా అనిపించలేదు. అదే సమయంలో నా నాదగ్గరికి చేరి "పెళ్ళి కొడుకుని చూసేవా?" అంటూ వదిన నా చెవిలో ఊదింది.

తల ఎత్తి నేను అటు చూసేసరికి అప్పటివరకూ మామయ్యతో మాట్లాడుతున్న అతడు కూడా నా వైపు చూసేడు. మామయ్య నా గురించి ఏదో చెపుతుంటే నిర్ధారణకోసం చూసినట్లుంది ఆ చూపు.

"అవునా?" అన్నట్లు చిన్నగా నవ్వేడు.

అప్రయత్నంగా నా పెదవులు కూడా విడివడ్డాయి. వదినని దగ్గరకు పిలిచి మామయ్య ఏదో చెప్పేడు. ముసిముసి నవ్వు నవ్వుకొంటూ వదిన వచ్చి నన్ను లేవదీసింది. "రండి" అంటూ ఆ పెళ్ళి కొడుకును పిలిచింది. సంగతేమిటో అర్థంకాని నేను వదిన వైపు తెల్లబోయి చూశాను. పక్క వరండాలోకి మమ్మల్ని తీసుకు వెళ్ళింది వదిన.

"ఆ కుర్రాడు నీతో మాట్లాడాలిట" అంది మెల్లగా.

ఇదేదో కొత్తరకం తంతులాగుంది. నలుగురి ముందు ఏమడిగినా తీరిపోయే. చాటుగా ఏం అవకతవక ప్రశ్నలు వేస్తాడో అనుకొన్నాను.

"మీ పేరు భారతి కదూ? నా పేరు మాధవరావు. స్నేహితులూ, ఇంట్లో వాళ్లూ 'మాధవ్' అని పిలుస్తారు" అన్నాడు అతడు, సంభాషణకు నాందిగా.

పక్కగావున్న నా గది తలుపు తీస్తూ "రండి, ఇక్కడ కూర్చుందాం" అన్నాను.

"ఈ గది మీదా?" నలువైపులా చూస్తూ ప్రశ్నించేడు అతడు. నా గదిని నీటుగా, సింపుల్ గా వుంచుకోడం నా కలవాటు. నిరాడంబరంగా ఉన్న నా గదిని చూసి ఏమనుకొంటున్నాడా అని అతడి ముఖంలోకి పరీక్షగా చూసేను.

రైటింగ్ టేబిలుమీద ఓ పక్కగా పెట్టివున్న వాటర్ కలర్సు, కుంచెలు, డ్రాయింగు పేపరు మీద అసంపూర్తిగా వున్న అజంతాసుందరి చిత్రం పరీక్షగా చూస్తున్నా డతడు.

"మీకు చిత్రలేఖనం కూడా వచ్చా?" అంటూ అటునుంచి దృష్టి తిప్పకుండానే ప్రశ్నించేడు.

"నా అంతట నేను స్వతహాగా ఏమీ గియ్యలేను. ఎదురుగా

ఏదైనా చిత్రం వుంటే కాపీ చెయ్యగలను. అది కూడా అంతంత మాత్రమే!'' అన్నాను.

''ఈ చిత్రం దేన్నిచూసి వేస్తున్నారు?'' అన్నాడు, ఆ కాగితం చేతిలోకి తీసుకొని, చూస్తూ.

ఆ బొమ్మ ఉన్న పత్రిక తీసి చూపించేను.

''ఒరిజినల్‌గా గియ్యలేకపోయినా కాపీ బాగా చెయ్యగల రన్నమాట'' అని అన్నాడు, నవ్వుతూ.

అది మెప్పుదలో, అవహేళనో అర్థంకాక తెల్లబోయి చూసేను. అతడు నా అవస్థ గమనించలేదు. ఇంకా ఆ బొమ్మవంకే చూస్తున్నాడు.

''నా కదికూడా చేతకాదులెండి. ఒకసారి నేను చిలక బొమ్మ గీసి నా స్నేహితుడి కొడుక్కి ఇస్తే 'మామయ్యా, ఈ నక్కకి రెండే కాళ్ళున్నాయేం' అంటూ ప్రశ్నించేడు,'' అంటూ, నవ్వుతూ నా వైపు చూసేడు అతడు.

చిలకని నక్కగా భ్రమింపజేసిన అతని చిత్రలేఖనంలోని గొప్పతనం విని నేనూ నవ్వకుండా వుండలేకపోయేను. దానితో నా మనసు తేటపడినట్లు అనిపించింది. అతనితో వివాహం జరిగినా మానినా, ఇతను నా మనసుని బాధ పెట్టేలా ప్రవర్తించలేదన్న సంతృప్తి మిగులుతుం దనుకొన్నాను.

అటు తరువాత కొంచెం సేపు అతడు తనగురించి చెప్పాడు. ''మా అమ్మగారు పోయారు. నాన్నగారు తీర్థయాత్రలకి బయలు దేరి మరి తిరిగి రాలేదుట. నాకు తలిదండ్రు లిద్దరూ కూడా తెలి యదు. పిన్నీ చిన్నాన్నా చేతుల్లో పెరిగేను. ఇండియన్ ఎయిర్ లైన్సులో పైలట్‌గా పని చేస్తున్నాను. మనిషిని మీ ఎదురుగుండా వున్నాను కాబట్టి రూపం, వయస్సుగురించి చెప్పనక్కర లేదను కొంటాను'' అన్నాడు చిలిపిగా నవ్వుతూ.

''నా గురించి ఏమైనా తెలుసుకోవాలా?'' అన్నాను.

''మీ గురించి మీ మామయ్యా, అన్నయ్యా కొంత చెప్పారు. మిగిలింది మీ కది చెప్పింది. తెలుసుకోడానికి ఒకమాట మాత్రం మిగులుంది. అడగమంటారా?''

"ఊఁ, అడగండి."

"నన్ను పెళ్ళిచేసుకోడం మీకు ఇష్టమేనా?"

సిగ్గు నా బుగ్గలపై మొగ్గలు తొడిగింది. నాలో అంత సిగ్గు అనుకూల సమయం కోసం దాగి, వేచి ఉన్నదని నాకంతవరకూ తెలియనేలేదు. నేను జవాబు చెప్పే లోపునే వసారాలో వదిన కనిపించింది—ఈ పరిచయాలు ఇంక చాలన్నట్టు.

అతడు నా ముఖం చూసి "ఇందుకే స్త్రీలకి సిగ్గందం అంటారు మన పెద్దలు. మీరు ఇప్పుడు ముందుకన్నా చాలా బాగున్నారు" అన్నాడు.

వదిన గుమ్మంవరకూ వచ్చింది.

"మన సంభాషణ ఇక చాలని మీ వదినగారు హెచ్చరిక చేస్తున్నట్టున్నారు. మిమ్మల్ని చేసుకోడం ఇష్టం. మీ అభిప్రాయాన్ని మీ ముఖం చెపుతున్నది" అంటూ బైటికి నడిచేడు అతడు.

నా ముఖం వదినకు చూపలేక చేతుల్లో దాచుకొన్నాను. వదిన బలవంతంగా నా చేతులు విడిపిస్తూ "భారతీ! జీవితంలో బాధాకరమైన క్షణాలు కావమ్మా ఇవి" అంది పరిహాసంగా.

నాకు ఒక్కసారిగా ఏడుపు ముంచుకు వచ్చింది. ఆమె భుజంమీద తల ఆన్చి వెక్కి వెక్కి ఏడ్చేను.

"ఏమయింది భారతీ! అతడేమైనా అసభ్యంగా మాట్లాడేడా! లేక నువ్వు నచ్చలేదన్నాడా? నువ్వు ఎంతో సంతోషంగా వున్నావనుకొని పరిహాసం చేసేనమ్మా, అసలు ఇంతకీ ఏంజరిగిందో చెప్పు" అంది వదిన ఆత్రంగా.

"అతను ఎంతో మంచివాడు వదినా. ఎంతో మర్యాదగా మాట్లాడేడు. నన్ను వివాహం చేసుకొందికి తన ఇష్టం కూడా తెలియ జేసేడు."

"మరి, అతన్ని చేసుకోవడం నీ కిష్టంలేదా?"

"అదికాదు, వదినా."

"ఏం జరిగిందో చెప్పమ్మా, ఈ సమయంలో ఏడుపెందుకు?

"ఇద్దరికీ నచ్చిన ఈ సంబంధం కట్నం మూలంగా తప్పిపోతే, మళ్ళా ఇంకొకరి ముందు పెళ్ళికూతురుగా నే కూర్చోలేను వదినా!"

అంటూ, ఏడుపు ఆపుకొంటూ మనసులోని భయాన్ని నెమ్మదిగా వెళ్ళగ్రక్కేను.

"అలా జరగదు భారతీ! అప్పో సప్పో చేసి ఈ సంబంధం స్థిరపడేలా చూస్తాం. నువ్వేం కంగారు పడకు" అంది వదిన.

పెళ్ళివారిని సాగనంపి లోనికి వచ్చిన అత్తయ్య మా ఇద్దర్నీ ఆ పరిస్థితిలో చూచి ఆశ్చర్యపోయింది. "ఏమయింది లక్ష్మీ! భారతికి ఈ సంబంధం నచ్చలేదా!" అంది వేదనతో.

"నచ్చక కాదు పిన్నీ. కట్నం చాలక తిరిగిపోతారేమో అని భారతి భయపడుతున్నది."

"వాళ్ళ మాటలు విని నేనూ అలాగే భయపడ్డానే పిల్లా. మొదట కట్నం మాట ఎత్తితే 'అబ్బాయి రానీండి' అంటూ గడువులు పెట్టేరా-తీరా కుర్రాడు తిరిగొచ్చాక కట్నంమాట తేల్చకుండా 'మీ పిల్ల మా వాడికి ఇష్టమైంది. ముహూర్తం పెట్టించండి. బావగారూ' అన్నాడు అతడు."

"ముందు ఇంత అని నిర్ణయించుకోకుండా వెనుక నుంచి కట్నం కోసం పేచీపెట్టే రకంలా ఉం" దనుకొని, వాళ్ళు బండి ఎక్కుతూంటే "కట్నం కానుకల మాట చెప్పేరుకారు" అన్నాను. "దానికేముందమ్మా! మీకు తోచినంత మీ పిల్లకి పెట్టండి. లాంఛనాల గురించి కూడా మాకేం పట్టింపులులేవు. మీ సంతోషమే" అంది ఆవిడ చేయి కలుపుతూ. భగవంతుడు మన పాలిట వుండి ఈ సంబంధాన్ని మన గుమ్మానికి తెచ్చేడు. నువ్వు అదృష్టవంతురాలివమ్మా భారతీ!" అంది అత్తయ్య. "విన్నావా, భారతీదేవి! ఇంక ఆ అబ్బాయిని నీ కొంగుకి ముడికట్టుకొని, నీ కొనగోటి చుట్టూ తిప్పుకో!" అంటూ పరిహాసంగా బుగ్గపోటు పొడిచింది వదిన.

* * *

గృహప్రవేశానికి అత్తవారి ఇంటికి వెళ్ళిన మూడురోజులూ ఎంతో సందడిగా గడిచిపోయేయి. చుట్టపక్కాలతో కలకలలాడుతున్న యింట్లో ఆదరాభిమానాలు, వర్షాకాలంలో ఏటి నీరులా గట్లు ఒరుసుకొంటూ పారేయి. మాధవ్ అనురాగంలో మనసు

మునకలు వేస్తున్నా, ఏదో సంశయం, అరికాలులో గుచ్చుకొన్న ముల్లులా, కరకరమంటూనే వుంది. పెళ్ళికి వచ్చిన అమ్మలక్కల గుసగుసలు చెవుల్లో ముళ్ళులా గుచ్చుకొంటూనే వున్నాయి.

"పెళ్ళికొడుకు కట్నం తీసుకోలేదుట!"

"లాంఛనాల విషయంలో కూడా తమకి పట్టింపులు లేవన్నారుట వియ్యాలవారు!"

"పిల్లాడికి కుంటా, గుడ్డా? పున్నమ చంద్రుడిలా వున్నాడు..."

"పండులాంటి ఉద్యోగం కూడా వుందిట..."

"ఆc...ఏదో లోసుగు ఉండి ఉంటుంది..."

"ఇంకేదో ఆశ ఉండి ఉంటుంది..."

"లేకపోతే ఈ కాలంలో మగపిల్లాడికి కట్నం లేకుండా పెళ్ళా...?"

అమ్మలక్కల మాటల ఒత్తిడికి మనసును లొంగనీయకూడదని నొక్కి పట్టుకొన్నాను. అయినా ఏ పుట్టలో ఏ పాముందో ఎలా తెలుస్తుందని మనసు మెలమెల్లగా గొణుగుతూనే వుంది. ధైర్యం చేసి, గృహప్రవేశానికి వచ్చిన బంధువులు ఇంకా తరలి పోకముందే నేనే అతన్ని ప్రశ్నించేను:

"మీరు కట్నం లేకుండా నన్నెందుకు చేసుకొన్నారు?"

"ఇదంతా కట్నం కాదూ?" అన్నాడు అతడు నన్ను పరిశీలనగా చూస్తూ.

"ఏది? ఈ కాస్త బంగారమూనా?" అన్నాను మెడలో గొలుసుని సవరించుకొంటూ.

"కాదు. ఈ అందం...ఈ మంచితనం..."

"పరిహాసానికి కాదు. నిజం చెప్పండి," అన్నాను బ్రతిమాలుతూ.

"చెప్పనా?...అప్పుడు ఈ అనురాగానికి ఇంత విలవ వుండదని, ఈ ముద్దు యింత తియ్యగా..." ముఖమెత్తి పెదవుల్ని అందుకోబోతున్న అతని చేతులోంచి తప్పుకొని వెళ్ళిపోయేను.

మాధవ్ అన్న మాటలో నిజమున్న దనిపించింది. నా పెళ్ళి

కోసం మామయ్యా, అన్నయ్యా అప్పులపాలైతే మాధవ్‌ని చూసి నప్పుడల్లా అతన్ని నేను భర్తగా పొందేందుకు మా వాళ్ళు వెచ్చిం చిన డబ్బే గుర్తుకు వచ్చివుండేది. మా దాంపత్య జీవితంలో పవి త్రత కొరవడివుండేది.

"పెద్దవాళ్ళ సరదాకోసం మూడు రోజులు అగ్నిహోత్రం ముందు ఆ పొగలో కూర్చున్నాం. ఇంక మన సరదా కోసం దేశం కొస్త చూసివద్దాం పద" అన్నాడు మాధవ్ ఒక రోజున.

పెళ్ళికి వచ్చిన బంధువులు ఇంకా పూర్తిగా తరలిపోలేదు. ఈ మాట విని యింట్లో పెద్దవాళ్లు ఏమనుకొంటారో అని భయ పడ్డాను నేను.

కాని, నాలుగు రోజులు గడవకముందే, వారందరి సమ్మతితో, మా ప్రయాణపు ఏర్పాట్లు చేసేడు మాధవ్. బంధు మిత్రులందరూ చేతులు ఊపుతూ వీడ్కోలు ఇస్తుండగా రైలు కదిలింది. రైలు ప్లాట్‌ఫారం దాటి పోతుంటే అక్కడ నిలిచిన ఒక్కొక్కరి ముఖం మరుగున పడిపోసాగింది. కొత్తప్రదేశాలను చూడబోతున్నా నన్న ఆనందం మధురమైన ఊహాల్ని నా మనస్సులో రేపింది. వెనుతిరిగి చూసేసరికి మాధవ్ నాపై నుంచి బైటికి చూస్తున్నాడు. అంతా దూరమయ్యేరు. నాకు మిగిలింది ఇతడొక్కడే అనుకున్నాను.

"నాకు మాత్రం నువ్వుతప్ప ఎవరున్నారు?" అన్నట్టుఅతడు నన్ను దగ్గరికి తీసుకొన్నాడు.

వివాహానికి పదిరోజులు ముందుగానే ప్రోగ్రాం అంతా నిర్ణయించి టికెట్ రిజర్వేషన్‌లు కూడా చేయించిన అతని పద్ధ తులు చూస్తే నా కెంతో ముచ్చట అయింది.

'నా' అనుకున్న వారందరికీ దూరమైపోతున్న ఆ సమయంలో అతని బాహువులు నా గుండెకి బలాన్నిచ్చేయి. అతని సామీప్యం నా మనసుకి హాయినిచ్చింది. అతని నీడలో నారూపు కరిగిపోయింది.

దేశం ఈ కొసనుంచి ఆ కొసవరకు సుందర దృశ్యాల్ని, చారిత్రక స్థలాల్ని చూస్తూ నెలరోజులపాటు తిరిగాము. చాలా వరకూ మా ఏకాంతానికి భంగం కలగకుండానే ప్రయాణం సాగి పోయింది. అక్కడక్కడ మాధవ్ స్నేహితులు ఒకరిద్దరు కని

పించినా మా ఆనందానికి అడ్డుగా నిలవకుండా, పలకరించి పక్కకి తప్పుకొనేపాటి సభ్యత తెలిసినవారే.

జయపూర్‌లో జంతర్ మంతర్ చూస్తూ తిరుగుతుంటే జగదీశ్ కనిపించేడు. జగదీశ్, మాధవ్ ఒక ఊరి వారే. చాలా వరకు కలిసే చదువుకొన్నారుట. రైల్వేలో పని చేస్తున్నాడు. నవ్వుతూ, ఉత్సాహంగా, కలివిడిగా మాట్లాడుతాడు. మాధవ్ వయస్సే వుంటుంది. మాధవ్ కన్నా కొంచెం పొట్టి. చాయ తక్కువ. ముఖం మాత్రం కళగా వుంటుంది.

"ఏరా యింకా పెళ్ళిధ్యాస మనసులోకి రాలేదా?" అన్నాడు మాధవ్, జగదీశ్ నుద్దేశించి.

"ఇదిగో, ఆ ప్రయత్నం మీదే దేశమంతా గాలిస్తున్నాను. నీకులాగా యింటినుండి కాలు కదపకుండా నాకో భారతీదేవిని ఎంచి పెట్టేందుకు అమ్ముందా, అయ్యున్నాడా? తల్లీ తండ్రీ లేక పోయినా, నీకైతే, సంతతం ఆ ప్రయత్నంలో వుండే పిన్ని వుంది కాబట్టి సరిపోయింది. మా పిన్నికి అంత ఓపిక లేదు" అన్నాడు జగదీశ్ నవ్వుతూ.

"జగదీశ్ నీకు తెలుసా?" అని మాధవ్ నన్ను ప్రశ్నించేడు.

"నాకెలా తెలుస్తుంది?"

"మీ మామయ్య డిపార్టుమెంటులోనే వీడుకూడా చాలా కాలంగా పనిచేస్తున్నాడు కదా, ఎక్కడైనా తారసపడ్డాడేమో అని. పైగా మీ అన్నయ్య స్నేహితుడట కూడా!"

"ఉఁహు. ఇంతకిపూర్వం ఈయన్ని ఎక్కడా చూసినట్టు గుర్తులేదు. ఈయన మన పెళ్ళికి కూడా వచ్చినట్టు లేదే?"

"అప్పుడు వీడు ఆరోగ్యశాఖవారికి అతిథిగా వున్నాడులే."

"అయ్యో! ఏం, సుస్తీ చేసిందా? ఇప్పుడెలా వుంది?" అన్నాను పరామర్శగా.

పక పక నవ్వేడు జగదీశ్.

"ఉక్కు కడ్డీలా మీ కళ్ళముందున్న మనిషిని పట్టుకొని, ఎప్పుడో నాలుగు రోజులు వచ్చిపోయిన జ్వరం గురించి, ఇప్పుడెలా వుందని ప్రశ్నేమిటండీ! మాటలు దొరక్క కానీ" అన్నాడు.

తెలివి తక్కువగా ఆ ప్రశ్న వేసినందుకు విసుక్కున్నాను. మాధవ్ నా వైపు చూస్తూ, "వాడి మాటల తీరే అంత భారతీ! ఎవరైనా జబ్బు పడ్డారని తెలిస్తే, ఎలాగుందని ప్రశ్నించమా? ...ఇంతకీ నీకు ఏం జబ్బు చేసిందిరా?" అంటూ స్నేహితుణ్ణి ప్రశ్నించేడు మాధవ్.

"ఫ్లూ. అంతకన్న మరేం లేదు. ఒంటరివాడి నవడంవల్ల ప్రతి చిన్న విషయానికీ ఆస్పత్రివారి అనుగ్రహం కోరాలి మరి" అన్నాడు జగదీశ్.

జంతర్ మంతర్, జయపూర్ రాజనగరూ, హవామహాల్ చూసేక ముగ్గురంకలిసి మృష్టాన్న భండార్‌లో డిన్నరుతీసుకొన్నాం. మమ్మల్ని రైలెక్కిస్తూ, "ఎప్పుడూ ఆకాశంలో ఎగిరేవాడివి, భూమిమీద ప్రయాణిస్తున్నావేం?" అన్నాడు జగదీశ్.

"ఇంతకాలం బ్రహ్మచారిని కొబట్టి ఆకాశంలో ఎగిరినా, కలలలో తేలినా సరిపోయేది. ఇప్పుడు సంసారినయ్యాను; కొస్త భూమిమీద కాలుమోపి, ముందుదారి చూసుకొంటూ నడక సాగించాలి. అబ్బాయి! కలల జీవితం కరిగిపోయింది. వాస్తవ జీవితం ఎదురుగా ఉంది" అన్నాడు మాధవ్ నన్ను చూస్తూ.

"ఇంతకీ నువ్వేం పనిమీదొచ్చేవో సరిగా చెప్పనేలేదు. ఈ 'పింక్ సిటీ'లో ఇంకా ఎంతకాలం వుంటావు?" అని ప్రశ్నించేడు మాధవ్.

"పనీ లేదు, పాటూ లేదు. నెలరోజులు సెలవు పెట్టేను. ప్యాసులు ఉన్నాయికదాని తిరుగుతున్నాను. మన రాకపోకల కొక నిర్ణయమేమిటి? ఎప్పుడు వెళ్ళిపోవాలనిపిస్తే అప్పుడు రైలెక్కెయ్యడమే" అన్నాడు జగదీశ్, బాధ్యతలు ఏమీ లేనివానిలా.

రైలు కదలబోతూంటే ఆకులతో ఉన్న రెండు ఎర్ర గులాబీలు నా చేతిలో పెట్టేడు జగదీశ్. "మీ ఇద్దరి దాంపత్య జీవితానికి నా శుభాకాంక్షలు" అన్నాడు - మాధవ్‌తో చెయ్యి కలుపుతూ.

జగదీశ్ మాట వచ్చినప్పుడల్లా ఆ గులాబీల పరిమళం జ్ఞాపక

మొస్తుంది నాకు. ఆకులతో కూడిన జంట గులాబీలు-ఎంత చక్కని కానుక - అనిపిస్తుంది.

మేము ఇల్లు చేరుకొనే సరికి అత్తయ్యా, మామయ్యా వచ్చి ఉన్నారు. "ఇక్కడికీ సరదాలు పూర్తయేయి కాబట్టి పిల్లని ఓ నెల రోజులు ఉంచుకొని పంపిస్తాం." అంటూ ప్రయాణం కట్టేరు. వారి కోరిక సక్రమమైనదే అన్నట్లు మాధవ్ పిన్ని, చిన్నాన్న అనుమతించేరు. మరునాడు ప్రయాణం. మాధవ్ సరసను ఎంత సంతోషంగా ఉన్నా తిరిగి అత్తయ్య గారింటికి వెళ్ళి నెల రోజులు ఉండడం అన్నమాట నాకు ఆనందంగానే వినిపించింది. ఆ రాత్రి "వెళ్ళిపోతావా భారతీ?" అన్నాడు, చంటి పిల్లాడిలా గారాబం చేస్తూ, మాధవ్.

"ఎక్కడికో, దేశం విడిచిపోవడం లేదు. పక్క ఊరేకదా! వీలైనప్పుడు మీరూ వస్తుండండి. ఐనా నెల రోజులకల్లా వచ్చేస్తానుగా!" అన్నాను అతన్ని సమాధానపరుస్తూ.

"నువ్వు లేందే నాకు తోచదు." అన్నాడతను.

"ఇవన్నీ మగాళ్ళు పలికే దొంగమాటలని నాకు తెలుసు లెండి, నే లేకుండా ఇంతకాలం ఎలా తోచింది?" అన్నాను దబాయిస్తూ.

"అప్పుడు నువ్వు ఉన్నావని నాకు తెలియదుగా" అన్నాడు మాధవ్ గడుసుగా.

నెల రోజులు మామయ్యగారింట, మాధవ్‌కి దూరంగా, ఉండి వచ్చేసరికి నాకూ అలాగే అనిపించింది. మాధవ్ దగ్గర లేకపోతే, వెన్నెలలేని రాత్రిలా, మధుపాన్ని ఆకర్షించలేని సంపెంగలా, ధ్వనిరహితమైన జలపాతంలా, కెరటాలు విరిగి పడని కడలిలా నా బ్రతుకు అసంపూర్ణం అనుకొన్నాను.

# 2

మాధవ్ పిన్నిని, చిన్నాన్నని అత్తయ్యా, మామయ్యా అనే పిలిచేదాన్ని. నాకు ఆ పిలుపు అలవాటయి ఉండడం వల్ల ఎబ్బెట్టుగా అనిపించేది కాదు. ఆవిడ పేరు భ్రమరాంబ. ఆయన పేరు రామ్మూర్తి. ఆవిడ నన్ను అభిమానంగా చూసేది. ఇంట్లో పనిపాటులన్నీ పనిమనిషి సహాయంతో తనే చేసుకుపోయేది. ఏ పనికైనా, ఏ మాటకైనా ఇంట్లో ఎవరైనా నన్ను ప్రశ్నిస్తే "చిన్నపిల్ల, దానికేం తెలుస్తుంది, నన్నడగండి చెప్తాను" అనేది.

ఈ కోడలు పిల్ల వచ్చి తన చేతిలోని అధికారాన్ని ఎక్కడ హస్తగతం చేసుకుంటుందో అన్న బెంగ ఆమె మనసులో ఉన్నట్లు అనిపించేది నాకు. పూచీ, పేచీ లేకుండా ఇల్లు ఆవిడ చక్కబెట్టుకు పోతానంటే కాదని లాక్కొని యాజమాన్యం నెరపాలన్న కాంక్ష నాకు లేదు.

అకారణంగానే అత్తింట కాలుపెట్టి రెండేళ్ళు గడిచినా నా హోదా కొత్త కోడలుగానే నిలిచిపోయింది. అందుకు నాకేం విచారం కలుగలేదు. ఇంటి బాదరబందీ లేకుండా నేనూ, మాధవ్ కాలాన్ని మా ఇష్టం వచ్చినట్లు కళ్ళెం పట్టుకొని నడుపుకోనేందుకు అవకాశం కలిగిందని ఆనందించేను.

మా వైవాహిక జీవితంలో ఆ రెండేళ్ళూ హనీమూన్ లాగానే గడిచిపోయేయి. మాధవ్ డ్యూటీలో ఉండేటప్పుడు తప్పితే మిగిలిన వేళ అంతా ఇంట్లోవున్నా, బయట తిరుగుతున్నా జంటగానే వుండేవాళ్ళం. మా రాకపోకలకి ఇంట్లో ఎటువంటి విధినిషేధాలూ ఉండేవి కావు. కడుపున పుట్టిన కొడుకైతే అత్త

గారు కోడలిపై తనకు అధికారం ఉంటుం దనుకొంటుంది. కాని భ్రమరాంబ అటువంటి అధికారాన్ని కాంక్షించ లేదు. ఇంట్లో తమ గౌరవానికి భంగం వాటిల్లకుండా సుఖంగా జీవితం వెళ్ళ మారిపోతే చాలని ఆమె అభిప్రాయం.

రామ్మూర్తిగారికి పిత్రార్జితమైన ఆస్తేమీ లేదు. చెప్పుకో వలసినంత పెద్ద ఉద్యోగం కూడా లేదు. ఏదో పేరుకు ఆఫీసుకు వెళ్ళి నాలుగురాళ్ళు తెచ్చుకొంటున్నా సంసారం గడపి ఆడపిల్లల పెళ్ళిళ్ళకు మిగిల్చే మార్గం లేదు. ఒకే కుటుంబంలా మసులుతున్న కారణంగా భ్రమరాంబ కూతుళ్ళ పెళ్ళిళ్ళు మాధవ్ బాధ్యత మీదే జరిగేయి. అనసూయా, అరుంధతీ మాధవ్‌ని స్వంత అన్న గారిలాగే భావిస్తారు. అన్నా చెల్లెళ్ళ బిడ్డల మనే ఎడం వారిమధ్య కనిపించేది కాదు. భ్రమరాంబ కూడా తన కొడుకులాగే మాధవ్‌ని పెంచి పెద్ద చేసింది. ఆ దంపతులపట్ల మాధవ్‌కి ఆదరం, గౌరవం ఉన్నవి.

మాధవ్ ఇంట్లో ఉండే సమయాల్లో అంతా కలసి భోజ నాలు చేసేవాళ్ళం. అతను డ్యూటీలో ఉండి రాత్రి కొంచెం ఆలస్యంగా వస్తాడని తోచిన రోజున భ్రమరాంబత్తా, రామ్మూర్తి మామా ముందుగా భోజనాలు చేసేవారు. నేను మాత్రం మాధవ్ రాకకోసం, ఎంత రాత్రయినా, కనిపెట్టుకొని కూర్చునేదాన్ని.

ఆఫీసు నుంచి బయలుదేరుతూనే మాధవ్ ఫోను చేసేవాడు. నీళ్ళ బాయిలర్ స్విచ్ వేసి, వంటకాలని వేడిచేసేసరికి గుమ్మం ముందు కారు హారన్ వినిపించేది. ఇద్దరం కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేస్తుంటే, ఎంత రాత్రయినా, ఆ విషయం మనసులోకి వచ్చేదే కాదు. ఏ కారణం చేతనైనా అతను రావడం ఆలస్యం అయితే, రాత్రి పన్నెండు దాటిన తరవాత భోజనం చేసిన రోజులు కూడా లేకపోలేదు.

"ఈ రోజు అట్టే లేటుకాదు. తొమ్మిది గంటలు కాకుం డానే వచ్చేస్తాను" అంటూ ఇంటినుంచి వెళ్ళేడు మాధవ్.

"మాధవ్ తొందరగా వచ్చేస్తానన్నాడు కదా, వాడు రానీ, అంతా కలిసే భోజనాలు చేద్దాం" అంది భ్రమరాంబ అత్త.

"అనడం మట్టుకి అన్నా తొమ్మిది దాటుతేనే కాని రారు. వచ్చేక స్నానం చేసేసరికి ఆలస్యం అవుతుంది. ఎందుకు అనవసరంగా మీకు వేళ తప్పడం? మీరు తినకూడదా" అన్నాను.

వారిద్దరి భోజనాలూ పూర్తయేయి. పనిమనిషి మా భోజనం టేబిలు మీద పెట్టి వెళ్ళిపోయింది. నాటికి మా వివాహమై మూడు సంవత్సరాలు పూర్తయింది. వెడ్డింగు యానివర్సరీకి అటు క్రితం రెండు సంవత్సరాలూ కొంతమంది స్నేహితుల్ని డిన్నరుకి పిలిచేము. ఆ సంవత్సరం అదేం జరగక పోయినా మాధవ్ కి ప్రీతి పాత్రమైన పిండి వంటలు, పెరుగు వడలు, బాదంఖీర్ చేయించేను. తెల్లని ఉప్పాడ జరీచీర కట్టుకొని తల్లో తెల్ల చామంతుల మాల పెట్టుకొని అతని రాక కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

తన భోజనం పూర్తయి పక్కచేరిన అరగంటకల్లా రామ్మూర్తి మామయ్య గుర్రు వినిపించింది. "భారతీ! అబ్బాయి ఇంకా రాలేదూ?" అంటూ రెండు మూడు సార్లు ప్రశ్నించి భ్రమరాంబత్త కూడా కళ్ళు మూసింది.

ఓర వాకిలిగా తెరచివున్న కిటికీలోంచి చల్లని వెన్నెల గదిలో పడుతున్నది. తెల్లని వెన్నెల కాంతిలో అగరువత్తుల పొగ పల్చని మేఘంలా పైకి లేస్తున్నది. టేబిలుపై అలారం టైంపీస్ టిక్కు టిక్కు మంటున్న ధ్వని తప్పిస్తే యిల్లంతా నిశ్శబ్దంగా వుంది.

బయట పిండార బోసినట్టున్న వెన్నెల కాళ్ళని ముందుకి లాగింది. గది తలుపు తీసుకొని లాన్ లోకి వచ్చేను. చల్లగాలి రివ్వున చెవుల్లోకి జొరబడింది. దవడలు దడదడ లాడేయి. చలికి పళ్ళు కరుచుకుపోయేయి. 'అబ్బా! బయట ఎంత చలిగా వుంది!' అనుకొంటూ పైట నిండుగా కప్పుకొని గదిలోకి వచ్చి తలుపులు వేసుకొన్నాను.

**ఆ చలిగాలి** అనుభవంతో మూడేళ్ళనాటి సంగతులు జ్ఞాపకం వచ్చేయి. ఢిల్లీనుంచి తిరిగి వచ్చేద్దామనుకొంటున్న సమయంలో మసూరీలో స్నో ఫాల్ అవుతున్నదన్న కబురు తెలిసింది. "నే నెప్పుడూ మంచు పడడం చూడలేదు. పోయి చూద్దాం" అన్నాను.

తెల్లారేసరికి డెహ్రాడూన్ స్టేషన్లో దిగేము. రైలు దిగే సరికి కాళ్లూ చేతులూ చలికి కరడు కట్టుకు పోయేయి. టిఫిన్, కాఫీ తీసుకొని కడుపుని కాస్త వెచ్చపరుచుకొని మసూరీ వెళ్ళాలనుకొన్నాం. టాక్సీవాళ్లు ముందుకు రాలేదు. పదకొండు గంటలకి ఒక్క బస్సు మాత్రం, పైకి వెళ్ళేందుకు, ఉన్నదని తెలిసింది. అదైనా కొంతదూరం వరకే పోతుందనీ, ఆ పైని నడిచి పైకెక్క వలసిందేననీ అన్నారు.

మాధవ్ వులన్ సూటు వేసుకొన్నాడు. నేను ఫుల్ హేండ్సు కాడిగన్ తొడుక్కున్నాను. పైకి వెళ్లాలనే మా ప్రయత్నం చూసిన ఒక స్థానికుడు "మీ కీ బట్టలు చాలవు. మీరు మదరాసీల్లా ఉన్నారు. ఈ చలికి తట్టుకోలేరు" అన్నాడు. అతడి సలహామీద మాధవ్ ఒక ఓవర్ కోటూ, కాశ్మీరీ ఊలు టోపీ కొనుక్కున్నాడు. నా కో లేడీస్ కోటూ, తలకి కట్టుకొందుకు వులన్ స్కార్ఫ్, చేతులకి గ్లౌవ్సు కొన్నాడు.

పదకొండు గంటలకి పదిమంది ప్రయాణీకులతో మెల్లగా బస్సు పైకి ఎక్కడం మొదలుపెట్టింది. కిందగా పచ్చని డెహ్రా డూన్ లోయా, బొమ్మరిళ్ళలా ఇళ్ళూ కనిపించేయి. ఎదురుగా ఎత్తైన కొండ మీద తెల్లగా పిండి జల్లినట్టున్న మసూరీ ఇళ్ళూ, చెట్లూ కనిపించేయి. కొంతదూరం నడిచి బస్సు ఆగిపోయింది. "ఇంక ముందుకిపోదు. సాయంకాలం నాలుగు గంటలకి తిరిగి డెహ్రాడూన్ వెళ్ళిపోతుంది" అన్నారు.

ఇద్దరం బస్సు దిగి ముందురోజు పడిన ఆ మంచులో నడక ప్రారంభించేము. ముందు రోజు అంత మంచు పడినా ఆ రోజు ఫెళ్ళున ఎండ వచ్చింది. ఆ ఎండ తెల్లని మంచుపై కళ్ళు చీకట్లు కమ్మేలా వెలుగునైతే ప్రసాదిస్తున్నది కాని వేడిలేదు.

మనుష్యుల రాకపోకలవల్ల నలిగిన మంచు గట్టిపడి ఇక్కడ కాలు పెట్టితే అక్కడికి జారుతున్నది. ఒకటి రెండుసార్లు కాలు జారి పడబోయేను. "ఇక్కడ మంచు మెత్తగా ఉంది. ఇటు నుంచి నడు" అన్నాడు మాధవ్. కొత్తగా పడిన ఆ మంచు ముద్ద కర్పూరంలా, అప్పుడే పేరుకొంటున్న నెయ్యిలా, మెత్తగా,

తెల్లగా, స్వచ్ఛ స్ఫటికంలా ఉంది. కాలు వేస్తే మోకాళ్ళ వరకూ కూరుకుపోతున్నది.

మాధవ్, నేనూ చేతులు పట్టుకొని మెల్లగా ఆ కొండ దారిలో ప్రయాణించేము. నాలుగడుగులు నడిచేసరికి ఊపిరి అందక సతమతమయే మమ్మల్ని చూసి తమాషాగా నవ్వి తన్నారు పోయే వారు అక్కడి స్థానికులు.అంత చలిలోనూ,తగినన్ని బట్టలు లేకుండా, బరువులు మోసుకుంటూ, సరదాగా కబుర్లు చెప్పుకొంటూ పోతున్న వాళ్ళని చూస్తే మనిషికి అలవాటుని మించిన ఆధారం లేదని పించింది.

"మనలా చలికి ముడుచుకు కూర్చుంటే వాళ్ళ పొట్టలు నిండవు. అందుకే చలి వారి నిట్టే బాధించదు" అన్నాడు మాధవ్.

అంత ఎత్తూ ఎక్కి బజారు వీధిలో కాలు పెట్టేసరికి నాకు ఊపిరి ఆగిపోయినట్లు అయిపోయింది. కాస్త వేడి కాఫీ గాని, టీ గాని గొంతుకలో పోసుకోనిదే బ్రతకలేననిపించింది. దగ్గరగా ఉన్న ఒక హోటల్లో కాలు పెట్టేం. లోపల అంతా కటిక చీకటిగా ఉంది. ఎక్కడ ఏమున్నదీ ఏమాత్రమూ కనిపించలేదు. కళ్ళకేమయిందని ఇద్దరం మనసులో భయపడ్డాం. రెండు నిమిషాల పాటు కళ్ళు మూసుకొని అక్కడే నిలబడిపోయేం. కళ్లు తెరచి చూసేసరికి ఒక్కొక్క వస్తువా ఛాయా మాత్రంగా కన్పించ సాగింది. క్రమంగా హాల్లోని కుర్చీలు, బల్లలు, మనుష్యులు కని పించేరు. ఎండలో మంచులో అంతసేపు తిరిగిన ఫలితం మమ్మల్ని రెండు నిమిషాలపాటు అంధుల్ని చేసింది.

ఒక ప్రక్కగా వున్న టేబిలుముందు కూర్చుని కచోడీ, టీ తెమ్మని ఆర్డర్ చేసేడు మాధవ్. కచోడీ, ఆలుచోలా తిని వేడివేడి చాయ్ తాగుతుంటే వంటిలోని నీరసం, వంటిని పట్టిన చలీ మెల్లగా సర్దుకొన్నాయి.

ఎదురుగా గోడకున్న 'ఫైర్ ప్లేస్‌లో' కర్రలు చిటపట మంటూ మంట నందుకొనే సరికి ఒక్కసారిగా గదంతా ఎర్రగా వెలిగి వెచ్చదనాన్ని పంచిపెట్టింది. చితుకుల్లాటి కర్ర పేళ్ళని

మంటలో వేస్తూ నలుగురైదుగురు మనుష్యులు అక్కడ చలి కాచుకొంటున్నారు. వాళ్ళ రూపురేఖల్నిబట్టీ, మాటల తీరునిబట్టి వాళ్లు ఆ హోటలు సర్వర్లని తెలుస్తుంది. మా టేబిలుకి కొంచెం దూరంలో హోటల్ ప్రొప్రయిటర్ ఎలెక్ట్రిక్ హీటర్ పెట్టుకొని చలికాగుతున్నాడు.

ఒక్కసారిగా వీధివైపు ఉన్న తలుపు తెరుచుకొనేసరికి గదిలో వెచ్చదనం అంతా పలాయనం చిత్తగించి బయటి చలిని లోపలికి ప్రవేశపెట్టింది. తలుపు తెరుచుకొని వచ్చిన ఆ వ్యక్తిని చూస్తే నిప్పుల్లో కూర్చున్న వారికి కూడా చలివేసేలా ఉన్నాడు. వెనక్కి పింజపెట్టి కట్టిన చిన్న పంచ, పైన నేతగుడ్డతో కుట్టిన కళ్ళీ లాల్చీ, తలమీదుగా కప్పుకొన్న పలచని ఊలు శాలువా అతని దుస్తులు. కాళ్ళకి చెప్పులులేవు. ఇంక సాక్సు, గ్లోవ్సు, ఓవర్ కోటు మాట చెప్పేందుకేముంది? పొట్టిగా, బక్కపలచగా ఉన్న అతని వయసు ఏభైకి పైనే ఉంటుంది. వెండి తీగెల్లా తెల్లగా మెరుస్తున్న గడ్డం ఉన్న వయస్సుని పెంచి చూపుతుంది.

ఈ చలిలో, ఈ మంచులో, ఒంటినిండా సరియైన బట్టలు లేకుండా కొండమీదికి వేంచేసిన ఈ వెర్రివాడెవరా అని చూసేను. అతడు ఒంటరిగా రాలేదు. అతణ్ని తోడుకు వచ్చిన వ్యక్తి ప్రొప్రయిటర్‌తో ఏమో చెప్పాడు. యజమాని పిలుపు విని సర్వర్లు పరిగెత్తుకుంటూ వచ్చేరు. నాలుగైదు నిమిషాలపాటు అంతా ఒకటే హడావిడి. ఒకడు ఫైర్ ప్లేసుముందుగా ఒక మంచి కుర్చీ అమర్చేడు. మరి ఒకడు వేడిపాలు గ్లాసుతో తెచ్చి అందించేడు. యజమాని ఆజ్ఞమీద బయటికి వెళ్ళిన వ్యక్తి ఒక ఉన్ని కంబళీ తెచ్చి ఆ వచ్చినతని నడ్డిమీద కప్పేడు.

ఎవరేం చేస్తున్నా తనను కాదన్నట్టు కూర్చున్నాడు అతడు. ‘‘ఎవరీ వింత వ్యక్తి? అంతా ఎందుకింత ఆర్భాటం చేస్తున్నారు?’’ అన్నాను. నా ప్రశ్నని మాధవ్ ప్రొప్రయిటర్ ముందు పెట్టేడు. ‘‘హృషీకేశ్ బాబాజీ. గొప్ప మహాత్ముడు. మీకు తెలియదా’’ అన్నాడు చేతులు జోడిస్తూ.

"అది సరే. అయితే మహాత్ముడు కావచ్చు కాని ఈ చలిలో ఎందు కిలా వచ్చినట్టు?"

నా మాట ఉచ్చారణ విని "మీరు మదరాసీలా? బాబాజీ కూడా మదరాసీయే" అన్నాడు, అతన్ని తీసుకువచ్చిన వ్యక్తి. ఉత్తర భారతంలో చాలామందికి దక్షిణాదిని ఆంధ్ర, మైసూరు, కేరళ, మద్రాసు అని నాలుగు రాష్ట్రాలు ఉన్నాయనీ, వారి భాషలు, అలవాట్లు భిన్నంగా వుంటాయనీ తెలియదు. అందర్నీ ఏక ఉమ్మడిగా మద్రాసీ లంటారు. "మేము ఆంధ్రులం" అన్నాడు మాధవ్, వచ్చీరాని హిందీలో. "మీరు తెలుగువారా?" ఈసారి ప్రశ్న స్వచ్ఛమైన తెలుగులో వచ్చింది. ఆ ప్రశ్న వేసిన బాబాజీ మా వంక చూస్తున్నాడు.

మేమిద్దరం అతనికి దగ్గరగా వెళ్లేం. బాబాజీ, మర్యాదగా, "రండి, కూర్చోండి" అన్నాడు, పక్కనున్న కుర్చీలు చూపుతూ.

అతడు పన్నెండవ ఏట ఇంటిలో ఏదో చిన్న దొంగతనం చేసి తల్లిదండ్రులకి తెలుస్తే కొడతారని ఇంటినుంచి పరారీ అయేడట. దారిలో తారసపడిన ఒక సన్యాసుల ముఠాతో కలిసి చాలా కాలం దేశం నలుమూలలా తిరిగేడట. కొంచెం ప్రాజ్ఞత వచ్చి, తను చేసిన పనిలోని తప్పు తెలుసుకొని తల్లిదండ్రులని చూడాలనీ, వృద్ధాప్యంలో వారికి ఆసరా కావాలనే కోరికతో ఇంటికి వెళ్లేసరికి అకస్మాత్తుగా వచ్చిన వరదకి కుటుంబపు సభ్యులంతా బలి అయిపోయేరని తెలిసి, అంత వరకూ భుక్తికోసం అవలంబించిన సన్యాసాన్ని ముక్తికోసం స్వీకరించేడట. అతడికి హృషీకేశ్‌లో ఆశ్రమం ఉందిట. చాలామంది శిష్యులు - మానసికంగా, శారీరకంగా గాయపడిన దుఃఖితులు, ఆర్తులు - ఆశ్రమంలో ఉంటారుట.

మాధవ్ అడిగిన ప్రశ్నలకి అతడు చెప్పిన జవాబుల వల్ల తేలిన సంగతి ఇది:

"ఈ చలిలో ఇక్కడి కెందుకు వచ్చేరు? ఏదైనా మత సంబంధమైన పని ఉండి వచ్చేరా, లేక మాలాగే స్నో ఫాల్ చూసిందికి వచ్చేరా?" అని ప్రశ్నించేడు.

దానికి అతడు తమాషా అయిన జవాబు చెప్పేడు: "కష్ట సుఖాలు, ఆకలి దప్పులు, శీతోష్ణపు బాధలు అన్నీ శరీరానికే తల్లీ! పరమాత్మ స్వరూపమైన ఆత్మ కివేవీ అంటవు. ఈ శరీరాన్ని కష్ట పెట్టందే మనసు లొంగుబాటుకి రాదు. మనసు లొంగందే ప్రాపంచిక వాసనలు దూరం కావు. ఇది శరీరానికో శిక్ష. మనసుకో పరీక్ష. అంతకన్నా ఏం లేదు" అన్నాడు.

"శరీరాన్ని కష్టపెట్టడమే అతని ఉద్దేశం అయితే ఆ పాలెందుకు తాగాలి? నిప్పు దగ్గర వెచ్చగా కాచుకొంటూ కంబళి ఎందుకు కప్పుకోవాలి?" అని అడగా లనుకొన్నాను.

'ఇదో రకమైన నాటకంలే' అన్నట్టు మాధవ్ నా వైపు చూసి, "పద భారతీ! ఇంకా ఊళ్లో తిరిగిచూడాలన్నావు" అన్నాడు. "ఎప్పుడైనా హృషీకేశ్ వస్తే మీ ఆశ్రమానికి వచ్చి చూస్తాం" అని అతని దగ్గర సెలవు పుచ్చుకొన్నాం.

వెచ్చగా ఉన్న హోటలు గదిలోంచి పైకి వచ్చేసరికి చలి మరీ వణికించసాగింది. అంతవరకూ వున్న వెన్నెలలాంటి ఎండ కూడా తగ్గిపోయింది. మేము ఊరి చివరికి చేరేసరికి నాలుగు పక్కల నుంచీ మేఘాలు కమ్ముకొస్తూ, చూస్తుండగానే ఆ కాస్త వెలుతుర్నీ మింగి ఊరుకున్నాయి. చల్లటి గాలి రివ్వురివ్వుమని ఆకులులేని చెట్టు కొమ్మల్నీ, అసలే చలితో బాధపడుతున్న మనుషుల్నీ వణికించ సాగింది.

అంతవరకూ తెల్లగా వెండిలా మెరుస్తున్న దూరపు కొండలు మేఘాల ఆలింగనంతో నీలవర్ణం అద్దుకొన్నాయి. ఆ నీలవర్ణం చూసి ఆనందించవలసిందే కాని ఈ విధంగా ఉంటుందని విడమరిచి చెప్పడం కష్టం.

శ్రీకృష్ణుణ్ణి నీలమేఘశ్యాముడని పురాణాలలో వర్ణిస్తారు. గోపాలుని శరీరవర్ణం ఇంత మనోహరంగానూ వుండేదేమో? ఆ కారణం గానే గోపికలు అతనినుంచి కళ్ళు తిప్పుకోలేక, సంఘపు కట్టు బాట్లని కూడా లెక్కచేయక, వెంట వెంట తిరిగేవారేమో అని పించింది నాకు. నిజంగా శ్రీకృష్ణుని శరీరవర్ణం ఈ నీలవర్ణాన్ని

పోలివుంటే ఆ పురుషుడు ఎంత అందంగా వుండేవాడో ఊహించుకోలేకపోయాను.

ఆ సుందర దృశ్యాన్ని, ఆ ప్రకృతి వైభవాన్ని ఎంత చూసినా తనివి తీరలేదు. "ఇంక బయలుదేరకపోతే వర్షంలో తడిసిపోతాం" అన్న మాధవ్ హెచ్చరికతో తప్పనిసరిగా కాలు కదిపేను.

మాధవ్ అన్నంతా అయింది: మేము రెండు ఫర్లాంగులైనా నడవకుండానే చినుకులు ప్రారంభించాయి. బస్సు నిలిచిన చోటుకి చేరుకోవాలంటే ఇంకా నాలుగైదు మైళ్ళ దూరం నడవవలసి వుంది.

చెయ్యీ, చెయ్యీ కలుపుకొని తొందరగా అడుగులు వేస్తున్నాం. కాని, మంచులో కాళ్ళు కూరుకుపోతుండడంవల్ల నడక తెమలలేదు. అతిథులమైన మమ్మల్ని అట్టే బాధపెట్టడం ఇష్టంలేనట్టు చినుకులు తగ్గిపోయేయి.

చల్లనిగాలి మరోసారి వీచి తగ్గింది. నేను తలఎత్తి ఆకాశం వంక చూసేను. మేఘావృతమైన నల్లని ఆకాశంలో తెల్లని చిన్న తూనీగల్లా ఏవో ఎగురుతున్నాయి. అలా చూస్తుండగానే వాటి సంఖ్య లెక్కకు మించి తయారయింది.

"మాధవ్, ఏమిటవి?" అంటూ అతనివైపు చూసేను. మాధవ్ తలంతా తెల్లగా...

"స్నో ఫాల్...స్నో ఫాల్!" చిన్న పిల్లలా అరుస్తూ గంతులు వేసేను. భూమ్యాకాశాల మధ్య కట్టిన తెల్లని తెరలా, తెరిపిలేకుండా మంచు ఒత్తుగా కురవసాగింది. ఏదో అజ్ఞాతశక్తి "హూష్" అనగానే ఆ ప్రదేశమంతా కర్పూర పరాగం తెరలు తెరలుగా వీచినట్లు తెల్లబడిపోయింది. ఇళ్ళ కప్పులమీద, చెట్ల కొమ్మలమీద ఎలెక్ట్రిక్ తీగలమీద, నడుస్తున్న మనుషులపైని దూది పింజకన్న తేలికగా, పేరుకొన్న సబ్బు నురుగులా పలుచని బిళ్ళలుగా మంచు కురిసింది.

మాధవ్ నన్ను తన ఓవర్ కోటులోకి తీసుకొన్నాడు. ఓవర్ కోటుపైనంతా తెల్లని మంచు. టోపీ పై భాగమంతా మంచుతో కప్పిపోయి తలమీద కిరీటంలా నిలిచిపోయింది.

ఓహో, ఏమి అనుభవం! ఈ రోజుని జీవితంలో మరచి

పోలేను. "ఇలా ఎంత సేపు పడుతుందో, ఎంత ఒత్తుగా పడుతుందో ఈ రాత్రికి ఉండిచూద్దాం" అన్నాను.

ఏవో ఒకటి రెండు చిన్న హోటళ్ళు తెరిచివున్నా మంచి హోటళ్ళన్నీ మూతబడి వున్నాయి. చలికి వెరచి అంతా దిగువకి వెళ్ళిపోయేరు. "రాత్రి ఇక్కడే వుంటే ఈ చలికి చచ్చిపోతాం. ఏ న్యుమోనియాయో పట్టుకొంటుంది. ఆ కొత్త దారీ కూడా మూసుకుపోతే ఈ పాతిక ముప్ఫయి మైళ్ళూ కాలినడకను పోవలసి వుంటుంది. పద...పద" అని మాధవ్ తొందర చేసేడు.

తొందరగా నడుస్తుంటే రోడ్డుకి లోయ వైపుగా ఉన్న ఇనుప కమ్మీల్ని పట్టుకొని ఎవరో వ్యక్తి ఎదురుగా ఉన్న ఇంద్ర నీలచ్ఛాయ పర్వతాలపై వెండిపొడిలా పడుతున్న మంచుని తన్మయత్వంతో చూస్తున్నాడు. అతడి ఒంటి నిండా మంచు పేరుకొని వుంది; అయినా అతనికి ఆ దృష్టే లేదు.

"ఇంత చలిలో అంత నిలకడగా నిలబడి చూస్తున్నాడు. ఎవరో స్థానికుడై వుంటాడు" అన్నాడు మాధవ్.

"తరచు చూసేవారికి అంత ఆనందపారవశ్యం కలగడం కష్టం. ఎవరో మనలాంటి టూరిస్టే అయివుంటాడు" అన్నాను నేను.

"అంతటి అదృష్టం మనకూ కలుగుతే! శీతోష్ణాల బాధ లేకుండా అలా నిలిచిపోగలిగితే!"

"ఈ మసూరీలోనే శాశ్వతంగా ఉండిపోతాం. మన పరలోకయాత్ర సంగతి ఇంటికి తెలియజేసేవారు ఎవరూ ఉండరు" అంటూ చేయిపట్టుకొని తొందరగా అడుగులు వేసేడు మాధవ్.

దగ్గరికి చేరాక చూస్తే ఆ వ్యక్తి అంతకు పూర్వం హోటల్లో చూసిన బాబాజీయే అని గుర్తించేము. ఆ హోటలు యజమాని తెప్పించి కప్పిన కంబళి అతని ఒంటిమీద లేదు. మేము ముందుగా చూసినప్పుడు ఏ దుస్తుల్లో ఉన్నాడో అలాగే వున్నాడు. ఇతడికి నిజంగా చలివెయ్యదా, లేక కావాలనే శరీరాన్ని బాధపెడుతున్నాడా? అనుకొన్నాను.

"బాబాజీ, జబ్బు చేస్తుందేమో! దిగువకి వెళ్ళిపోండి" అని హెచ్చరించి, మేము ముందుకి సాగిపోయేము.

హిమాచ్ఛాదితమైన మసూరీ కన్పిస్తున్నంత సేపూ వెనుదిరిగి చూస్తూనే ఉన్నాను. కొండదారిలో బస్సు క్రిందికి పోతున్నకొలదీ మసూరీ దృశ్యాలు కనుమరుగయి పోయేయి.

ఆ రోజు తలపుకి వచ్చినప్పుడల్లా ఆ అనుభవంతో ఒళ్ళు పులకరిస్తుంది. హిమాలయ సానువులలో ప్రకృతిమాత ఒడిలో పెరుగుతున్న ఆ ఊరూ, మనసుల్ని ఉర్రూత లూగించే ఆ మంచూ, ఈ ప్రకృతి దృశ్యాలచే ప్రభావితులు కాకుండా సమాజరీతుల్లో తమ జీవితాలని నడుపుకు పోతుండే ఆ కొండప్రజలూ--ఎంత కాలం గడచినా మరపుకిరాని విషయాలుగా నా మనసులో నిలిచిపోయేయి.

మసూరీ స్నోఫాల్ ఆలోచనలతో మాధవ్ రాకకోసం ఎదురు చూస్తున్నానన్న సంగతే మరిచిపోయేను. టెలిఫోన్ బెల్ ఎంతసేపై మోగుతున్నదో! ప్రక్కగదిలో నిద్రపోతున్న భ్రమరాంబత్తయ్య "అమ్మాయి భారతీ! టెలిఫోన్ వాగుతున్నదే" అనే వరకూ. నాకు వినిపించనే లేదు. ఎంతసేపై అలా గంట కొడుతూందో! నిద్రపోయే ననుకొనివుంటాడు మాధవ్.

"ఏమిటి సంగతి? పది దాటకుండానే అమ్మాయిగారు కునుకు తీస్తున్నారా?" అంటాడు. దానికి నే చెప్పబోయే సమాధానాన్ని ఆలోచిస్తూ అప్రయత్నంగా టైంపీసు వైపు చూసేను. పదకొండు. ఇంత రాత్రిదాకా మాధవ్ ఎందుకు రాలేదు? ఆత్రంగా వచ్చి రిసీవర్ అందుకొన్నాను.

"హల్లో!" అన్నాను, గొంతుక సవరించుకుంటూ.

"హల్లో! ఎవరు మాట్లాడుతున్నారు? మిసెస్ మాధవరావేనా? నేను ఇండియన్ ఎయిర్ లైను ఆఫీసునుంచి మాట్లాడుతున్నాను."—అవతలి గొంతుక. అపరిచితమయిన గొంతుక.

"అవును. మిసెస్ మాధవరావే మాట్లాడుతున్నది." నా కంఠంలో ఏదో తెలియని మార్పు వచ్చింది. గొంతుకు అడ్డంగా ఏదో పడినట్టు అనిపించింది.

"మేడమ్! మీ కొక విచారకరమైన వార్త చెప్పడానికి సందేహిస్తున్నాను. మిస్టర్ మాధవరావు నడుపుతున్న విమానం

తప్పిపోయింది. దానికోసం వెతికే ప్రయత్నాలు జరుగుతున్నాయి. కొద్దిసేపట్లో నే వివరాలు తెలుస్తాయనుకొంటున్నాము. తెలియగానే మీకు ఫోన్ చేస్తాము. మీరేం కంగారు పడకండి. వాతావరణం సరిగాలేని కారణంగా ఎక్కడైనా తప్పనిసరిగా దింపివేయవలసి వచ్చిందేమో! అంతా సరిగా ఉంటుందని ఆశిద్దాం. మళ్ళీ పిలుస్తాను..."

అతడి మొదటి వాక్యం చెవిలో పడ్డాక మిగిలినదంతా ఏదో గొణిగినట్లే అనిపించింది నాకు. చాలా సేపటివరకూ చేతిలో రిసీవర్ అలాగే పట్టుకొని కొయ్యలా కూర్చున్నాను. "భగవంతుడా! నాకేం ఆపద తెచ్చిపెట్టకు!! నేనేం పాపం చెయ్యలేదు. నేనెవరికీ అన్యాయం చెయ్యలేదు." అంటూ చేతులు జోడించి మొర పెట్టు కొన్నాను.

టెలిఫోన్ గంట విన్న భ్రమరాంబత్తయ్య "అబ్బాయేనా, భారతీ, ఫోను చేస్త?" అంది. ఆ విషయం ఆవిడతో చెప్పాలని నాలుక చివరివరకూ మాట వచ్చింది. అలా చెప్పివుంటే నా బాధని, భయాన్ని పంచుకొనే వారు ఉంటారు. మాధవ్ క్షేమంకోసం భగవంతుణ్ణి ప్రార్థించేవారి సంఖ్య పెరుగుతుంది. కాని, నేను చెప్పలేదు. అంత ఆందోళనా నేనే భరించేను. అందరివంతూ నేనే దేవుణ్ణి ప్రార్థించేను. మొదటిసారి ఫోను మోగిన గంటకి మళ్లా మోగింది. ఆ గంటా నా కొక యుగంలా అనిపించింది. కదలకుండా మొండికేసిన వాచీ ముళ్ళని చూడలేక గడియారాన్ని వెనక్కి తిప్పి పెట్టేను. మనసులో చేరిన చీకటిని పారదోలేందుకు గదిలో లైట్లన్నీ వెలిగించేను. టెలిఫోను మంచం మీద పెట్టుకొని మధ్యగా మండిగం వేసుకొని కూర్చున్నాను. గంట మ్రోగగానే, ప్రాణంలేని ఆ వస్తువుకి "మంచి వార్త అందించ"మని ప్రణామంచేసి ఫోను ఎత్తు కొన్నాను.

"మిసెస్ మాధవ్, ఇంకా ఏం తెలియలేదు."

ఆ రాత్రల్లా అదేమాట! గంటగంటకీ టేపు రికార్డు చేసి నట్టు వినిపించింది. కాలం గడుస్తున్నకొద్దీ నా హృదయం భారంగా మొద్దుపోయింది. ఉదయం అయేసరికి నేను రాతి బొమ్మనయి

పోయేను. టెలిఫోను మ్రోగినప్పుడల్లా యాంత్రికంగా అందుకొంటున్నాను. మెల్లగా పెట్టేస్తున్నాను. ఆ రెండు రోజుల్లో నా కంఠం ఆఫీసులో చాలామందికి పరిచయమైంది. నేను ఫోను చెయ్యగానే, "ఇంకా ఏం తెలియలేదమ్మా" అనే జవాబు వచ్చేది. మధ్యమధ్య ధైర్య వచనాలూ, ఓదార్పు మాటలూ వున్నా సారాంశం మాత్రం అదే—ఇంకా ఏం తెలియలేదు.

ఎన్నిసార్లు వాళ్లు ఫోనుచేసినా, నేను చేసినా అదేమాట! "ఇంకా ఏం తెలియలేదు; ఇంకా ఏం తెలియలేదు." రెండు రాత్రులు, రెండు పగళ్ళు ఆ మాట విని విని నాకు పిచ్చెత్తిపోయింది.

"కాదు. మీకు తెలిసేవుంటుంది. నన్నెందుకిలా బాధపెడతారు? నిజం చెప్పండి. ఏం జరిగిందో చెప్పండి" అంటూ గట్టిగా అరిచేను. క్షణకాలం అటునుంచి మాటే లేదు. అక్కడ వున్న వ్యక్తి మెల్లగా గొంతుక సవరించుకొని, "మీరు కంగారు పడకండమ్మా. ఇటువంటి సమయంలో ధైర్యంగా ఉండటం అవసరం. మాధవ్ క్షేమంగా తిరిగి వస్తాడు. భగవంతుడు దయామయుడు" అన్నాడు.

ఈ సానుభూతి వాక్యాలు నా కక్కరలేదు. నాకు యథార్థం కావాలి. మాధవ్ విమానాని కేమయిందో తెలియాలి. నిప్పులాంటి నిజం తెలియాలి. అది చురకైనా సరే! నన్ను మాడ్చి మసి చేసినా సరే—భరిస్తాను కాని, ఈ విధంగా నిరీక్షించలేను. ఈ చిత్రవధ భరించలేను. మాధవ్ కేం జరిగిందో తెలియకుండా జీవితాంతం ఇలా ఎదురు చూడలేను. "భగవాన్! నన్నింక పరీక్షించకు. ఈ బాధనుండి నాకు విముక్తి కలిగించు!!" అని ప్రార్థించేను.

నా ఒంటిలోని శక్తి క్షీణించి, కళ్ళలో నీళ్ళు ఇంకి, మనసులోని ఆర్ద్రత నశించేక శవసదృశంగా ఉన్న నా చెవిలో ఎవరో ఊదేరు ఆ వార్త.

ఆ వార్త విని నేను గొల్లుమని ఏడవలేదు. ఏడ్చేందుకు నా కళ్ళలో నీళ్ళు మిగిలిలేవు. బాధపడేందుకు నా మనసుకి శక్తి లేదు.

మూడురోజుల వేదనతో కూడిన నా హృదయం ఎడారిలా ఉంది. అందులో నీళ్ళు పోసినా, పాలు పోసినా ఏ ఆనవాళ్ళూ నిలవకుండా ఇంకిపోతాయి.

నా పరిస్థితి చూసి అత్తయ్య ముఖం తిరుగుతున్నదనుకొని వుంటుంది. గ్లాసుతో పాలు తెచ్చి నోటికి అందించింది. మూడు రోజులైె మంచినీళ్ళయినా నోట పొయ్యని నేను ఆ పాలు తాగేను.

పగవారి చావు కబురు వింటే పాలు తాగుతారుట! మాధవ్ నాకు పగవాడు కాదు. అందరినీ మించిన ఆత్మీయుడు. జీవితంలోని మాధుర్యాన్ని చవిచూపించిన ప్రియుడు. రెండు శరీరాలు ఉన్నా ఒకే మనసుగా మసలిన జతగాడు. ప్రాణమంత ప్రీతిగా ప్రేమించిన వ్యక్తి. అతడు శాశ్వతంగా దూరమయ్యేడు. నేను చూడలేని లోకానికి వెళ్ళిపోయాడు. అయినా నేను అత్తయ్య నోటి ముందు పెట్టిన పాలని ఒక్క గుక్కలో త్రాగి వేసేను.

మాధవ్ చచ్చిపోయేడు. భ్రాంతి ప్రతీ వుంది—అంతే కారణం.

మూడు రోజులుగా ఆశా నిరాశల మధ్య నలిగిన మనసు నీరసంగా వాలిపోయింది. ఏ అనుభూతీ తెలియనంతగా మొద్దుబారి పోయింది. చుట్టు పక్కల ఏం జరుగుతున్నదో తెలుసుకోవలసిన అవసరం లేదన్నట్టు కళ్ళు మూతలుపడ్డాయి. చుట్టపక్కాల ఓదార్పులూ, రోదన ధ్వనులూ చొరనంత గట్టిగా చెవులు తాళం వేసుకొన్నాయి. చావు బ్రతుకుల మధ్యగా కాలం దొర్లిపోయింది.

* * *

మాధవ్ మరణంతో నా జీవితానికో తెర పడింది. ఆ తెర తొలగించి బయటి ప్రపంచాన్ని చూడాలనే కోర్కె నాకు కలగ లేదు. ఇంటికి పరామర్శకి వచ్చిపోయే బంధువులు, స్నేహితులు ఆయాచితంగా అందించే సానుభూతి వాక్యాలు, ఓదార్పులు, వేదాంత చర్చలు, వైరాగ్య బోధలూ తెరవెనక నీడల్లా నన్నంటకుండానే సాగిపోయాయి.

అత్తయ్యా, మామయ్యా నన్ను కంటికి రెప్పలా చూసుకొనే

వారు. నాకు ఓదార్పు కలిగేందుకూ, కోలుకొనేందుకూ వారు చెయ్య గలిగినదంతా చేసేవారు. అత్తయ్యకి శ్రావ్యమైన కంఠం వుంది. తీరుబడి వేళలలో నా పక్కన కూర్చుని అధ్యాత్మ రామాయణ కీర్తనలూ, తరంగాలూ పాడుతుండేది. మామయ్య ఎక్కడెక్కడి నుంచో మంచి పుస్తకాలు తెచ్చి ఇస్తుండేవాడు.

"తల్లీ! ఇటువంటి సమయంలో నిజమైన ఓదార్పు గ్రంథ పఠనం వల్లే కలుగుతుంది. కష్టసుఖాలు చవిచూసిన మహాత్ములు జీవితాన్ని తరిచి చూసి ఎన్నో సత్యాలని మన కళ్ళముందుంచేరు. వాటిని అర్థంచేసుకొని ఆచరణలో పెట్టుకో గలిగితే మనసుకి ప్రశాంతత కలుగుతుంది. మనం, మన కష్టాలూ ఏ పాటివి—అనిపి స్తుంది." అనేవాడు మామయ్య.

నా ప్రమేయం లేకుండానే కాలచక్రం ఒక చుట్టు తిరిగి, చలిగాలులు వీచే సమయంలో నన్నొకసారి పలకరించింది. ఆ పలక రింపు నాకు ఆనందాన్ని కలిగించలేదు. మధురమైన మనూరీ అను భవాల్ని గుర్తుకు తేలేదు. మాధవ్ కోసం అయోమయంగా నిరీ క్షించిన ఆ మూడురోజుల వ్యథనీ జ్ఞప్తికి తెచ్చింది. మాధవ్ అకాల మరణాన్ని కళ్ళముందు తిప్పింది. ప్రయత్న పూర్వకంగా, ఆనాటి సంగతులని, మనసులో అడుగుకి తోస్తున్న సమయంలో భ్రమరాంబత్తయ్య వచ్చింది.

ఇంట్లో కాలు పెడుతూనే "అయ్యో నా తల్లీ! ఎలా అయి పోయావే" అని కౌగలించుకొని ఏడ్చింది. మాధవ్ మరణం ఆవిడ కేమీ తక్కువ దుఃఖం కలిగించలేదు. మనిషి పాలిపోయి పెద్ద జబ్బు పడి లేచినదానిలా వుంది. కౌగిలించుకొని యిద్దరం మనసు తేలిక పడేలా, ఏకరోదనగా రోదించేం. కొంతసేపయ్యాక "ఏం చేస్తాం తల్లీ! మన రాతిలా రాసి వుంది. ఊరుకో!" అంటూ నన్ను ఊరడించింది.

బాధ కొంత ఉపశమించేక ఎవరి ఓదార్పు లేకపోయినా దుఃఖం దానంతటదే తగ్గుతుంది. పంచుకునే వారు ఉంటే మనసు ఒకప్పుడు కొంత తేలికపడుతుంది.

భ్రమరాంబత్తయ్య మాధవ్ చిన్ననాటి చర్యలు, అతనికి

నచ్చిన కన్యని వెదికేందుకు తనుపడ్డ శ్రమ, మా సంబంధం స్థిరపడ్డాక అతడు పొందిన ఆనందం - ఘట్టాలవారీగా చెపుతుంటే, మాధవ్ పక్కనుండి చిలిపిపనులు చేస్తున్నట్టూ, అల్లరిగా మాట్లాడు తున్నట్టూ అనిపించింది.

ఆ నెలతో రామ్మూర్తిగారి ఉద్యోగకాలం పూర్తి అవు తుంది. ఎక్కడ వుండడం, ఎలా బ్రతకడం అన్న సమస్య వారికి ఎదురయింది. భ్రమరాంబత్తయ్య తన ఆందోళన నా ముందు వెల్లడించింది.

"వాడే మా కొడుకని, మా బ్రతుకులు చల్లగా వెళ్ళమార్చి తలకింత కొరివి పెడతా డనుకొన్నాం. ఈ విధంగా అర్ధాంతరంగా ఏ ఆధారం లేకుండా మమ్మల్ని విడిచిపెట్టి పోతా డనుకోలేదు" అంది.

"మాధవ్ లేని లోటు నే తీర్చలేను అత్తయ్యా. కాని, అతని ఆత్మీయులుగా మిమ్మల్ని గౌరవించగలను, అభిమానించ గలను. రంగాపురంలో మాధవ్‌కి కొంచెం పొలం, యిల్లు వుంది కదా? ఆ ఊరి గాలి, నీరు మంచిదే అంటారు. మీరు అక్కడికి వెళ్ళివుంటే బాగుంటుందేమో. మామయ్యగారికి కూడా పల్లె పట్టు ప్రశాంతంగా వుంటుంది" అన్నాను.

తను ఆశించిందీ, నేను అన్నదీ ఒకటే కావడంతో ఆవిడ సంతోషించింది.

"నీ మనసు నాకు తెలుసు తల్లీ. మీ మామయ్యగారితో ఆ మాటే అన్నాను" అంది తృప్తిగా.

ఆ వృద్ధ దంపతులకి ఆ మాత్రం ఆధారం చూపగలిగినందుకు నేనూ సంతోషించేను.

"అమ్మాయ్! రాతకోతల మాటేం ఎత్తబోకు. వాళ్ళకి ఆడపిల్లలు వున్నారు. మళ్లా వారసత్వం అంటారు" అన్నాడు మామయ్య మెల్లగా.

# 3

రెండవ సంవత్సరం గడిచేసరికి నాకో నియమబద్ధమైన జీవితం ఏర్పడిపోయింది. ఆలోచనల ఆస్కారం లేకుండా అలా రోజులు గడిచిపోవడం హాయి అనిపించింది. ఆకలి అయితే యింత తినడం, నిద్రవస్తే నిద్రపోవడం, కొంతసేపు చదువుకోవడం, కొంతసేపు పెరట్లో, యింట్లో, యిటూ అటూ తిరగడం అంతకు మించిన పనిలేదు. చెయ్యాలన్న ఆసక్తీ లేదు.

తల కుళ్ళుపడితే తలంటు పోసుకోమని అత్తయ్య చెప్పాలి. బట్టలు మాస్తే పెట్టెలోవి అత్తయ్య తీసి ఇవ్వాలి. జుట్టు పీచులాగ వుంటే అత్తయ్య నూనెరాసి చిక్కుతియ్యాలి. దేన్నీ పట్టించుకోకుండా అలా తిరుగుతూండేదాన్ని. శరీరంమీద. బ్రతుకుమీద వ్యామోహం నశించిపోయింది. ఇది తినాలనికాని, అది చెయ్యాలని కాని లేదు. ముందు వెనుకల గురించిన ఆలోచన అసలే లేదు.

అటువంటి మగతలోంచి ఒక చిన్న సంఘటన నన్ను పైకి తీయకపోతే గానుగెద్దు చందంగా నా జీవితమంతా ఆ గాడిలో పడి నడిచి పోయేదేమో? కాని, ఆలోచించి చూస్తే ఆ సంఘటనకి అంత ప్రాముఖ్యం లేదనిపిస్తుంది. అంతర్గతమైన నా ఆలోచనలు బయటికి తొంగిచూసేందుకు అది కారణమాత్రంగా నిలిచింది.

వీలైనప్పుడల్లా అన్నయ్యా, వదినా వచ్చి చూసి పోతూండేవారు. ఏడాది దాటకుండా, ఒకటి రెండుసార్లు తమతో తీసుకు వెడతామని కూడా అన్నారు. అత్తయ్య అందుకు యిష్టపడలేదు. నాకూ వెళ్లాలనిపించలేదు.

"దానికి ఇక్కడ ఉంటేనే మనశ్శాంతిగా వుంటుంది. నా దగ్గరే వుండనీ" అంది అత్తయ్య.

ముఖానికి అరకాసంత కుంకంబొట్టు, ముడి చుట్టూ పూవులు, నోటినిండా తాంబూలంతో అత్తయ్య ముఖం ఎప్పుడూ కలకల్లాడుతూండేది. అత్తయ్యకి పువ్వులంటే వెర్రి సరదా. ఏ పువ్వు చూసినా వెంటనే కోసి తల్లో పెట్టేసుకునేది. ఇంక చామంతి పువ్వులూ మల్లెపువ్వుల కాలంలో అయితే బారెడు మాల కట్టి నా తల్లో యింత పెట్టి తనింత పెట్టుకునేది మునుపు.

ఇన్నాళ్లూ అత్తయ్య తల్లో పువ్వులు చూసి చాలా కాలం అయింది. పెరట్లో పూచిన పూవులన్నీ దేవుడి బొమ్మకి మాల కట్టి పెట్టి, కనిపించకుండా తల్లో ఓ పువ్వు దోపుకొనేది. అలవాటైన తాంబూలం మానుకోలేక, నా ఎదురుగా వేసుకోలేక బాధపడేది. బొట్టు కూడా నే చూస్తుండగా పెట్టుకునేది కాదు. ఆ పనులు నాలో ఏ జ్ఞాపకాలను రేకెత్తించి నన్ను బాధపెడతాయో అన్నట్టు ప్రవర్తించేది.

ఆ రోజు వదిన వచ్చింది. పెరట్లో కనకాంబరాలు విరగ పూచి వున్నాయి. మరువం కుండీలనిండా పెరిగివుంది. సాయంకాలం పువ్వులు కోసి పెద్దమాల కట్టింది వదిన. కూతురుకి తలదువ్వి జడంతా పువ్వులు పెట్టింది. తను ముడిచుట్టూ కట్టుకొంటూ అత్తయ్యకో ముక్క ఉంచింది.

పువ్వులిష్టంలే వద్దనలేక, నా ఎదురుగా అందుకొని తలలో పెట్టుకోలేక "ఆ గూట్లో పెట్టు లక్ష్మీ. చేతులు బాగాలేవు" అంది. వదిన తన తప్పు తెలుసుకొన్నట్లు చిన్నబుచ్చుకొంది. ఏదో పనిమీద కలిగించుకొని లోపలికి వెళ్ళిపోయింది. గంట పోయిన తరువాత వదిన తిరిగి వచ్చేసరికి ఆమె తల్లో పువ్వులు లేవు!

"అమ్మా, నీ పువ్వులేవే?" అని పాప ప్రశ్నించింది.

"ఎక్కడో పడిపోయి వుంటాయి. పోయి ఆడుకో. నీ నేస్తురాలు పిలుస్తున్నది" అంటూ, వదిన, మాట తప్పించింది.

ఎవరు మాత్రం ఇతరులకోసం తమ సరదాలు ఎంతకాలం మానుకోగలరు? అసలు ఎందుకు మానుకోవాలి? నా కోసం ఇంట్లో

వాళ్ళు యిబ్బంది పడడం సరికాదనిపించింది. అసలు నేనుమాత్రం ఇలా ఎందుకు వుండాలి? మాధవ్ మరణం తరవాత నా గురించి నేను ఆలోచించిన మొదటి విషయం అది.

మాధవ్‌తో పరిచయం కాక పూర్వం నాకు కొంత జీవితం అంటూ వుండేది కదా. అతని సాహచర్యంలో అది విస్తరించింది. ఇప్పుడు అతడు లేడు. అయినా నా మొదటి జీవితం అనుకొన్నది ఎక్కడికి పోయింది?

మాధవ్‌తో పాటు నేను చచ్చిపోలేదు. తిండి తింటూ, గాలి పీలుస్తూ బ్రతికే వున్నాను. బ్రతక తలుచుకొన్నప్పుడు నేను ఏడుస్తూ, యితరులని ఏడిపిస్తూ ఎందుకు బ్రతకాలి? ఈ శేష జీవితం నుంచి ఏపాటి ఆనందం పొందగలనో ప్రయత్నిద్దాం-అనుకొన్నాను.

ఆ ఆలోచన వచ్చిందే తడవుగా గదిలో అద్దంముందు నిలిచి నా రూపు చూసుకొన్నాను. ఆ మూర్తిని చూసి క్షణకాలం నిర్విణ్ణురాలినయేను. "మాధవ్ లేని భారతి ఇలా వుందా" అని ఆశ్చర్యపోయేను.

ఎన్నో వెన్నెల రాత్రులలో మాధవ్‌ని మత్తులోముంచి, అతని ప్రశంసలందుకొన్న కళ్ళల్లో కాంతి మాయమయింది. పాలి పోయిన ముఖంలో వాడిపోయిన బుగ్గలు సంచుల్లా వేళ్ళాడు తున్నాయి. తైల సంపర్కంలేని జుట్టు మొక్కజొన్న పీచులా నుదుటిమీద పడుతున్నది.

దుద్దులు లేకుండా బోసిపోయిన చెవులు, బొట్టుచెరిగిన నుదురు, సరియైన జాగ్రత్త తీసుకోక పగిలి, నల్లబారిన పెదవులు—— నా ముఖం చూసుకొందుకు నాకే భయంగా కనిపించింది.

మెడలో ఒంటిపేట సన్నవి గొలుసు, చేతికి ఒకజత బంగారు గాజులు సన్నని రిబ్బన్ బోర్డరు తెల్లచీర, తెల్లజాకెట్- ఆ దుస్తుల మధ్యనుంచి పుల్లల్లా వేళ్లాడుతున్న కాళ్ళు, చేతులు—— ఏదో కంకాళానికి బట్టలు తొడిగినట్లుంది కాని, ఆ రూపును చూస్తే ఒక మనిషన్న భావం కలగదు.

ఒక్కసారి అత్తయ్యమీదా, మామయ్యమీదా చెప్పలేనంత జాలి కలిగింది. ఈ రూపుని ఇంతకాలంగా చూస్తూ ఎలా

భరిస్తున్నారు! నా కళ్ళముందు ఎవరైనా ఇలా తిరుగులాడుతుంటే ఏనాడో పిచ్చెత్తిపోయి ఉండేది నాకు. అంతకాలంగా ఒక్క పారైనా అద్దంలో రూపు చూసుకోందామన్న ఆలోచన రానందుకు విసుక్కున్నాను. పోనీ, నయం, ఇప్పటికైనా ఆ బుద్ధి కలిగిందని సంతోషించేను.

ముందు ఆరోగ్యం చూసుకోవాలి. అటు తరవాత అలంకరణ. అలంకరించుకోందుకు కొన్ని నిషేధాలు ఉంటే ఉండవచ్చు కాని, ఆరోగ్యంగా ఉండేందు కేవీ అడ్డం రావుకదా అనుకొన్నాను.

నాలో వచ్చిన మార్పుకి అత్తయ్యా, మామయ్యా సంతోషించేరు. అన్నయ్యా, వదినా భారం తీరినట్లు ఊపిరి తీసుకొన్నారు. "ఇంత కాలానికి మళ్ళీ కొత్త మనిషిలా కనిపిస్తున్నది భారతి" అంది అత్తయ్య.

* * *

రెండు నెలలనాడు అన్నయ్య తన ఇంటికి రమ్మన్నప్పుడు కాదనకుండా ప్రయాణమై వెళ్ళేను. అన్నయ్యా, వదినా నన్నెంతో ఆదరంగా చూసేవారు. వదినకి నలుగురు పిల్లలు. మొదటి ఇద్దరూ మగపిల్లలు. మూడోది ఆడపిల్ల. నాలుగో కొన్న మగపిల్లవాడు. పది నెలలవాడు తప్పటడుగులు వేస్తూ పడుతూ, లేస్తూ యింట్లో తిరిగేవాడు.

వదిన వంటపనితో సతమతమై పోతుంటే చంటివాడి సంరక్షణ నే చూసేదాన్ని. కాదు కూడదని నేను వంటలో జొరబడబోయినా వదిన ఒప్పుకొనేది కాదు. "నువ్వు ఆ అకతాయిని కాస్త చూసుకుంటే నాకదే చాలు, అన్నిపనులూ చేసిపెట్టినంత సుఖం" అనేది.

చంటివాడితో నాకు బాగా కాలక్షేపం అయేది. అన్నయ్య కూడా సాయంకాలం ఆఫీసునుంచి తిన్నగా యింటికి వచ్చివేసేవాడు. వదినా, అన్నయ్యా, నేనూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాల సమయందాకా కాలక్షేపం చేసేవాళ్ళం. ఒక్కొక్క రోజు ఏ పేకాటో, చదరంగమో ఆడుకొంటూ గడిపేవాళ్ళం. చదరంగం ఆడినప్పుడల్లా వదినా, నేనూ ఒకపార్టీ. అన్నయ్య చెయ్యి

పేకాటలో పైగానే ఉన్నా చదరంగంలో దిగిపోయేది. సాధారణంగా మా పార్టీయే గెలిచేది. "రోజల్లా యింట్లో పనీ పాటూ లేకుండా కూర్చుని ఎత్తులు, పైఎత్తులు ఆలోచించి పెట్టుకొంటే గెలవకేంచేస్తారు" అనేవాడు అన్నయ్య ఉడుక్కొంటూ.

"పోనీ అన్నయ్యా, నాలుగు రోజులు ఆఫీసుకి సెలవు పెట్టి బాగా ఎత్తులు ఆలోచించి ఆడు. గెలవగలవేమో చూస్తాం" అనేదాన్ని, అతన్ని రెచ్చకొడుతూ.

ఆ రోజు ఆఫీసుకి వెళ్తూ, "భారతీ, నేను వచ్చేసరికి చదరంగం బలాలన్నీ సరిగా సిద్ధంచేసి ఉంచు. ఎంత అవలీలగా ఆట కట్టించగలనో చేసి చూపిస్తాను. 'పోనీ, ఎందుకు పాపం! ఆడపిల్లలు' అని ఊరుకొంటుంటే మరీ రెచ్చిపోతున్నారు" అన్నాడు.

అన్నయ్య కోరినట్లు బల్లమీద చదరంగ బలమంతా సర్ది పెట్టేను, ఆ రోజు యుద్ధానికి. నేనూ, వదినా కాఫీలు తాగి వంట ముగించుకొని సిద్ధంగా వున్నాను.

అన్నయ్య ఆఫీసునుంచి వస్తూనే వాలుకుర్చీలో చేరబడి ఎదుటి బల్లమీది చదరంగం బోర్డుని తీసి కిందపెట్టి, కాళ్ళు బార్లజాపేడు. నేనింతా సర్దిపెట్టిన ఆటని ఆడకుండా అలా కలిపి వేయడంతో మనసులో కాస్త చికాకు పడినా అన్నయ్య ముఖంలోని ఆనందం చూసేక ఏదో మంచి వార్త చెప్పబోతున్నాడన్న ఉత్సాహంలో సర్దుకొన్నాను.

"లక్ష్మీ, స్ట్రాంగ్ కాఫీ" అంటూ కేక పెట్టాడు అన్నయ్య.

"ఇదిగో, తెస్తుండగానే, ఇలా ఇంట్లో కాలు పెట్టేరో లేదో కాఫీ... కాఫీ... అంటూ అంత గావుకేక వేస్తారేమిటి?" అంటూ మాట అంటూనే వదిన కాఫీ తెచ్చింది.

వదిన చేతిలోని కాఫీ అందుకొని, ఒక గుక్క తాగి, బాగుందన్నట్లు ముఖం పెట్టి, "నీ డబ్బు వచ్చేస్తున్నది భారతీ." అన్నాడు ఉత్సాహంగా. మాధవ్ ఇన్సూరెన్సు తాలూకుది - ఇండియన్ ఎయిర్ లైన్స్ వాళ్ళు పరిహారంగా ఇచ్చేది రావలసి ఉందని నాకు తెలుసు. డబ్బు విషయమైన ప్రస్తావన వచ్చినప్పుడు దాని విషయం ఒకటి రెండుసార్లు మనసులోకి వచ్చిందికూడా. కాని ఆ మాట

వినగానే కలిగిన కొద్దిపాటి ఆనందం అంతలోనే విరిగిపడింది. మాధవ్‌ని కబళించిన మృత్యువు చెల్లిస్తున్న పాపపరిహారంగా కనిపించింది ఆ డబ్బు.

"ఏమిటి నాన్నా...ఏమిటి నాన్నా?" అంటూ దగ్గరికి వచ్చేరు, అన్నయ్య మాటల్లోని ఉత్సాహాన్ని పసిగట్టిన పిల్లలు.

"మీ అత్తకి ఇంతడబ్బు వస్తున్నది" చేతులు ఎడంచేస్తూ అన్నాడు అన్నయ్య.

"అబ్బో...అబ్బో...అంత డబ్బే" అన్నాడు బాబ్జీ, ఆశ్చర్యంగా.

"అత్తా! అంత డబ్బుతో ఏం చేస్తావు?" అని కుతూహలంగా ప్రశ్నించింది పాప.

"నీకు నాలా డబ్బుంటే నువ్వేంచేస్తావు?" అంటూ మనసులోని వేదనని అణుచుకొని, వాళ్ళ ఉత్సాహంలో భాగం పంచుకొనే ప్రయత్నం చేసేను.

"బోల్డు సిల్కు గౌనులు కొనుక్కుంటాను. ఎదురింటి అత్తయ్యగారిలాంటి రాళ్ళ నెక్లెసు కొనుక్కుంటాను. ఇంకా ముత్యాలదండా..." ఆలోచించి పెట్టుకొన్నట్లు జవాబు చెప్పింది పాప.

"అత్త ఆ సొమ్మంతా నీకిస్తే నువ్వేంచేస్తావురా బాబ్జీ" అన్నాడు అన్నయ్య.

"నేనా? పెద్ద విమానం కొనుక్కొని ఊళ్ళన్నీ తిరిగొస్తాను. మధూగాడి మామయ్య విమానంతో యుద్ధంచేసి దాన్ని ముక్కముక్కలుగా చేసేస్తాను" అన్నాడు బాబ్జీ.

మధూగాడి మామయ్య నడిపే విమానంమీద వాడికి అక్కసు లేదు. దాన్నిగురించి గొప్పగా చెప్పుకొనే మధూగాడి నోరు కట్టించాలనే అభిలాష వాడి మాటల్లో తొంగిచూసింది.

అంతలో రవి "అత్త...అత్త" అంటూ తల్లి చేతుల్లోంచి నా వొడిలోకి ఉరికలు వేసేడు.

"అదిగో. అత్త డబ్బంతా వాడికేనట. మీరు ముట్టుకుంటే తంతానంటున్నాడు రవి" అంది వదిన.

ఆటు తరువాత సంభాషణంతా రవి చురుకుతనంమీదా, వాడి చిలిపిచేష్టల మీదా సాగిపోయింది.

రావలసిన డబ్బు నాలుగు రోజులనాడు వచ్చింది.

"ఏం చెయ్యమంటావు, భారతీ" అన్నాడు అన్నయ్య.

"నన్నడిగితే నేనేం చెప్పగలను అన్నయ్యా! అంతా కలిసి ఆలోచించి ఎలా బాగుంటుందనుకొంటే అలా చెయ్యండి. ప్రస్తుతానికి ఏదైనా బ్యాంకులో పడేయొచ్చేమో" అన్నాను.

సొమ్ము రెండు నెలలు బ్యాంకులో పడివుండేసరికి అన్నయ్యకి చెవిలో పురుగులా గొలకసాగింది. "అలా బ్యాంకులో పడివుంటే ఏం లాభం? ఏదో ఒక దానిమీద పెట్టాలి." అన్నాడు.

ఆ రోజుల్లోనే మామయ్య దగ్గరినుంచి ఉత్తరం వచ్చింది. "నీ సొమ్మేం చేద్దామనుకొంటున్నావు? తోటో, దొడ్డో కొనుక్కొంటే బాగుంటుందేమో? ఏం చేసినా ముందు వెనకలు చూసుకొని మరీ చెయ్యాలి. ...అన్నట్టు, మీ అత్తయ్య నిన్ను చూడాలని వున్నదంటున్నది. ఎప్పుడు వస్తావు?..." అంటూ వ్రాసేడు.

మామయ్య వ్రాసిన ఉత్తరం అన్నయ్యచేతిలో పెడుతుంటే, నీకింకో ఉత్తరం వచ్చిందంటూ అందించేడు. అది భ్రమరాంబ అత్త వ్రాసింది.

అనసూయ పురిటికొచ్చిందట. రామ్మూర్తిగారి ఉబ్బసం వ్యాధి కొంచెం ఉధృతంగానే ఉందిట. "భారతీ! చూసేవాళ్ళూ చేసేవాళ్ళూ లేక ఇల్లంతా చవుడుబారి పోయిందమ్మా.ఏదో కొంత మరామత్తు పెట్టందే నివాసయోగ్యంగా నిలిచేటట్టులేదు" అంటూ ఆ యింటి సమాచారం అందజేసింది ఆవిడ.

"పంట అందగానే పని ప్రారంభించండి అత్తయ్యా, కొరత పడిన సొమ్ము పంపిస్తాను." అంటూ జవాబు వ్రాసేను.

"మామయ్య వ్రాసిన ఉత్తరం చూసేవా, అన్నయ్యా, ఏం వ్రాయమన్నావు" అని ప్రశ్నించేను.

"అక్కడ నీకేం తోస్తుంది! ఇక్కడైతే వదినా, పిల్లలూ ఉన్నారు, సరదాగా కాలక్షేపం అవుతుందికాని."

"ఫరవాలేదన్నయ్యా, నాకూ అత్తని చూడాలని ఉంది.

చాలా కాలం వున్న వూరే కదా! అయినా నా కాలక్షేపం ఏదో నే చూసుకోవాలి కాని ఎల్లకాలం ఎవరో ఒకరు నన్ను ఉత్సాహంతో నింపుతూ ఉండాలి అంటూ కూర్చుంటే గడుస్తుందా?" అన్నాను.

"నీ ఇష్టం" అన్నాడు అన్నయ్య.

"వీలు చూసుకొని తొందరలోనే వస్తాను మామయ్యా" అంటూ ఉత్తరం వ్రాసి పోస్ట్ చేసేను.

అన్నయ్య తరుచు సినిమాలకి వెళ్ళడు. ఎప్పుడైనా వెళ్ళినా ఏ స్నేహితుల బలవంతంవల్లో కదులుతాడు. ఆరోజు తనంతట తనే "మంచి సినిమా వచ్చిందట. వెళ్దాం పదండి" అంటూ అన్నయ్య ప్రయాణం చేసే సరికి నాకు ఆశ్చర్యం వేసింది.

"మీ అన్నయ్య 'మంచి సినిమా' అంటున్నారు. పద, భారతీ! చూసివద్దాం!" అంటూ వంత పాడింది వదిన.

"మీరు వెళ్ళిరండి, నాకు చూడాలని లేదు. నేను పిల్లల్ని చూసుకొంటాను" అన్నాను.

"నీ కోసమే ఈ రోజు వెళ్ళాలనుకొంటున్నాము. మనిషన్న తరవాత మార్పంటూ ఉండాలి. ఇలా ఎంతకాలం ఇంట్లో గడప గలవు-పద" అని బలవంతం చేసింది వదిన.

పిల్లలకి అన్నాలు పెట్టి, పారుగావిడని తోడువుంచి, చంటి వాణ్ణిమటుకు తీసుకు బయలుదేరాం. సినిమా హాలులో కాలుపెట్టే సరికి నా బ్రతుకును చూసి ప్రపంచమంతా నవ్వుతున్నట్లు అనిపించింది. చెయ్యీ చెయ్యీ కలుపుకొని, సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, జంటజంటలుగా కలిసివస్తున్న యువతీ యువకుల్ని చూస్తుంటే పట్టరాని బాధ మనసులో కలుక్కుమంది.

మాధవ్, నేనూ ఎన్నోసార్లు సినిమాలకీ, షికార్లకీ అలా గాలిలో తేలిపోతూ తిరిగేవాళ్ళం. భగవంతుడు మా కోసమే ఈ ప్రపంచాన్ని ఇంత సుందరంగా సృష్టించేడనుకొనేదాన్ని. ఎగిరే పక్షులు, రంగుల పువ్వులు, పచ్చని చెట్లు, వెచ్చని ఎండ, పిల్ల గాలులు, వెన్నెల రాత్రులు-అన్నీ మా కోసమే సిద్ధపరిచి ఉంచే

డనుకొనేదాన్ని. జీవితానికి అర్థం, పరమార్థం ఆనందమే అని అభిప్రాయపడేదాన్ని.

కాని ఆ సౌభాగ్యమంతా మూడేళ్ళకే బుగ్గిపాలయింది. జీవిత పర్యంతం ఎడబాటన్నది లేకుండా మాధవ్ నీడలో సుఖంగా బ్రతుకు గడిచిపోతుందన్న ఆశ నిరాశగా మారిపోయింది. ప్రమిదలో నూనె నిండుగా ఉండగానే ఒత్తి కాలి ఆరిపోయిన దీపంలా అయిపోయింది నా బ్రతుకు అని బాధపడ్డాను.

సినిమా చూస్తున్నంతసేపూ పక్కని మాధవ్ కూర్చుండి పిక్చరులోని అందచందాలకి కామెంట్ చేస్తున్నట్టే అనిపించింది. నా ఆలోచనలలో మునిగి తేలుతూ, కళ్ళెదుట తెరపై జరుగుతున్న కథను గురించి నే పట్టించుకోనేలేదు. మధ్యలో వదిన కథలో నాకు కలిగిన సందేహం గురించి ఏదో ప్రశ్నించింది. ఏం చెప్పాలో తోచక తెల్లబోయి చూసేను.

"కాస్త ఉత్సాహంగా ఉండు. భారతీ! ఇక్కడికొచ్చినా అదే ధ్యాస అయితే వచ్చేం లాభం" అని వదిన మందలించింది.

ఇంటర్వెల్ లైట్లు వెలిగేయి. అన్నయ్య బయటికి వెళ్ళి రవికి పిప్పరమెంట్లు తెచ్చేడు. ప్యాకెట్ని వదిన చేతిలో పెడుతూ తన పక్కగా ఉన్న వ్యక్తిని చూపిస్తూ "జగదీశ్ నీకు తెలుసుకదూ, లక్ష్మీ? మనం గుంటూరులో ఉన్నప్పుడు......"

"అయ్యో, తెలియకపోవడమేమిటండీ?" అని అన్నయ్య మాటని సాగదీస్తూ, "బాగున్నారా? ఇప్పుడు ఎక్కడుంటున్నారు?" అని ప్రశ్నించింది వదిన.

"ప్రస్తుతం సెలవు మీద ఉన్నానండీ. సెలవాఖర్ని ఎక్కడకు వేస్తారో ఇంకా తెలియదు" అన్నాడు జగదీశ్.

"ఈ అమ్మాయి నా చెల్లెలు భారతి; ఇతడు నా స్నేహితుడు, జగదీశ్" అంటూ మాకు పరిచయం చేసేడు అన్నయ్య. నేను ముఖమెత్తి, వచ్చిన వ్యక్తిని చూసేను. సరిగా అదే సమయానికి అతడూ నా వైపు చూసేడు. ఒకరినుండి ఇంకొకరికి ఎలెక్ట్రిక్ షాకులా తగిలింది మాధవ్ జ్ఞాపకం. నేను కళ్ళు దించుకొన్నాను. క్షణకాలం జగదీశ్ నోటి వెంట మాట రాలేదు. "మీకొచ్చిన

ఆపద సామాన్యమైంది కాదు. పేపర్లో ఆ విషయం చదివి కుంగిపోయాను. ఒకసారి వచ్చి మిమ్మల్ని చూసి, నా సానుభూతి తెలియపరుద్దామని ఎన్నోమార్లు అనుకొన్నాను. మీ అడ్రసు తెలియక కొంతా, మీరు పోల్చుకోగలరో లేరో అనే సంశయంవల్ల కొంతా రాలేకపోయాను. మిమ్మల్ని ఈ స్థితిలో ఇప్పుడిలా చూడకపోయినా బాగుండేది. ఆనాటి మీ రూపం నా మనసులో నిలిచి ఉండేది..." అప్పచెప్పవలసిన పాఠం మరిచిపోయిన ఎలిమెంటరీ స్కూలు విద్యార్థిలా మెల్లగా గొణిగేడు జగదీశ్.

అంతలో అతని గొంతుక పూడుకుపోయింది. నోరు తెరిచి నేనేం మాట్లాడలేకపోయాను. కన్నీరు మాత్రం దుఃఖాన్ని తరుముకొంటూవచ్చి నాపై ఏకధారగా పడింది.

మా ఇద్దరి వంకా, అర్థం కానట్లు, తెల్లబోయి చూసింది వనిత. అన్నయ్య ముఖం తెలవేసేడు. రెండు నిమిషాలు ఎవరూ ఏమి మాట్లాడాలో తోచనట్లు మౌనంగా గడిపివేశారు. మాటలు కరువైన మా పరిస్థితిని అర్థం చేసుకొన్నట్లు హాల్లో లైట్లు ఆరిపోయాయి. "పిచ్చికు అరోక కలుసుకుంటాను" అంటూ అన్నయ్యతో చెప్పి వెళ్ళిపోయేడు జగదీశ్.

నా ప్రక్క కుర్చీలోకివచ్చి కూర్చుంటూ, "జగదీశ్ నీకు తెలుసా భారతీ" అని ప్రశ్నించేడు అన్నయ్య.

ఆనాడు జయపూర్‌లో జగదీశ్‌ని మొదటిసారి కలుసుకున్నప్పుడు మాధవ్ ఇదే విధంగా ప్రశ్నించాడు. ఆ నాటి జీవితం, మాధవ్ మాటలు, యిద్దరం కన్న కలలు జ్ఞాపకంరాగా దుఃఖం ముంచుకు వచ్చింది. రెండు చేతుల్లో ముఖం దాచుకొని పళ్ళు బిగపెట్టేను.

"సారీ భారతీ! కాలక్షేపానికని ఇక్కడికి తీసుకొచ్చి నిన్ను అనవసరంగా బాధపెట్టేను."

"అదేం లేదన్నయ్యా! నీ ప్రశ్న కనుబంధమైన ఏదో సంఘటన జ్ఞాపకంవచ్చి మనసుని బాధపెట్టింది. జగదీశ్, మాధవ్ స్నేహితులు."

"ఆ సంగతి నాకు తెలుసు. కాని, చాలా కాలంగా, జగదీశ్

దగ్గరలో సేనాకార్యాలయంగా నువ్వు కలుసుకొని ఉండవచ్చనుకొన్నాను."

"మేము మానియూన్‌కి వెళ్ళినప్పుడు జయపూర్‌లో జగదీశ్ పరిచయం అయింది" అన్నాను.

నా వేపు అన్నయ్యకి అర్థమయిందేమో. ఆ విషయం మరి కదపలేదు.

పిక్చరు పూర్తయి అంతా ఇంటికి వచ్చేక జగదీశ్ కాపించేడు. "ఇంకా ఉంటారు కదూ. వీలు చూసుకొని మా ఇంటికి రా" అన్నయ్య ఆహ్వానానికి జగదీశ్ మనస్ఫూర్తిగా తల ఊపేడు. ఆ నమస్కారానికి ప్రతిగా నవ్వి, నేను చేతులు జోడించాను.

*　　*　　*

వారంనాడు - జగదీశ్ అన్నయ్యలో కలిసి ఇంటికి వచ్చి-నాడు-సినిమాలో చూచినప్పటిలా నాకు గంభీరం ముంచుకురాలేదు. అంతా కాఫీలు తాగి, బయట వసారాలో కూర్చుని, కబుర్లు చెప్పుకున్నాం. మా సంభాషణలో మాధవ్ ప్రస్తావన రాకుండా, అన్నయ్య ప్రయత్నపూర్వకంగా మాట్లాడుతున్నట్లు అనిపించింది. నిజానికి ఆ విషయం కదిల్చినా తట్టుకోగల శక్తి ఆ క్షణంలో నాకు ఉన్నదని చెప్పగలను. మానుతున్న గాయం ఏ కారణంగానైనా కొంచెం కలిగినా తిరిగి తొందరలోనే పెచ్చు కడుతుంది.

జగదీశ్ చాలా సరదాగా మాట్లాడతాడు. కదలని కాలాన్ని కదనపు గుర్రంలా పరుగులు పెట్టించే నేర్పు అతనికి ఉన్నది. దీపాలు పెట్టే వేళైనా కాని వదినకి వంట సంగతే గుర్తు రాలేదు. అతడు వెళ్ళిపోతుంటే "మళ్ళా ఎప్పుడు వస్తారు?" అంటూ ప్రశ్నించింది వదిన.

"సెలవు పూర్తయే వరకూ ఈ ఊళ్ళోనే వుంటాను. మీ ఇంటికి ఎప్పుడు రావాలనిపించినా రాలేకపోయే పనులేం నాకు లేవు" అన్నాడు మెట్లు దిగుతూ.

"నేను అతనితో కలసి అలా కొంచెం దూరం వెళ్ళొస్తాను" అంటూ అన్నయ్య అతనికూడా వెళ్ళేడు.

మాధవ్, జగదీశ్ ఒకే గ్రామంలో పుట్టేరుట. వయస్సుల్లో కూడా ఎక్కువ తేడా ఉండి ఉండదు. కాని ప్రవృత్తుల్లో మాత్రం

డా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఎత్తు పల్లాలని పరిశీలిస్తూ, నియమంగా, నిదానంగా పారే నదిలాంటివాడు మాధవ్. కొండలని, బండలని నరుకు చేయకుండా, గులకరాళ్ళని దొర్లించుకొంటూ గలగల ప్రవహించే కొండవాగులాంటివాడు జగదీశ్. ఈ ఇద్దరి మధ్య చెలిమికి కారణం ఒక్క ఊళ్ళో పుట్టడం, కలిసి చదువుకోడం కాక, ఇంకేదో ఉండి ఉండాలనిపించింది నాకు.

అన్నయ్య ఉన్నా లేకున్నా జగదీశ్ తరుచు వచ్చిపోతూండేవాడు. వదినకి జగదీశ్ కబుర్లంటే మహా ప్రీతి. అయినవీ, కానివీ అతన్ని ప్రశ్నిస్తుండేది. అతడుకూడా తనగురించీ, తన వాళ్ళ గురించీ చనువుగా మాట్లాడుతూండేవాడు. ఒకరోజు ప్రసంగం పెళ్ళిళ్ళ మీదికి మళ్ళింది.

‘‘బ్రహ్మచారి ముగిరినా, బెండకాయ ముదిరినా ఎందుకు పనికి రాదంటారు? ఇంత వయసొచ్చినా మీరింకా పెళ్ళి చేసుకోలేదేం?’’ అని ప్రశ్నించింది వదిన.

‘‘మీలా నిలేసి అడిగే పెద్దలు లేక, నావంటి తిరుగుబోతుకి పిల్లనిచ్చే కన్యాదాతలు లేక.’’ అన్నాడు జగదీశ్ నవ్వుతూ.

‘‘ఈ కబుర్లకేం గాని వయసు ముగురుతున్నా మీ పిన్నమ్మ పెళ్ళిమాట ఎత్తకుండా ఊరుకుందేం?’’ అన్నాడు అన్నయ్య.

‘‘పిన్నికి నా పెళ్ళి దృష్టెందుకుంటుంది సారథీ? నలుగురు పిల్లల తల్లికి ఆ పాటి తెలివితేటలు ఉండవా? నేను నా సంసారాన్ని ఏర్పరుచుకొంటే, తన పిల్లల చదువు సంధ్యలూ, పెళ్ళిళ్ళూ అయేదెట్లా?’’

‘‘తను నీకు చేసిన నిరవాకానికి నీమీద సవారి అవుతున్నది కూడానా?’’

‘‘దానికీ దీనికీ సంబంధం ఏముంది?’’

‘‘వాళ్ళకోసం నువ్వు పెళ్ళి మానుకోవలసినంత సంబంధం లేదనే నా అభిప్రాయం. ఒక తల్లి కన్న పిల్లలయితే ఎలాగా

తప్పదు. పోనీ, తండ్రయినా బ్రతికి ఉంటే అదో దారి. అసలు బంధం విడిపోయేక ఇంకా ఈ తద్దినం దేనికి?" అన్నాడు అన్నయ్య.

"మనసంటూ వున్నందుకు; మనిషిలా బ్రతుకుతున్నందుకు" అన్నాడు జగదీశ్, ఆ సంభాషణ అప్పటికి అంతంచేస్తూ.

పినతల్లి పిల్లల పెళ్ళిళ్ళ కోసం తన పెళ్ళిని ఎప్పటికప్పుడు వాయిదా వేసిన మాధవ్ తలపుకి వచ్చేడు. కర్తవ్య నిర్వహణలో, బంధుప్రీతిలో యిద్దరూ ఒక్కలాటి వారే అనుకొన్నాను.

ఇంకోసారి వదినా, నేనూ మాత్రమే ఉన్నప్పుడు తిరిగి ఈ ప్రస్తావన వచ్చింది. వదిన తన చిన్న చెల్లెల్ని దృష్టిలో ఉంచుకొనే ఈ మాటలు లేవదీస్తున్న దనిపించింది నాకు.

"కబుర్లకేం, కావలసినన్ని చెప్పొచ్చు. కాని నా పరిస్థితుల్లో ఉన్న ఎవరు మాత్రం ఇంతకిమించి చెయ్యగలిగిందేమిటో మీరే చెప్పండి. కాపురానికొచ్చిన కొత్తలో పిన్ని నన్ను తిన్నగా చూడకపోయిన మాట వాస్తవమే. నాన్న కాలేజీలో చేర్పించి చదివిస్తానన్నప్పుడు అంతా నా చదువుకి ఖర్చయి తన పిల్లలకి అన్యాయం జరుగుతుందని అడ్డుతగిలిన మాట నిజమే. ఆమె స్థానంలో ఉన్న ఏ ఆడదయినా అలాగే ప్రవర్తిస్తుందేమో అనిపిస్తుంది నాకు.

"తన పిల్లలతో సరిగా సవతికొడుకునైన నన్ను ఆవిడెందుకు అభిమానించాలి? నా పురోభివృద్ధికి తన పిల్లల క్షేమం ఎందుకు త్యాగం చెయ్యాలి? ఆవిడకీ, నాకూ వున్న అనుబంధమేమిటి?

"ఆవిడ నాకేదో చెయ్యలేదన్న కారణంగా నేను వాళ్ళని విడిచిపెట్టలేను. ఆవిడకీ, నాకూ ఏ అనుబంధం లేకపోవచ్చు. కాని పిల్లలతో నాకున్న రక్తసంబంధం అంత సులువుగా వదుల్చుకో గలిగేది కాదు. నా తండ్రిపేరు చెప్పకొంటూ వాళ్ళు అడుక్కుతింటుంటే నే చూడలేను. అనాపేక్షితమైన ఈ బాధ్యతల నుండి

తప్పుకోవడం సారథి అన్నంత సులువైన పని కాదు" అన్నాడు జగదీశ్.

అతడు చెప్పింది విన్నాక ఆ అనుబంధానికి అతని జీవితగతినే మార్చగలిగేటంత శక్తి ఉందా అనే సంశయం కలిగింది నాకు. ఇతరుల బ్రతుకులకోసం తన ఆనందాన్ని వదులుకోగల శక్తి నిలకడగా మనిషి జీవితంలో నిలిచే అవకాశం వుందా అనిపించింది.

ఆ నెలలో మామయ్య దగ్గరినుంచి రెండు మూడు ఉత్తరాలు వచ్చాయి. ఎప్పటికప్పుడు, మామయ్య ఉత్తరం అందగానే, వెళ్ళాలనిపించినా ఏదో అడ్డంకి బలంగా నన్ను వెనక్కి నెట్టుతున్నట్లు అనిపించేది. "అక్కడికి వెళ్తే ఎంతకీ అత్తయ్యా, మామయ్యలకు ఎదురుగా కూర్చోడమే పని. సరదాగా కబుర్లు చెప్పకొంగుకైనా ఎవరూ ఉండరు. ఇక్కడైతే వదినా, పిల్లలూ ఉన్నారు. అన్నయ్యా, జగదీశ్ నాలుగు రకాల భోగట్టాలు మాట్లాడుతుంటారు. హాయిగా కాలక్షేపం అయిపోతున్నది. అక్కడికి వెళ్ళకపోతే నేం?" అనుకొన్నాను.

నా ఆలోచన నాకే అసందర్భంగా తోచింది. ఒకప్పుడు అత్తయ్యని, మామయ్యని వదిలి అన్నయ్య దగ్గరికి రావడానికి ఎన్నో అనుమానాలూ ఆటంకాలూ కనిపించేవి. తెగించి వచ్చిన తరువాతకూడా చాలా రోజుల వరకు ఇక్కడ అదోక్రొత్తగానే ఉండేది. మనసుకి ఏ చిన్నబాధ కలిగినా—అత్తయ్య దగ్గర ఉంటే ఇలా అయేదా అనుకొనేదాన్ని. మరి నా ఆలోచనల్లో ఈ మార్పు ఎందుకు వచ్చినట్లు? పరిసరాలకి, అలవాట్లకి మనిషిని తమలో లీనంచేసుకోగలిగే శక్తి యింతగా ఉంటుందా?

వారం రోజులై జగదీశ్ రాలేదు. ఏదో వెలితిగా, జరగవలసిన పని జరగనట్లు అనిపించింది.

ఒకటి రెండుసార్లు జగదీశ్ విషయం అన్నయ్యను అడుగుదా మనుకుంటూ సంకోచించి ఊరుకున్నాను. మాటల మధ్య యథా లాపంగా కలిసి వచ్చి అతని మాట జారవిడిచేను. నాకు బదులుగా అన్నయ్యని వదిన ప్రశ్నించింది.

"ఏమైనా ఊరికి కాని వెళ్ళేడేమో! నాకు తెలియదు" అన్నాడు అన్నయ్య.

అప్పట్లో జగదీశ్ రాకపోకల గురించి అన్నయ్య పట్టించు కోవడం లేదు. బ్యాంకులో పడున్న డబ్బుని ఏదైనా వ్యాపారంలో పెట్టించి ఎలా లాభాలు తియ్యాలా అన్న ధ్యాసలో ఉన్నాడు. ఇంట్లోవున్న కాస్తసమయం రూపాయి పైసల లెక్కింపుకే అయిపోతున్నది.

"మగవాళ్ళకి డబ్బు భ్రాంతి పట్టుకొంటే యింతే, భారతీ. తనా పరా తెలీదు. తిండీ నిద్రా ఉండదు" అనేది వదిన.

"అక్కడికి ఆడవాళ్ళకే డబ్బు అక్కరలేనట్టు? పెట్టేవాళ్లు ఉంటే వీశలకొద్దీ నగలు మోస్తూ, పట్టుచీరెలు కట్టి కార్లలో తిరగ్గలరు. చల్లచల్లగా పానీయాలు సేవిస్తూ పంకాల క్రింద విశ్ర మించ గలరు. శ్రమ పురుషునిది; ఫలితం స్త్రీది," అంటూ దెబ్బకి దెబ్బ తీసేవాడు అన్నయ్య.

సూచనగా అన్నయ్యఅభిప్రాయం వ్రాసిన దగ్గరనుండి మామయ్య ఉత్తరాలతో ఊదర కొడుతున్నాడు. ఎన్నడూ ఉత్తరం వ్రాయని అత్తకూడా "అన్నయ్య ఖర్చుదారి మనిషి భారతీ. అంతా అతడి చేతిలో పెట్టి చేతులు దులుపుకోకు. నూరేళ్ళ నీ బ్రతుకు దానితో వెళ్ళమారాలి" అంటూ హెచ్చరించింది.

"ధనములేకున్న దుఃఖమురా; ధనము కలిగిన దాన్ని దాచ దుఃఖమురా!" అంటూ నా చిన్నతనంలో ఓ ముష్టివాడు పాడు కొంటూ వచ్చేవాడు. అతడికి డబ్బులేక అలా అంటున్నాడు

'ని డబ్బుంటే హాయిగా కావలసినవన్నీ బోలెడు కొనుక్కోవచ్చు అత్తయ్యా అనేదాన్ని. అత్తయ్య ఏం జవాబు చెప్పేదో నాకు గుర్తులేదు కాని ఆ మాట మరీ అంత సత్యదూరం కాదని తెలుసుకొన్నాను.

ఆ సాయంకాల పిట్టలు గూళ్ళకి చేరుకొనేవేళకి యిళ్ళలో దీపాలు సంధ్య వెలుగుమాటున మినుకు మినుకు మంటున్న సమయంలో జగదీశ్ వచ్చేడు. ఒక్కసారిగా చల్లటిగాలి బారుగా వచ్చి, అంతవరకూ చుట్టుముట్టిన ఊపిరి సలపని పొగని తొలగ దోసినట్లు అనిపించింది. నాలుగు మూలలా పసుపుబొట్లు పెట్టివున్న కవరు ఒకటి వదిన చేతిలో పెడుతూ "మా చెల్లెలికి పెళ్ళి" అన్నాడు.

ఆ పదిరోజులూ అతడు రాకపోయినందుకు కారణం తెలిసిందిపుడు.

"ఏమో రావడం లేదనుకొన్నాం. పెళ్ళి పనులమీద తిరుగుతున్నారన్నమాట!" అన్నాను.

"పెళ్ళిపనులన్నీ మా పిన్నమ్మ చూసుకొంటున్నది. డబ్బు జతపెట్టే పనిమాత్రం నా పైన ఉంచింది."

"అదుంటే మిగిలినవన్నీ కనుసంజ్ఞలతో వస్తాయి. అసలు చిక్కు దాన్ని జాగ్రత్తపెట్టడంలోనే ఉంది" అంది వదిన.

జగదీశ్ అప్పుగా సొమ్ము అడుగుతాడేమో అనుకొన్నాను. అడిగితే యియ్యాలని కూడా నిశ్చయించుకొన్నాను. కాని, అతడు ధనం కోరలేదు. ఇంకేదో కోరేడు. అతని కోర్కె విని క్షణకాలం నివ్వెరపోయేను. అది ఆ మాటలో లేదు. మాట అన్న తీరులోవుంది.

"మా స్వగ్రామమైన రంగాపురంలోనే పెళ్ళి. మీరంతా తప్పకుండా రావాలి" అన్నాడు.

"రంగాపురం అంటే...భారతి..."

"ఆఁ...ఆఁ...ఆ ఊరే. స్వగ్రామమని చెప్పుకొందుకు మాకు మిగిలిన ఒక్క యిల్లూ ఈ పెళ్ళితో వెళ్ళిపోతున్న దనుకోండి...అయినా 'నా' అని దేన్నిగురించైనా చెప్పుకోవాలనుకుంటే రంగాపురం గురించే చెబుతాను. నాది అనుకొన్న కొన్ని జ్ఞాపకాలు ఆ స్థలాన్ని పెనవేసుకొని ఉన్నాయి. అన్నట్టు, మీ ఇంటికి కూడా వెళ్లానండోయ్. నిర్మాణ కార్యక్రమం జోరుగా సాగిపోతున్నది. రామ్మూర్తిగారూ, భ్రమరాంబగారూ మిమ్మల్ని మరీ మరీ అడిగేమని చెప్పమన్నారు. వీలు చూచుకొని ఒకసారి వచ్చి కొన్నాళ్ళపాటు ఉండమన్నారు."

"ఆ పల్లెటూర్లో భారతి కేం తోస్తుంది?" అంది వదిన.

"పల్లెటూరని మరీ అంతలా తీసిపారెయ్యకండి. మా ఊరి ఏటి ఒడ్డున చింత తోపులో సూర్యాస్తమయం దృశ్యం చూస్తూ అలా కూర్చుంటే, ఈనాటికీ నన్ను నేను మరచిపోతాను. ఎంత అందంగా ఉంటుందనుకున్నారు! అందులో చిత్రలేఖనంలో ఏమాత్రం ప్రవేశమున్నవారైనా ఆ దృశ్యం ఒక్కసారి చూస్తే జీవితంలో తిరిగి మరచిపోలేరు."

"మా భారతి బొమ్మలు గీస్తుంది." అంటూ అవకాశాన్ని జారవిడువకుండా మరదలి గొప్పదనాన్ని వదిన అందించింది.

"ఎప్పటి మాటో మా వదిన చెపుతున్నది. ఇప్పుడేం లేదు." అన్నాను నేను, ఆమెను వారిస్తూ.

"మాధవ్ కూడా ఈ విషయం వ్రాసినట్టు గుర్తు. మీరు చిత్రిస్తున్న 'అజంతా సుందరి' చిత్రం చూసి అందులోని మీ పోలికలకి మెచ్చి మిమ్మల్ని పెళ్ళి చేసుకొన్నట్లు వ్రాసేడు. సరిగ్గా మీ వదినగారు సమయానికి గుర్తుచేసేరు. మీరు రంగాపురం వచ్చి చూసి నాకో బొమ్మ నకలు యియ్యకతప్పదు."

"చింతల తోపులో సూర్యాస్తమయం చిత్రం చిత్రించడానికి రంగాపురం రానక్కరలేదు జగదీశ్. ఏ వూరి కొసకి పోయినా అటువంటి దృశ్యాలు కనిపిస్తూనే ఉంటాయి. ఇక్కడ

కావలసింది కళ్ళ, నేర్పు. కళ్ళతో చూసిన దృశ్యాలు కాగితం మీద పెట్టగలిగే చాకచక్యం ఉంటే మనసుల నూగించే మధుర దృశ్యాలు—మీ చింతల తోపును తలదన్నేవి—చిత్రించి ఉండే దాన్ని. "నీలి మేఘాల్ని కాగలించుకొని మురిసిపోతూ కాంతులు వెదజల్లే మంచుకొండల్ని, కర్పూర పరాగంలా జల్లు జల్లులుగా నేలపైవాలే హిమపాతాల్ని చిత్రించి ఉండేదాన్ని. అది చేతకాకే ఆ సుందర దృశ్యాలని ఈ గుండెలలో దాచుకొని సంతృప్తి పడుతున్నాను" అన్నాను.

"మీ మనసుకి అంతలా హత్తిన అనుభవాన్ని, ప్రయత్నిస్తే, మీరు చక్కని చిత్రంగా చిత్రింపగలరు. నాకా నమ్మకం ఉంది." అన్నాడు జగదీశ్.

"మీ నోటినుండి వచ్చిన మాటలచలవవల్ల ఆ అనుభూతికి ఎప్పటికైనా రూపకల్పన చేయగలిగితే..."

"నాకేమిస్తారు! మీరు చిత్రించిన ఆ చిత్రం ఇయ్యండి."

"ఏ జ్ఞాపకాలనీ మీ మనసులో పొదగలేని ఆ చిత్రం మీరేం చేసుకొంటారు?" అన్నాను నేను.

"నా జీవితం పొడుగునా మీ అభిమానానికి, ఆత్మీయతకి జ్ఞాపక చిహ్నంగా దాచుకొంటాను" అన్నాడు అతను.

ఆ మాట అంటుంటే అతని ముఖంలో ఆనందం తొణికిస లాడింది.

"మీరంత ఆప్యాయంగా అడుగుతుంటే కాదంటానా, జగదీశ్? ఎంతకాలం అయినా ప్రయత్నించి నా అనుభవానికి రంగులు దిద్దుతాను. నా ఆనందానికి వన్నెలు దిద్దుతాను" అనుకొన్నాను మనసులో. పైకి మాత్రం "చూద్దాం, మీ కోర్కె నా కోర్కె తీరే శుభఘడియ ఎప్పటికి వస్తుందో" అన్నాను.

# 4

జగదీశ్ వచ్చివెళ్ళిన నాలుగురోజుల నాడు వదిన అన్నగారి పిల్లాడికి బాలసార అయింది. నాలుగో సంతానం అయినా, ముగ్గురు ఆడపిల్లల తరువాత పుట్టిన మగపిల్లవాడు కావటంచేత బాలసారకి ఆర్భాటంగా ఏర్పాట్లు చేసేరు. వదిన, పిల్లలతో. రెండు రోజులు ముందుగానే వెళ్ళింది. పెద్ద పిల్లాడు రఘుని మాత్రం, పరీక్షల మూలంగా. ఇంట్లో వదిలి వెళ్ళింది.

మొదట్లో అన్నయ్య వెళ్ళాలనుకోలేదు. పుట్టింటికి వెళ్ళిన వదిన అతడు రాకపోతే తన అన్నగారు తప్పనిసరిగా రావాలని వ్రాసింది.

"పెళ్ళంత ఆర్భాటంగా బంధువులందర్నీ పిలిచేరు. అంతా వచ్చి యింటల్లుడు రాకపోతే వ్యగ్రతగా ఉంటుంది" అంది.

"నువ్వెళ్ళిరా అన్నయ్యా. నాకేం భయంలేదు. రఘు తోడున్నాడు కదా" అన్నాను.

"తెల్లవారు ఝామున బస్సులో వెళ్ళి రాత్రికి తిరిగి వచ్చేస్తాను, అందిగా అంటున్నప్పుడు వెళ్ళకపోతే బాగుండదు" అన్నాడు అన్నయ్య.

సాయంకాలం అయిపోయింది. రఘు స్కూలునుంచి వచ్చి కాఫీ తాగి, ఆడుకోడానికి పోయేడు. అన్నయ్య రాత్రి భోజనం వేళకి వచ్చేస్తానన్నాడు. ముగ్గురికీ వంటచేసి కుంపటిపక్కగా పెట్టి వుంచేను. వాకిట్లో నీళ్ళు జల్లి మంచాలు వేసేను.

స్నానం చేసిన ఒంటిని చల్లగాలి హాయిగా తాకిపోయింది. వాకిట్లో మల్లెపందిరిపై మొగ్గలు మెల్ల మెల్లగా విచ్చుకొంటు

న్నాయి. మనసులోని తీయని తలపులకీ, మల్లెల వాసనకీ ఏదో అవినాభావ సంబంధం ఉందనిపిస్తుంది నాకు. సమయాసమయాల ప్రసక్తి లేకుండా ఆ సువాసన మనసుని గిలిగింతలు పెడ్తుంది.

మంచం మీదనుంచి లేచి మల్లెపందిరి దగ్గరికి వెళ్ళేను. అరవిచ్చిన మల్లెలు 'ఇదిగో మేం యిక్కడ ఉన్నా'మంటూ గుప్పున వాసనలు గుబాళించేయి. చేతికందిన నాలుగు మొగ్గల గుత్తి ఒకటి కోసేను. అనుకోకుండా చేతులు తలమీదికి వెళ్ళేయి. తప్పుచేసిన దానిలా చేతులు లాక్కొని, ఇటు అటు చూశాను.

"అత్తా! గోడెక్కి నే కోసి పెట్టనా? అటువైపు చాలా ఉన్నాయి!!" అన్నాడు, అప్పుడే ఆటల నుండి తిరిగివచ్చిన రఘు.

"ఈ రోజు అమ్మా, చెల్లీ లేరుగా, చెట్టునే ఉండనీ, రాత్రి కమ్మగా వాసన వేస్తాయి."

"మల్లె పూలంటే నీ కిష్టం లేదా అత్తా! నువ్వెప్పుడూ పెట్టుకోవేం?" అన్నాడు రఘూ అమాయకంగా.

"ఎందు కిష్టంలేదు?"

"మరి కోయ్యనా? అమ్మా, చెల్లీ లేరు కాబట్టి అన్ని పువ్వులూ నువ్వే పెట్టుకోవచ్చు" అన్నాడు పిల్లవాడు, నా వైపు చూస్తూ.

ఏవో ఆలోచనలు నన్ను గతంలోకి లాక్కుపోయేయి.

*   *   *

మాధవ్, నేనూ పందాలు వేసుకొని మల్లెమొగ్గలు కోసే వాళ్ళం. ఆ నాటికి విడే మొగ్గేదో, మరునాటి కేది విడుతుందో మాధవ్‌కి ఒకంతట తెలిసేదికాదు. చిన్నవీ, పెద్దవీ అన్నీతుంచిపోసి "చూసేవా, నే నెన్ని మొగ్గలు కోసేనో" అనేవాడు.

"మీరు కోసినవి వేరుగా ఉంచండి. అందులో ఎన్ని విడుస్తాయో చూద్దురుగాని. కనిపించిన మొగ్గల్లా దూచిపొయ్యగానే సరా" అనేదాన్ని.

నా మాట పూర్తి కాకుండానే అన్నిమొగ్గలూ కలిపివేసి, "ఇప్పుడు చెప్పు, ఎవరి మొగ్గలు విడుస్తాయో" అనేవాడు మాధవ్.

మొగ్గలన్నీ ఒడిలో పోసుకొని, "ఇప్పుడు చెప్పండి ఎవరు ఎక్కువ కోసేరో" అంటూ పరుగు తీసేదాన్ని.

* * *

...తన మాటకి నేను జవాబు చెప్పకపోవడం చూసి రఘు వెళ్ళిపోయేడు. ఆకుల చాటునుంచి ఒక్కొక్క మల్లీ 'ఇంకా రాత్రయిందా లేదా' అని కన్నెత్తి చూస్తున్నది. మల్లెల ప్రశ్నకి జవాబుగా వీధిలో లైట్లు వెలిగేయి. నడ సావిట్లో లైటు స్విచ్ ఆన్ చేసి వచ్చేను.

"అత్తా, నా కన్నం పెట్టే, ఆకలేస్తున్న" దంటూ రఘూ వచ్చేడు.

"నాన్నొచ్చే దాకా వుండరాదురా. అంతా కలిసి తినేద్దాం" అన్నాను.

"నాన్న ఎప్పటి కొస్తాడో, నాకు నిద్దరొస్తున్నది."

రఘుకి అన్నం పెట్టి, పక్క సిద్ధంచేసి, మళ్ళా వచ్చి వాకిట్లో కూర్చున్నాను.

తదియ చంద్రుడు దొంగవానిలా ఆకాశంలో అడుగు పెట్టేడు. నెలబాలు డెప్పుడూ కొంటె కోణంగిలా అగుపిస్తాడు నాకు. పున్నమి చంద్రుడు నిండుగా, హుందాగా, జీవితం అంతా తరచి చూసిన పెద్దమనిషిలా ఉంటాడు...ఉన్నట్టుండి ఒక చిన్న మేఘం పరుగు పరుగున వచ్చి ఆ అర్భకుణ్ణి కప్పివేసింది కాని, ఇంతలో, అడ్డ మొచ్చిన ఆ మేఘాన్ని తప్పించుకు వచ్చేడు చంద్రుడు.

వీధి చావిట్లో అడుగుల చప్పుడయింది. ఆకాశం మీదనుంచి దృష్టి తిప్పకుండానే "వచ్చేసేవా, అన్నయ్యా" అన్నాను.

"సారథి ఎక్కడికి వెళ్ళేడేమిటి?" అని ప్రశ్నిస్తూ జగదీశ్ వాకిట్లో కొచ్చేడు.

"ఓ! మీరా! అన్నయ్యనుకొన్నాను." అన్నాను, నేను కొంచెం ఆశ్చర్యంతో.

"ఇంట్లో లేడా? ఈ వేళప్పుడు ఉంటాడని వచ్చేనే!"

"ఈ రోజు వదిన మేనల్లుని బాలసారె..."

"తను వెళ్ళనన్నాడే!"

"మొదట్లో అలాగే అనుకొన్నాడు. కాని వెళ్ళక తప్పలేదు. ఉదయాన్నే వెళ్ళేడు. ఈ సరికి తిరిగి వస్తూండాలి. రండి, కూర్చోండి." అన్నాను, వరండాలో ఉన్న కుర్చీ వాకిట్లోకి లాగుతూ.

"రేపు ఊరికి వెళుతున్నాను. వారందాకా రాను. ఓ సారి చూసిపోదామని వచ్చేను. మరేం పనిలేదు."

"పోనీ, వచ్చినవారు ఎలాగూ వచ్చేరు కాబట్టి అన్నయ్య వచ్చేవరకూ నాకు సాయంగానైనా ఉండండి" అన్నాను.

గంట గడిచినా అన్నయ్య రాలేదు. ఆ విషయమే పట్టనట్లు జగదీశ్ ఏవో కబుర్లు చెప్పుకుపోతున్నాడు. మంచంమీద గోడకి జేర్లబడి కూర్చున్న నేను సగం వినీ, సగం వినకా 'ఊ' కొడుతున్నాను. అతని మాటల్లో ఏదో మత్తు ఉంది. అది నన్ను మెల్లగా జోకొట్టి సేద దీరుస్తున్నది.

గల గల ప్రవహిస్తున్న నీటికి ఏదో అడ్డుపడినట్లుగా ఒక్క సారిగా అతడు మాటలు ఆపేసేడు.

"మీకు నిద్రవస్తున్నదిలా వుంది. నే వెడతాను. ఈ పూటకి మీ అన్నయ్య వచ్చేందుకి ఇంక బస్సులు లేవు. రేపు వస్తే, నే వచ్చి వెళ్ళేనని చెప్పండి" అన్నాడు.

మంచం మీద సరిగా లేచి కూర్చుంటూ, "ఇంక బస్సులు లేవంటారా? తప్పకుండా వస్తానన్నాడే" అన్నాను, నేను.

"అటునుంచి వచ్చే ఆఖరి బస్సు ఎనిమిదింటికే వచ్చేస్తుంది. ఇప్పుడు తొమ్మిది కావస్తున్నది. దారిలో బస్సుకి ఏదైనా చికాకు వస్తే చెప్పలేను కాని......ఒంటరిగా ఉండేందుకి మీకేం భయం లేదుగా. భోజనంచేసి తలుపేసుకొని పడుకోండి. తెల్లవారి బస్సులో వచ్చేస్తాడు"

"భోజనం అంటే జ్ఞాపకం వచ్చింది. వండిన వంట వూరికే పోతుంది. మీరు భోజనం చేసి వెళ్ళరాదూ" అన్నాను నేను.

జగదీశ్ క్షణకాలం ఊరుకొని, "సరే...అలాగే కానీయండి. మీ చేత్తో పెడతానంటూంటే ఎందుకు వద్దనాలి"

పీటా, కంచం పెట్టి వడ్డన చేసేను.

"తనకోసం చేసిన వంటకాలన్నీ నే తినేస్తే ఏ రాత్రికో వస్తే మీ అన్నయ్య కడుపు మాడ్చుకోవాలి" అన్నాడు జగదీశ్, కొంచెం హేళనగా.

"మధ్యాహ్నం విందు భోజనం చేశాక ఓ పూట పస్తుంటే ఒంటికి మంచిదేలెండి" అన్నాను, చేతిమీద నెయ్యి వేసి. ఎదురుగా పీట మీద కూర్చుంటూ.

"మీరు కూడా పెట్టుకోండి"

"ముందు మీ భోజనం కానీండి"

"అదేం వీల్లేదు. మీరు వడ్డించుకోందే నేను తినను. నా తిండి విషయం మీకు తెలియనిదా? అంతా నే పూర్తిచేస్తే వండు కున్న మీకేం మిగలదు" అన్నాడు, అతను.

నేను చేతిలోకి ముద్ద తీసుకొనే వరకూ అతడు పళ్ళెంలో చేతులు పెట్టుకొని అలాగే కూర్చున్నాడు.

జగదీశ్ అన్నంత ఎక్కువగా ఏం తినలేదు. ఆర్భాటం మాత్రం చాలా చేసేడు.

"ఈ వంకాయ పచ్చడి చాలా బాగుంది. చారు అంటే చింతపండునీరు అన్న నా అభిప్రాయాన్ని ఈ రోజుతో మార్చేసు కొంటున్నాను. దాని పేరు మీ చేతుల మీదుగా సార్థకనామ ధేయం అయింది. నే నెప్పుడైనా పెళ్ళిచేసుకుంటే, మా ఆవిణ్ణి మీ దగ్గర వంట నేర్చుకోడానికి ఆర్నెల్లపాటు పంపిస్తాను."—అన్నాడు జగదీశ్.

జగదీశ్ మాటలూ, పొగడ్తలూ వింటూంటే మనసులో ఏదో సంకోచం రెపరెపలాడింది. కాని అతని ముఖం చూస్తే అందులో నిష్కాపట్యం, స్నేహశీలతా తప్ప ఇంకేం కనిపించలేదు.

జగదీశ్ భోజనంచేసి వెళ్ళిపోయేడు. అతన్ని సాగనంప డానికి వీధి గుమ్మందాకా వెళ్ళేను. పదిగజాలు నడిచి ఎందుకో వెనక్కి తిరిగి చూసేడతడు. నేనింకా గుమ్మంలో నే వుండడం చూసి చెయ్యెత్తి "టా టా" అన్నట్లు ఊపేడు. అప్రయత్నంగా నా చెయ్యికూడా పైకి లేచింది. అతడు వీథి మలుపు తిరిగేడు. రెండు నిమిషాల వరకూ, ఎత్తిన నా చెయ్యి అలాగే ఉండిపోయింది.

తిరిగి వచ్చి, జగదీశ్ కోసం వాకిట్లో వేసిన కుర్చీలో కూర్చు న్నాను. కాలికి ఏదో తగిలింది. వంగి దాన్ని చేతిలోకి తీసు కొన్నాను. అది ఖాళీ సిగరెట్టు పెట్టె. ఎంతో కాలానికి ఆ ప్రుల్ని చూస్తే కలిగే అనుభూతి నాలో కలిగింది.నిజానికి సిగరెట్టు పెట్టెతో నాకు ఆత్మీయత లేదు. కొద్దో, గొప్పో విరోధం కూడా ఉంది

కాని ఆ సమయంలో అది ప్రపంచంలో కల్లా పరమాత్మీయ మైన వస్తువులా కనిపించింది. మెల్లగా పైకెత్తి పట్టుకొని పెదవు లకు తాకించేను. బుగ్గలకి రాసుకొన్నాను. మా యిద్దరి మధ్య కుదిరిన ఈ సఖ్యాన్ని ఏ లోకంనుండైనా మాధవ్ చూడగలిగితే ఎంతో సంతోషిస్తాడు అనిపించింది.

దాని వాసన గతంలోని ఏవో అనుభవాలని దగ్గరకు లాగింది. మా ఇంట్లో మామయ్య కాని, అన్నయ్యకాని సిగరెట్లు కాల్చక పోవడం చేత వాటితో నాకు పరిచయం లేదు.

మొదటిరాత్రి మాధవ్ పాలు త్రాగి, తాంబూలం వేసుకొని సిగరెట్టు అంటించేసరికి తెల్లబోయి చూసేను.

"ఏం బెదిరిన లేడిలా అలా చూస్తావు?ఇది నిన్నేం కాల్చేయదు లే" అంటూ రెండో చేత్తో నన్ను దగ్గరకు తీసుకున్నాడు. ఆ వాసనతో ఏదో వెలపరం పుట్టుకు వచ్చింది. ఆ పొగ గొంతుక లోకి పోయి దగ్గు వచ్చింది. అతని చేతుల్ని తప్పించుకొని కొంచెం దూరంగా జరిగి కూర్చున్నాను.

"ఏం వెళ్ళిపోయేవు? కోపం వచ్చిందా?" అన్నాడు.

"లేదు. సిగరెట్ త్రాగడం పూర్తి చేసి, చేతులూ, నోరూ కడుక్కురండి. నా కా వాసన పడడం లేదు." అన్నాను.

"అయితే గట్టి చిక్కే వచ్చిందే! ఈ సవతుల మధ్య సామ రస్యం కుదరడం కష్టం అన్న మాట" అన్నాడు మాధవ్, చేతిలోని సిగరెట్టు ఏష్ట్రేలో పడేస్తూ.

"కాల్చకుండా పారేశేరేం?"

"నీకు బాగులేదన్నావు కదా?"

"నాకు బాగులేకపోతే, మీకు బాగున్నా మానేస్తారా?" అన్నాను-అతని అలవాటు ఎంత బలీయమైనదో తెలుసుకోవాలన్న ధ్యాసతో.

"ఇప్పుడా ప్రశ్నలన్నీ ఎందుకు భారతీ! నువ్వు కొత్తగా వచ్చేవు. సిగరెట్టు ఎంతకాలంగానో నాతో ఉంది. నీ కన్నా అది నన్ను బాగా అర్థం చేసుకోగలదు. ప్రస్తుతం నీకు కోపం రాకుండా చూసుకోడమే నా పని" అన్నాడు మాధవ్.

కాలం గడుస్తున్న కొద్దీ అతని అలవాటుని నేను అర్థం చేసుకొన్నాను. కొద్ది కొద్దిగా ఆ వాసనకి, పొగకి అలవాటు పడ్డాను. కాని ఒక్కొక్క సమయంలో మాధవ్ సిగరెట్లులేక తపిస్తుంటే మాత్రం అసూయపడేదాన్ని.

"నా కంటె కూడా మీకు సిగరెట్టు ప్రీతి. నే దగ్గర లేకపోయినా భరించగలరు కాని సిగరెట్టు ఒక్క గంట లేకపోతే అంగలారుస్తారు...

"భగవంతుడు వచ్చి 'నీకు భారతి కావాలా, సిగరెట్టు కావాలా?కోరుకో' అంటే ఆలోచన లేకుండా సిగరెట్టే అంటారు; అవునా?" అంటూ చిలిపిగా ప్రశ్నించేదాన్ని.

"ఛీ...ఛీ...సిగరెట్టుకీ, నీకూ సామ్యం ఏమిటి? డబ్బు పారేస్తే బజార్లో దొరికే వస్తువ అది" అని మాట దాటేసేవాడు మాధవ్.

ఏమైనా ఆ జీవితంలో సిగరెట్టుతో నేను రాజీ పడలేదు. మాధవ్ కోరినప్పుడు సున్నితంగా, ఆప్యాయంగా అందించినా, అతడు లేని సమయాల్లో ఆ కాలీ పెట్టెలను కాళ్ళ కింద వేసి నలిపేదాన్ని.

"ఒక సిగరెట్టు కాల్చి చూస్తే దానిలో ఉండే మజా తెలిసి వస్తుంది" అనేవాడు.

"ఛీ...ఛీ...నేనా...సిగరెట్టు కాల్చడమా?" అనేదాన్ని విహ్యాంగా.

*　　　*　　　*

స్పూన్ సిగరెట్టు పెట్టి బుగ్గని ఒరుసు కొంటూ ఇంకా అలాగే వుంది. మల్లెల వాసనల కున్న శక్తి దీనికీ ఉన్నదనిపించింది. కమ్మని దృశ్యాలు కళ్ళముందు జరుగుతుండగానే "భారతీ! ఇంత రాత్రయినా తలుపు బార్లా తీసుకుని కూర్చున్నావేం" అంటూ అన్నయ్య లోపలికి వచ్చేడు. చేతిలోని సిగరెట్టు పెట్టెను, తడబడుతూ, బ్లౌజులోకి జారవిడిచేను. "అబ్బే, ఏం లేదు అన్నయ్యా, చల్లగా గాలి వేస్తున్నదని ఇలా కూర్చున్నాను."

"నా కోసం కాచుకూర్చోకపోతే భోజనం చేసి పడుకోలేక పోయేవా?...వెధవ బస్సులు, వెధవ ప్రయాణాలు! ఈ కాస్త దూరానికే రెండుసార్లు మరామత్తు. ఊరికి అరుమైళ్ళ దూరంలో రెండు గంటలై పడి పాట్లు పడుతున్నాం. పోనీ, ఇంకేదైనా చూసుకుపోదాం అనుకొంటే, ఇదిగో బైలుదేర బోతున్నది, అదిగో కదల బోతున్నదని చెప్తారు, డ్రైవర్లు. అది సరేకాని, వేళ తప్పి భోజనం చేసేను. నాకేం ఆకలిగా లేదు. పద; నువ్వు భోజనం చేద్దువుగాని" అంటూ వంట ఇంటివైపు దారి తీసేడు అన్నయ్య.

ఎదురెదురుగా ఎంగిలి కంచాలు, మూతలు తీసి ఉన్న వంట గిన్నెలు చూచి "భోజనం అయిందన్నమాట...అబ్బో...రఘూ ఈ పూట పెద్ద కంచంలో పెద్ద మనిషిలా, అన్నం విరజిమ్మకో కుండా, తిన్నాడే" అంటూ కామెంటు చేసేడు.

అన్నయ్య మాటకి నేను అవును, కాదు అంటూ జవాబు చెప్పలేదు. అలా ఎందుకు జరిగిందో నాకు అర్థం కాలేదు. జగదీశ్‌ని భోజనం చేసి వెళ్ళమన్నప్పుడు నేను చేస్తున్న పనిలో తప్పు ఉందనికాని, దానిని ఇతరుల దగ్గర దాచవలసిన అవసరం ఉంటుందని కాని అనుకోలేదు.

అదివరకు జగదీశ్ రెండు మూడుసార్లు అన్నయ్య పంక్తిని భోజనం చేసేడు. చెల్లెలి పెళ్ళి పిలుపుకి వచ్చిన రోజున, అన్నయ్య లేకపోయినా, వదిన భోజనం పెట్టింది. జగదీశ్ భోజనంచేసి వెళ్ళేడంటే అన్నయ్య కోపగించుకోడు. కాని అన్నయ్య దగ్గర యథార్థాన్ని వెల్లడింపలేక పోయాను.

తలనొప్పిగా ఉందని చెప్పి, అన్నయ్య పడుకోడానికి వెళ్ళి

పోయాడు. "కాస్త కాఫీ తెస్తాను వుండు. రెండు తలనొప్పి మాత్రలు వేసుకొని కాఫీ తాగి పడుకొంటే నిద్రలో తగ్గిపోతుంది" అన్నాను.

మాటవరసకి "ఇంత రాత్రప్పుడు ఏం చేస్తావులే, అన్నా, అన్నయ్యకి కాఫీ త్రాగాలని వుందని నాకు తెలుసు. కాఫీనీళ్ళు మరుగుతూంటే పాలకోసం చూసేను. అన్నయ్యకి ఉదయం చీకటి తోనే కాఫీ తాగే అలవాటు వుంది. అందుకోసం రాత్రి కొద్దిగా పాలు పుచ్చుకొని ఉంచుతాం. జగదీశ్ తో మాట్లాడుతుండగా పాలవాడు పాలు తెచ్చి గిన్నెలో పోసేడు. మాటల సందడిలో ఉట్టిమీద పెట్టడం మరిచిపోయేను. పాలన్నీ పిల్లి ఆరగించి వెళ్ళి పోయింది. మరుగుతున్న నీళ్ళగిన్నె దింపి గదిలోకి వచ్చేను. నా చేతిలో కాఫీకప్పు లేకపోవడం చూసి "ఏమయింది?" అన్నాడు అన్నయ్య.

"పాలు ఉట్టిమీద పెట్టడం మరిచిపోయేను; పిల్లి తాగే సింది." అప్పుడు కాఫీ లేకపోవడమే కాక, ఉదయం పాలవాడు వచ్చేవరకూ కాఫీకి పాలు ఉండవన్నసంగతి అన్నయ్యకు చిరాకు కలిగించింది.

"అంత మైమరచిపోయి ఏం చేస్తున్నావేం?" అన్న అన్నయ్య కంఠం కాస్త కరకుగానే వినిపించింది.

ఏదో ఆలోచనల్లో పడి...ఆడుతున్న అబద్ధం, అందుకు కారణం అయిన సన్నివేశం నాలో ఆందోళన రేపేయి. ఆ పరి స్థితిని కల్పించుకొన్నందుకు నన్ను నేనే నిందించుకొన్నాను.

నా ముఖంలోని మార్పును, మాటలోని దైన్యాన్ని అన్నయ్య గుర్తించేడు లాగుంది. మాధవ్ గురించిన తలపుల్లో పడి మరిచిపోయే ననుకొని వుంటాడు. "పోనీలే, ఉదయం వేరేగా ఎక్కడైనా తీసుకొందాం, పోయి పడుకో," అన్నాడు సాను భూతిగా.

అన్నయ్యకి మందూ, నీళ్ళూ ఇచ్చివచ్చి రఘూపక్క మంచం మీద పడుకొన్నాను.

*　　*　　*

జగదీశ్ వచ్చి వెళ్ళిన సంగతి అన్నయ్యతో చెప్పాలని ఒకటి రెండుసార్లు ప్రయత్నం చేసేను. కాని, ఏదో అవ్యక్తమైన భయం ఎప్పటికప్పుడు నా నోరు నొక్కేసేది. నే చేసిన పనిలో తప్పు లేదనుకొంటున్నప్పుడు ఎందుకు భయపడాలో నా కర్థం కాలేదు. అయినా ఆ సంఘటనని నిర్మలంగా చెప్పలేక పోయేను.

వదిన తిరిగి వచ్చేక ఒకసారి జగదీశ్ భోగట్టా వచ్చింది. ఆ అవకాశాన్ని జారవిడుచుకోకుండా ఆ రోజు జరిగిన సంగతి వదినతో చెప్పి, మనసు చులకన చేసుకోవా లనుకొన్నాను. అంతలో రవి అడుగులు తడబడి నేలమీద బోర్ల పడి దెబ్బ తగుల్చుకున్నాడు. వాడిని సముదాయించి ఆ సద్దు సణిగేసరికి ఇంకేదో...ఇంకేదో... అలాగయి పోయింది ఆ రోజు.

మరునాడు సాయంకాలం స్నానం చేసి వచ్చి మల్లెమొగ్గలు కోస్తున్నాను. అన్నయ్య అప్పుడే ఆఫీసు నుంచి వచ్చేడు. వదిన వంట యింట్లో కాఫీ కలుపుతున్నది.

"భారతీ! జగదీశ్ వచ్చేడని వదినతో చెప్పు. రెండు కప్పులు కాఫీ పట్టుకురా." అంటూ అన్నయ్య కేకవేసేడు.

క్షణకాలం నా కాళ్ళు గడగడ లాడేయి. నిలిచి ఉన్న బల్ల మీంచి పడబోయి పందిరి నానుకొని ఆపుకొన్నాను.

ఎప్పుడూ జగదీశ్ వచ్చేడంటే నాకు సరదాగా ఉండేది. కాని ఆ రోజు అతని రాక నాలో ఆందోళన రేపింది. వాకిట్లోంచి వంట యింట్లోకి వెళ్ళుతుంటే చావిట్లో ఎదురుగా కుర్చీలో కూర్చున్న జగదీశ్ కనిపించాడు. కొద్దిగా లేచి నిలబడుతూ "నమస్కారం అండీ," అన్నాడు. అక్కడి నుంచే ప్రతి నమస్కారం చేసి వెళ్ళిపోయేను.

"నువ్వే కాఫీ పట్టుకెళ్ళి వాళ్ళకియ్యి, నేను అన్నం వార్చి వస్తాను," అంది వదిన.

చావిట్లో కాలు పెడుతుంటే జగదీశ్ మాటలు వినిపించేయి:

"భారతి చెప్పలేదా? నువ్వొచ్చే ముందు వరకూ నే నిక్కడే కూర్చున్నాను. మీ యింట్లో భోజనం కూడా చేసి వెళ్ళేను. భారతి చేతి వంట రుచిచూసే భాగ్యం నా కారోజున కలిగింది. ఆ భోజనం

ఎప్పటికీ మరచిపోలేననుకో," అంటున్నా వతను. ట్రేలో కాఫీ కప్పులు గణగణమన్నాయి.

"జాగ్రత్త. మెల్లిగా పెట్టు," అన్నాడు అన్నయ్య నా వైపు చూస్తూ. "జగదీశ్ ఊరికి వెళుతున్నానని నీతో చెప్పేడట, ఆ మాట చెప్పలేదేం?" జవాబు చెప్పేందుకు నేను నోరు తెరిచే అంతలో "మరచిపోయి వుంటారు," అన్నాడు జగదీశ్.

"ఇది ఎప్పటికీ మామూలు మనిషవుతుందో గాని, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ పరాగ్గానే వుంటుంది. ఆ రోజు ఆలోచనల్లో పడి పాలన్నీ పిల్లికి పెట్టింది," అన్నాడు అన్నయ్య.

వదిన వచ్చేక ఈ సంగతి మరోచుట్టు తిరిగింది.

"ఈ వయసులోనే యింత మతిమరుపైతే ఎలాగ భారతీ! మొదట్లో మరిచిపోయేవే అనుకో. నే నడిగినప్పుడైనా చెప్ప వచ్చుగా," అంది.

ఆ రోజు సంభాషణలో ఎప్పటిలా కులాసాగా పాల్గొన లేకపోయేను.

"ఈ రోజు మీరు ఉత్సాహంగా లేరు," అన్నాడు జగదీశ్.

"కాస్త తల దిమ్ముగా వుంది," అన్నాను మెడదువు ఒత్తు కుంటూ.

"కళ్ళు మూసుకొని కాస్తసేపు పడుకో. లేచేసరికి సులువుగా వుంటుంది," అంది వదిన.

ఆ సాకుతో అక్కడినుంచి తప్పుకొన్నాడు. ఆ రోజునుంచి అన్నయ్యా, వదినా మెల్లగా ఏమనుకొంటున్నా నా గురించే మాట్లాడుకొంటున్నా రనిపించేది.

"ఇదిగో చూసేరా, మీ చెల్లెలు ఎంత నంగనాచో! అర్ధ రాత్రి దాకా పరాయి మగాణ్ని యింట్లో ఉంచుకొని భోజనం పెట్టి పంపిన మనిషి ఆ మాటే మరిచిపోయిం దంటే ఎవరైనా నమ్మగలరా?"

"ఇంకా ఏం జరిగిందో, ఎంతవరకూ వెళ్ళిందో?"

"ఏమో ఎలా తెలుస్తుంది? రంకు నేర్చినమ్మ బొంకు నేర్చిందన్న సామెతలా..."

"అలాగని ఊరుకొంటే లాభం లేదు లక్ష్మీ, తగిన కట్టుదిట్టంలో ఉంచాలి!"

ఈ మాట లేవీ నేను విన్నవికావు. వదినా, అన్నయ్యా అన్నవీ కావు. నా భ్రాంతి సృష్టించిన గాలి దెయ్యాలు. పట్టుకుందా మంటే దొరకవు; చుట్టూ మాత్రం తిరుగుతాయి.

అన్నయ్యకీ, వదినకి నా పట్ల ఎటువంటి తప్పుడు అభిప్రాయమూ అంతకుముందు లేకున్నా, ఆ రోజుల్లో నా ప్రవర్తన వారిలో అటువంటి అనుమానాల్ని రేకెత్తించేందుకు తోడ్పడి వుంటుంది.

జరిగిన విషయం వడ్లగింజలో బియ్యపుగింజ అన్నంత ప్రాముఖ్యం కలది. దానికోసం నేనెంగు కంత ఆరాటపడి అయినవాళ్ళ దృష్టినుంచి తప్పుకొనేందుకు ప్రయత్నం చేయవలసి వచ్చిందో నా కీనాటికీ అర్థమయ్యే విషయం కాదు.

ఆ పరిస్థితి నుండి తప్పుకొందుకు మామయ్యగారి యింటికి వెళ్ళిపోవా లనుకొన్నాను. వారం రోజులై మామయ్య దగ్గరనుంచి ఉత్తరం లేదు. అత్తయ్య దగ్గరికి వెళ్లేందుకు ఉత్తరం రాక పోతేనేం అనుకొన్నాను. సాధ్యమైనంత త్వరలో, తిరిగి జగదీశ్ ని కలుసుకోకుండా, వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాను.

ఆ ఆలోచన మనసుకి బాధ కలిగించింది. స్నేహపాత్రుడు, సహృదయుడు అయిన జగదీశ్ తో మాటమాత్రంగానైనా చెప్పకుండా యిలా వెళ్ళిపోతే అతడు బాధపడతాడేమో అనిపించింది. కాని అది తప్పనిసరి అయింది. అతనిముందు నిర్మలంగా నిలబడి మాట్లాడే శక్తిని నేను కోల్పోయేను. అణువంత దానిని తెలివి తక్కువగా పెంచుకొని కొండంత చేసుకొన్నాను. ఈ విషయంలో పైవాళ్ళు ఏమనుకొన్నా మానినా మనసే నన్ను క్రుంగదీస్తున్నది. దీనినుంచి తప్పుకొనేందుకు ఇక్కడనుంచి వెళ్ళిపోవడం ఒక్కటే మార్గం. సెలవు పూర్తయి జగదీశ్ తన దారిన తను వెళ్ళిపోతే

ఈ విషయం ఇతరుల దృష్టిలోనూ, నా మనస్సులోనూ మరుగున పడిపోతుంది అని తృప్తిపడ్డాను.

"అర్థాంతరంగా ఇప్పుడు ప్రయాణం కాకపోతేనేం? పది రోజులలో నేనూ రావాలనుకొంటూను. ఇద్దరం కలిసిపోదాం" అన్నాడు అన్నయ్య.

"పక్క నున్న ఊరికి తోడు కావాలా అన్నయ్యా! ఇక్కడ ఉండాలని ఉన్నంతకాలం అత్తయ్య అంతగా పిలిచినా వెళ్ళ లేదు. ఇప్పుడు వెళ్ళాలని ఉంది. ఆటంకం చెప్పకు" అన్నాను.

"అంతేనా? మనసులో ఇంకేదో పెట్టుకొని వెళ్ళిపోవడం లేదు కదా?" అంది వదిన.

"ఏం మాటన్నావు,వదినా!నువ్వు నాకేం తక్కువ చేసేవని?"

"ఏమో ఈ మధ్య కలివిడిగా లేకపోవడం చూసి కోపం కాని తెచ్చుకొన్నావేమో అనుకొంటున్నాను."

"అటువంటి దేం లేదు. ఈ మధ్య ముభావంగా ఉండి ఉంటే దానికి కారణం నువ్వు మాత్రం కాదు."

"కొంపతీసి, యిక్కడ ఉంటే అత్తయ్య రాసినట్టు నీ సొమ్మంతా కాజేస్తానని భయపడి వెళ్ళిపోవడం లేదుకదా?" అంటూ అన్నయ్య భుజాలు తడుముకున్నాడు.

నాలుగు రోజుల క్రిందట అన్నయ్య తన స్నేహితుడు అంటూ ఒక వ్యక్తిని తోడుకు వచ్చేడు. అతని కూతురి పెళ్ళి అనుకోకుండా స్థిరపడిందట. అంత తొందరలో అమ్మ చూపితే యింటికి ధర రాదని నాలుగువేల రూపాయలు అప్పు కావా లన్నాడు. నోటు రాసి, ఇల్లు అమ్మకం కాగానే వడ్డీతో సహా డబ్బు ఇచ్చేస్తానన్నాడు.

"నమ్మకస్థుడు. మంచివాడు" అన్నాడు అన్నయ్య.

ఇంకొక రోజైతే ఏమని ఉండేదాన్నో. ఆ రోజు నాపరిస్థితి వేరుగా ఉంది. అన్నయ్య చెయ్యమన్నట్టు ఆలోచన జోలికి పోకుండా చేసేసేను. అత్తయ్య అన్న మాట మనసులో మెదిలింది.

"నా మంచి చెడ్డలు చూసేందుకి నీ కన్నా ఆప్తులు ఎవ రున్నారు అన్నయ్యా, ఎందు కలా అనుకొన్నావు?" అన్నాను.

"మరేమిటి కారణం" అని వదిన ప్రశ్నించలేదు. ఆమె అడిగితే నే చెప్పే పరిస్థితిలో లేను కూడా.

"సరే. నీ యిష్టమమ్మా! మళ్ళా నీవు ఎప్పుడు రావాలని ఉన్నా..."

"నువ్వు వేరే చెప్పాలా, అన్నయ్యా!" అన్నాను.

రెండు నిమిషాలకి రైలు కదలబోతుండగా పరుగుతో వగరుస్తూ వచ్చేడు జగదీష్. అతడు వేసుకొన్న ఇస్త్రీ లాల్చీ చెమటతో తడిసిపోయి ఉంది. నుదుటిపైనా పెదవులమీదా స్వేద బిందువులు మిలమిల ముత్యాల్లా మెరుస్తున్నాయి. వచ్చి నిలిచిన ఒక క్షణం వరకూ అలసట వల్ల అతడి నోటికి మాట అందలేదు.

"ఇది నిజంగా అన్యాయం సుమండీ!" అన్నాడు దోషారోపణ చేస్తున్నట్లు, నా వైపు చూస్తూ.

అతడు అన్నమాట నిజమే అనిపించింది. నాకు వీడ్కోలు యివ్వడానికి అంత ఆపేక్షతో వచ్చిన వ్యక్తి చెప్పకుండా దొంగ చాటుగా జారుకోవాలనుకోడం అన్యాయమే!

అతడు మా గుమ్మంలో కాలు పెడుతుంటే "అత్తయ్య ఊరి కెళ్తున్నది. అమ్మా, నాన్నా స్టేషను కెళ్ళేరు" అంటూ రఘూ చెప్పేడుట.

"నిన్న సాయంకాలం సారథి కనిపించినప్పుడైనా మీ ప్రయాణం భోగట్టా ఏగిగా చెప్పలేదు. ఇంతలో ఏమయింది అనుకొన్నాను. పనిమనిషి నడిగితే తనకి తెలియదంది. మీ అత్తయ్యగారి ఇంటికి వెళ్ళుతున్నారని మాత్రం చెప్పింది."

"ప్రత్యేక కారణం ఏమీ లేదండీ. ఏనాటి నుంచో వెళ్ళాలనుకుంటున్నదే, ఈరోజుకి సమకూరింది" అన్నాను.

గార్డు ఈల ఊది, పచ్చజెండా పట్టుకొన్నాడు. రైలు శక్తిని కూడదీసుకొని చక్రాలను కిరకిర లాడించింది. అప్పుడే జ్ఞాపకం వచ్చినట్లు చేతిలోని కాగితంపొట్లం అందించేడు జగదీశ్.

"ఏమిటివి?" అని కాగితం విప్పుతూ ప్రశ్నించాను.

"అనాబ్ షాహీ అంగూర్. ద్రాక్షపళ్ళంటే మీకు చాలా ఇష్టం అని మాధవ్ ఎప్పుడో వ్రాసినట్లు గుర్తు. తను రిటైరు

అయ్యేలోగా మీ కోసం హైద్రాబాద్‌కి సమీపంలో కొంత స్థలం కొని ద్రాక్ష తోట వెయ్యాలనే సంకల్పం వున్నట్లు కూడా రాసేడు. ఈ రోజు ఒక స్నేహితుడు తెచ్చి ఇచ్చేడు, కొన్ని గుత్తుల పళ్ళు. మీ కియ్యాలనే పట్టుకొచ్చేను...”

రైలు కదులుతుంటే అతని చివరి మాటలు గాలిలో తేలుతూ నెమ్మదిగా వినిపించేయి. ఆ నాడు జయపూర్‌లో రైలు కదులుతుంటే జగదీశ్ యిచ్చిన జంట గులాబులు గుర్తుకు వచ్చేయి. “మీ దాంపత్య జీవితానికి నా శుభాకాంక్షలు” అంటూ చేతిలో పెట్టాడు. ఆ నాటి జీవితానికి సౌకుమార్యం, సౌందర్యం మూర్తీభవించి పరిమళం వెదజల్లే జంట గులాబులు చిహ్నం అయితే ఈ నాటి జీవితానికి పులుపు, తీపి మిశ్రమమైన ద్రాక్ష పళ్ళు అర్థం చెప్తున్నాయా? ఈ జీవితంలో కూడా పులుపులో తీపి అంతర్గతంగా ఉందనీ, దానిని అస్వాదించే మన స్తత్వం అలవాటు చేసుకొంటే అది పైకి వస్తుందనీ జగదీశ్ తన అభిప్రాయం వ్యక్తం చేస్తున్నాడా? అతడు తను చేస్తున్న ప్రతి పనిని ఇంత నిశితంగా ఆలోచించి చేస్తాడా, లేక యిది కాకతాళీయంగా జరిగిందా?

మెల్లగా సాగిపోతున్న రైలులోంచి పైకి చూసేను. ప్లాట్‌ఫారం మీద నిలబడ్డ అన్నయ్య, జగదీశ్ చేతులు ఊపుతున్నారు. సగానికి పైగా లేచిన నా చెయ్యి ఏదో గుర్తుకి రాగా నిగాలు పడి వాలిపోయింది. కళ్ళల్లో నిలిచిన నీటి తెరల వెనక అన్నయ్య, వదిన, జగదీశ్‌ల మూర్తులు కప్పిపోయేయి.

దుఃఖాన్ని ఆపుకొంటూ వెనక్కి తిరిగేను.

మందహాసం చేస్తూ నా వైపే చూస్తున్నాడు మాధవ్.

“మాధవ్”అంటూ గట్టిగా కేక వేసేను. ఎదురుగా కూర్చున్న స్త్రీ స్టేషనులో ఉండిపోయిన బంధువులతో ఏదో చెప్పమరిచేననో, లేక ఏమైనా వస్తువు విడిచి వచ్చేననో అనుకొనిఉంటుంది.

“మాట అందదమ్మా. దాటి పోయేం” అంది ఆవిడ.

నిజమే. మాధవ్ నా జీవితంలోంచి దాటి పోయేడు. ఇంక నా మాట అతని కందదు. నా సుఖదుఃఖాలు అతడికి పట్టవు. నా బ్రతుకు నే చూసుకోవాల్సిందే-అనుకొన్నాను.

# 5

వారం రోజులకి అన్నయ్య వచ్చేడు. ఇంటి ముందు బండి ఆగిన సవ్వడి విని వీధిలోకి వచ్చేను. అన్నయ్య చేతిలో రవిని చూసి వదిన కూడా వచ్చిందనుకొన్నాను.

"వదిన రాలేదే! వీడు నీకోసం బెంగపెట్టుకొంటే తీసుకొచ్చేను. నువ్వెళ్ళిన దగ్గరినుంచీ 'అత్త అత్త'అంటూ ఒకటే గోల! ఎన్ని విధాల నచ్చచెప్పినా ఊరుకోడు. దానితో మీ వదినకి విసుగుపుట్టి 'పోరా, అత్త...అత్త అంటూ చంపేస్తున్నావు. మీ అత్తనే ఉద్ధరించు, నా కింకా ముగ్గురు పిల్లలు ఉన్నారు,' అంటూ అంపకం పెట్టింది" అన్నాడు అన్నయ్య.

రవికి నా దగ్గర చనువున్న మాట నిజమే. కాని తల్లి దగ్గర ఉన్నా నా కోసం బెంగపెట్టుకొనేటంత చేరిక ఉన్నదనుకోలేదు. అమ్మ దగ్గరగా ఉన్నా రవి అత్తకోసం బెంగపెట్టుకొన్నాడన్న మాట. ఈ సంగతి నా కెందుకో చాలా తృప్తి నిచ్చింది. మనసులోని ఖాళీని నింపినట్లయింది. ఆశలకి కొత్త చిగురు తొడిగినట్లయింది. చిగురు కొసని చిన్నారి మొగ్గ తలవూచినట్లయింది.

'ఈ చిగురు పెరుగుతుంది. ఈ మొగ్గ పువ్వుగా మారి సొగసులు వెదజల్లుతుంది.' అనుకొంటూ రవిని చేతిలోకి తీసుకొన్నాను.

"అత్తా...అత్తా...అన్నయ్యొచ్చేడు" అంటూ పెరట్లో స్నానం చేస్తున్న అత్తకి ఆ వార్త అందజేసేను.

"వదిన కూడా వచ్చిందా?"

"లేదు"

"మరి వీడు?" నా చేతిలోని రవిని చూసి అత్తయ్య ప్రశ్నిం

చింది. "నా కోసం బెంగ పెట్టుకొన్నాడుట. అందుకని అన్నయ్య తీసుకు వచ్చేడు."

ఆ మాట నమ్మినట్లు, దానికి ఇంకేదో అర్థం ఉన్నట్లు అత్తయ్య అదోలా చూసింది. అత్త చూపులోని అర్థం అప్పుడు నాకు బోధపడలేదు. వదిన సోమరితనం వల్ల చంటివాడితో వేగలేక పంపి ఉంటుందని అత్తయ్య అభిప్రాయమేమో అనుకొన్నాను.

రవి జిలిబిలి పలుకులతో ఇంటికి కళ వచ్చింది. అన్నయ్య రవిని తీసుకురావడం మంచి పని చేసేడు. నా దగ్గర వాడు ఉండగలిగితే కాలక్షేపానికేం లోటు ఉండదనుకొన్నాను. ఆ ఉదయం అత్తయ్య చూసిన చూపు తిరిగి ఆమె కళ్ళలో కనిపించలేదు. వంటపని పూర్తిచేసుకొని రవిని ఒడిలో పెట్టుకొని ముద్దులు ఒలకబోసింది.

"ఏంరా తాతయ్య" అంటూ, మామయ్య, నోరు మయ్య కుండా మనుమడితో కబుర్లు చెప్పేడు.

రవికి బుర్రనిండా ఆలోచనలు ఉన్నాయి. మాటలు రాక పోయినా తన అభిప్రాయాలని ఇంట్లో వారికి అనువదించి చెప్పడానికి గట్టి ప్రయత్నమే చేస్తాడు. తనకున్న అన్ని అవకాశాలూ ఉపయోగించుకొని తన కోర్కెలు తీర్చుకుంటాడు.

రవికి నీళ్ళుపోసి పౌడరద్ది బట్టలు తొడుగుదామని అన్నయ్య పెట్టె తీసేను. పలచటి వాయిల్ జుబ్బాలు, బొంగులాగూ అందుకొన్నాను. రవి నా చేతిలో బట్టలు చూసి, ఒడిలో నుండి పాములా జారిపోయి పెట్టెలోని రంగు రంగుల బుష్‌షర్టు పట్టుకు వచ్చేడు.

"చూసేవా అన్నయ్యా, నీ కొడుకు గడుసుదనం. వాడికి తెల్లజుబ్బా పనికిరాదుట. రంగుల బుష్‌షర్టులు కావాలిట" అన్నాను.

"అబ్బాయిగారికి రోజు కో కొత్త డ్రెస్సు తొడగాలేం? ఈ పాత లాల్చీ పనికిరాదూ?" అంటూ రవి బుగ్గలు మెల్లగా సాగదీసేను. రవి కిలకిల నవ్వేడు.

"నీలాంటి డబ్బున్న మేనత్త అండవుండగా వాడికేం లోటు?

రోజు కొకటి మారుస్తాడో, గంటకొకటి మారుస్తాడో చూస్తూండు" అన్నాడు అన్నయ్య నవ్వుతూ.

ఆ మాటలో ఏదో వెలితి కనిపించింది. ఆ నవ్వులో ఏదో భావం తిరిగినట్లయింది. ఆ భావానికి అర్థంకోసం, ఆ మెలి తిరిగిన మాటకి తుదిమొదలు కోసం దీక్షగా అన్నయ్యముఖంలోకి చూసేను. నా చూపులో ఏముందో? అన్నయ్య ముఖం రంగులు మారినట్లయింది. "అలా ఓ సారి వీధిలోకి వెళ్ళొస్తాను" అంటూ తొందరగా వెళ్ళి పోయేడు.

చీకటి పడుతుంటే మామయ్య వచ్చేడు. అన్నయ్య ఇంట్లో లేకపోవడం చూసి దగ్గరికి చేరబారేడు.

"అన్నయ్యేమన్నాడు?" అంటూ ప్రశ్నించేడు.

"దేన్ని గురించి?"

"మరి దేని గురించి? డబ్బు గురించి. అందుకే కదూ ఇప్పుడు వచ్చింది?"

"ఆ సంగతి నాకు తెలియదు. అన్న య్యేం చెప్పలేదు."

"నీకు తెలియక పోయినా వాడిసంగతి నాకు తెలుసు భారతీ! ఆ డబ్బుని పిడికిట్లో యిముడ్చుకొని కడతేర్చే వరకూ వాడికి తోచదు. ఇలా మైనారిటీ తీరిందో లేదో, నా ఇష్టం అంటూ, ఉన్న భూములు అమ్మేసేడు. ఏదీ, ఆ డబ్బు ఎక్కడ పెట్టేడు? ఎంత ఖర్చు దారి మనిషైనా కొస్త వెనకా ముందూ చూసుకోవద్దూ?"

"ఏదోలే, మామయ్యా! అప్పుడన్నీ అలా కట్టకట్టుకొని వచ్చేయి. మనిషి ప్రాణంకన్నా డబ్బు ఎక్కువ కాదుకదా. ఆడబ్బు సరిగా సమయానికి ఉండబట్టే వదిన బ్రతికిందేమో? పోతేపోయింది మాయదారి డబ్బు" అన్నాను.

"అదిసరే తల్లీ. ఇప్పుడు దానికోసం నే నేడవడంలేదు. తలచెడిన ఆడపిల్లవి. నీ డబ్బు కొస్తా వ్యవహారం, వ్యాపారం అంటూ తగలేస్తే నీ బ్రతుకు ఎలా తెల్లవారుతుందని నా బెంగ."

"మీరంతా ఉండగా నా కేం లోటు, మామయ్యా" అన్నాను.

"డబ్బుంటే అంతా వుంటారమ్మా, అది లేనివాళ్ళపాట్లు..."

ఆ రోజు మామయ్య ఏదో మనసులో పెట్టుకొని బాధ పడుతూ మాట్లాడుతున్నట్లు అనిపించింది.

"ఏమయింది మామయ్యా? ఎందుకు నీ కీ బెంగ" అన్నాను.

"అన్నయ్య మారిపోయేడు, తల్లీ! ఈ ఉత్తరం చూడు" అంటూ ఒక పాత ఉత్తరాన్ని చేతిలో పెట్టేడు.

అది నేను అక్కడ వుండగా అన్నయ్య వ్రాసింది. మామయ్య మాటిమాటికీ నా డబ్బుగురించి ప్రస్తావించడం అన్నయ్యకి నచ్చలేదు.

"నా చెల్లెలి డబ్బు. నాకు తోచినట్లు వ్యవహారం చేస్తాను. దానికి నా కన్న దగ్గరివారు, అభిమానస్తులు లేరుకదా? నేను దానిని నాశనం చేసేటట్టూ, అక్కడికి మీరేదో ఉద్ధరించేటట్లూ సలహాలిస్తుండడం ఏం బాగాలేదు. ఈ పాటికి మీరు డబ్బుతో కూడిన వ్యవహారాల నుంచి తప్పుకోడం మంచిది" అని వ్రాసేడు.

ఆ ఉత్తరం కాస్త కరుకుగానే ఉంది. నన్ను పెంచి పెద్ద చేసిన మామయ్యకి అలా వ్రాసిఉండకూడదనుకున్నాను.

"అన్నయ్యమాటల కేంలే మామయ్యా? పెద్దవాడివి. నా మంచి కోరవలసిన వాడివి. నీ యిష్టం లేకుండా నే నేపనీ చెయ్యను" అన్నాను.

నా మాటతో మామయ్యకి సంతృప్తి కలిగింది.

"నీ మనసు నాకు తెలుసులే తల్లీ" అన్నాడు నెమ్మదిగా.

ఆ రాత్రి ఎంతవరకూ చర్చించినా అన్నయ్యా, మామయ్యా ఏకాభిప్రాయానికి రాలేకపోయేరు. ఎవరికి వారే తాము చేసుకొన్న నిర్ణయం సక్రమమైనదనీ, దానివల్ల నాకు లాభిస్తుందనీ గట్టిగా నమ్మి ఉన్నప్పుడు ఎదుటివారి మాటకి ఎలా విలువ ఇయ్యగలరు? తమలో తమకి రాజీ కుదరక తమ నిర్ణయాలకి అనుగుణంగా నన్ను మార్చేందుకు యిద్దరూ వేరు వేరుగా ప్రయత్నించేరు.

"చూడు భారతీ! మామయ్యదంతా పెద్దతనపు చాదస్తం. భూములు ఉన్నవాళ్ళే ఆ బాధలు పడలేక తెగనమ్ముకొని వ్యాపారాల్లో పెట్టుకొంటుంటే యిప్పుడు మనం కొనుక్కోడమేమిటి? అవి చూసే ఓపిక తనకీ లేదు, నాకూ లేదు.

"నేను నీ మంచి కోరేవాడిని కాని పరాయివాడిని కాదు కదా! నీ డబ్బు ఏ నమ్మకం లేకుండా గంగలో పోస్తానా? అలా చేస్తే నాకేం ఒరుగుతుంది? నువ్వే విషయాన్ని జాగ్రత్తగా ఆలోచించాలి" అంటూ బోధపరిచేడు అన్నయ్య.

అన్నయ్య అన్న మాటల్లో నిజం లేకపోలేదనిపించింది.

ఆ విషయం గురించే ఆలోచిస్తూ పడుకొన్నాను. చాలా రాత్రయినా నిద్ర దగ్గరికి రానంటూ గోడెక్కి కూర్చుంది. మామయ్య కూడా తన మంచంమీద ఇటు అటు పొర్లుతున్నాడు.

"ఇంకా నిద్రపోలేదా, మామయ్యా" అన్నాను.

"లేదమ్మా! ఇంకా నిద్ర రాలేదు. నీ గురించే ఆలోచిస్తున్నాను. మీ అమ్మా, నాన్నా బ్రతికివుంటే నాకే బాధా లేకపోను. నీ వైవాహిక జీవితం అలా అయిపోయినా బ్రతికినన్ని రోజులూ తిండికీ, బట్టకీ లోటు లేకుండా అతడు ఏర్పాటు చేసిపోయేడు... దానినిఅభివృద్ధి పరిచి, నీకింత నిలకడగల ఉపాధి కల్పించాలన్న కోర్కె తప్పిస్తే నాకింకేం లేదమ్మా. భగవంతుడు చేసిన అన్యాయానికి మనుష్యులం కూడా తెలివితక్కువగా ప్రవర్తిస్తే దిక్కూ మొక్కూ లేకుండా అయిపోతావని నా బెంగ...

"అన్నయ్యదంతా లోటు లేని ఆలోచనమ్మా. పదిరకాలుగా సొమ్ము వచ్చేమార్గం ఉంటే కొంత సొమ్ము పోతేపోయిందని, అదృష్టం కలిసివస్తే లాభం వస్తుందని ఖర్చుపెట్టినా బాగుంటుంది. కాని, నీలాటి ఆడపిల్ల సొమ్ముని ఎవరో స్నేహితుడు...అతనితో భాగం అంటూ ఖర్చు చెయ్యడమేమిటి చెప్పు? ఈ రోజుల్లో డబ్బు విషయంలో మనుషుల్ని గుడ్డిగా నమ్మేందుకి లేదు. తనకీ నాకూ ఆ వ్యాపార వ్యవహారాల గురించి అవగింజంతయినా తెలిసిచావదు.

"నువ్వాలోచించు, తల్లీ. ఎటునుంచి ఏదైనా, పెద్దవాడు ఉండి తనకి పట్టనట్లు చూస్తూ ఊరుకొన్నాడంటారు."

"ఈ విషయం గురించి మరోసారి అన్నయ్యతో మాట్లాడుదాం. మీరు కాదన్న పని అన్నయ్య మాత్రం ఎందుకు చేస్తాడు? మరేం దిగులు పెట్టుకోకుండా పడుకోండి" అన్నాను.

మరునాడు పగలంతా ఆ విషయం తిరిగి కదలలేదు. రాత్రి

భోజనాలయేక మాటలు ఇటు అటు తిరిగి రంగంలోకి వచ్చేయి. అన్నయ్యా, మామయ్యా మాటలు మీరుతున్నారే కాని మనసులు మార్చుకోలేక పోతున్నారు.

పెంచి పెద్దచేసిన మామయ్యముందు అన్నయ్య అంతగా ఎదిరించి మాట్లాడడం నే నెప్పుడూ చూడలేదు. మామయ్య కూడా అంతకి తగ్గట్టుగానే ఆవేశంతో గొంతుక పెంచుకొని చిన్ననాటి నుండీ అన్నయ్య చేసిన మంచి చెడ్డలని ముదలకిస్తున్నాడు. కాస్త సేపు వాళ్ళ వాదనల్ని తమాషాగా విన్నాను. పాకం ముదురుతున్నదని తెలిసేక అత్తయ్యా, నేనూ వాళ్ళని సమాధానపెట్ట ప్రయత్నించేము. ఏ ఒక్కరూ దిగిరాలేదు.

అయినా వాళ్ళమధ్య డబ్బు విషయంలో వస్తున్న ఈ పట్టింపుల్ని ఎలా సర్దుబాటు చెయ్యడం? 'ఆశలని, అభిమానాల్ని కాలదన్ని, రక్తసంబంధీకులు పీకలు పట్టుకోగలిగేటంత ప్రాముఖ్యం ఈ డబ్బు కెందుకిచ్చావు భగవంతుడా?' అనుకొన్నాను.

హద్దు మీరిన కోపంతో అన్నయ్య కేకలేస్తూ బయటికి వెళ్ళిపోయేడు. అన్నయ్య వెళ్ళిపోయిన గంటవరకూ ఆరిపోతున్న అగ్నిపర్వతంలో మిగిలిపోయిన సెగలాగ మామయ్య మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

ఆ రాత్రి అన్నయ్య ఇంటికి రాలేదు. ఏ స్నేహితుడి దగ్గరో పడుకొని ఉంటాడు. మరునాడు ఉదయం ఎనిమిది గంటల వేళ వచ్చి తన బట్టలు పెట్టిలో సర్దుకొన్నాడు.

"భోజనం చేసి వెళ్ళు. తొందరేం" అన్నాను.

"వేరే పనుంది, రవి గుడ్డలు ఎక్కడ ఉన్నాయో కాస్త చూసిపెట్టు."

"రవిని తీసుకుపోవా లనుకొంటున్నావా?"

"ఈ పరిస్థితుల్లో వాడుమాత్రం ఇక్కడ ఎందుకు? నువ్వూ, మీ మామయ్యా ఆ డబ్బుని మెడకి కట్టుకొని ఊరేగండి. నా కేం పోయిందిలేదు. ముసలాడు దింపనున్న గోతిలోకి హాయిగా కళ్ళు మూసుకొని దిగిపో. అక్కడినుంచి 'అన్నయ్యా!' అని అరుస్తే మాత్రం నే చెయ్యగలిగేది ఏమీ వుండదు," అన్నాడు అన్నయ్య కోపంగా.

"మామయ్య కోపంలో ఏదో అన్నాడని దాన్నే పట్టుకు కూచుంటే ఎలా అన్నయ్యా? మనుష్యులు ఎదురుగా వుండి మాట లతో తేల్చుకోలేని అనేక సమస్యలు ఉత్తరాలద్వారా సరిదిద్దుకో వచ్చు. కోపంలో ఆవేశాలు పెరిగి అనుకొన్న దొకటి, అన్న దొక టిగా తయారై, పని నిలిచిపోతుంది. నువ్వు ఊరికివెళ్ళి శాంతంగా మరోసారి ఆలోచించుకొని, నువ్వు మంచిదని తలచిన విషయం వివ రంగా మామయ్యకి వ్రాయి. నేనుకూడా చెప్పి చూస్తాను," అన్నాను. అన్నయ్య మాట్లాడలేదు.

మామయ్య చావిట్లో పేపరు చదువుకొంటున్నాడు.

"నేను వెళ్తున్నాను మామయ్యా," అన్నాడు అన్నయ్య, గుమ్మం దాటుతూ.

"చూడు సారథీ! నిన్న రాత్రి ఆవేశంతో ఏమేమో అనుకొన్నాం. నవ్వన్నట్లు కాటికి కాళ్ళు చాచుకొన్న నాకెందుకీ డబ్బు గొడవ! నీ చెల్లెలి జీవితానికి లోటు లేకుండా ఏర్పాటు చెయ్యగలననే ధీమా నీకుంటే ఇంక నే నీ విషయంలో కల్పించుకోను. కాని ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకో. డబ్బులేని వితంతువులు పడుతున్న అగచాట్లని చూస్తున్నాం. భారతి జీవితం అలా కాకూడదు. నువ్వూ, నేనూ లేమా అనుకొంటే లాభం లేదు. నీ కుటుంబం నీకుంది. ఏడాదిలో రిటైరు కాబోతున్న నే చెయ్యగలిగేది ఏమీ వుండదు," అన్నాడు మామయ్య నిదానంగా.

అన్నయ్య అవును, కాదు అనకుండా వెళ్ళిపోయేడు. మెట్లు దిగుతుంటే "ఉత్తరం వ్రాయి అన్నయ్యా," అన్నాను.

"అలాగే," అన్నాడు అన్నయ్య, ముందుకు నడిచిపోతూ.

అన్నయ్య వెళ్ళిపోయేడు. రవి మాత్రం నా దగ్గరే ఉండి పోయేడు. అన్నయ్య. వదిన తలచినంత చనువు రవికి నా దగ్గర లేదు. తండ్రి కన్నుచాటు కాగానే రాగం అందుకొన్నాడు. ఆ కబురూ ఈ కబురూ చెప్పి వాడిని మరిపించాలు పెట్టేసరికి తల ప్రాణం తోకకి వచ్చిందన్నట్టు అయింది.

"పెద్దవాళ్ళు మనసుల్లో ఏదో ఉంచుకొని వదిలిపోతే చంటి

వాడు ఏడ్చేడంటే ఏడవడూ? పాలుతాగే వయస్సులో తల్లిదగ్గర ఉండాలి కాని, యిలా పంతంపట్టి కూర్చుంటే నువ్వుమాత్రం ఎలా భరిస్తావు?" అన్నది అత్తయ్య.

"ఒకటి రెండురోజులు చూసి, అప్పటికీ పరిస్థితి ఇలాగే ఉంటే అన్నయ్యకి ఉత్తరం వ్రాయచ్చులే," అన్నాను.

తండ్రి ధ్యాస మరపున పడ్డాక రవి అంతగా గొడవ చెయ్యలేదు. ఉండుండి బిక్కముఖంతో ఇటూ అటూ ఎవరికోసమో వెతుకొంటున్నట్లు మాత్రం చూసేవాడు. ఆ పసివాడి ఆరాటం చూస్తూంటే నా కోసం రవి బెంగపెట్టుకొన్నాడన్న అన్నయ్య మాటలోని యథార్థాన్ని శంకించవలసి వచ్చింది. ఏమీ లేనిదానికి అన్నయ్యా, వదినా అనవసరమైన అలంకరణలు చేసి నన్ను మధ్య పెట్టాలని ఎందుకు చూసేరు? అనుకొన్నాను.

అన్నయ్య వెళ్ళి పదిరోజులైనా ఉత్తరం రాలేదు. ఆ రోజు వస్తుందన్న అభిప్రాయంతో పోస్టుమేన్ కోసం వీథిలోకి చూస్తున్నాను. ఎదురెండ ముఖంమీద పడి చికాకు కలిగిస్తున్నది. తలంటు పోసుకొన్న పొడిజుట్టు గాలికి ఎగిరి చిందర వందరగా కళ్ళలో పడుతున్నది. జుట్టుని సరిచేసుకొని ముడి వేసుకొంటూ వీథిలోకి చూపు తిప్పేను. నలభై ఏళ్లు పైబడిన ఒక ఆడమనిషి గుమ్మం ఎక్కి లోపలికి వస్తున్నది. చావిట్లో ఉన్న నా వైపు చూడకుండా నే 'దొడ్డమ్మగారూ! దొడ్డమ్మగారూ!' అంటూ ఇంట్లోకి దూసుకొని వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళినవైపే క్షణకాలం కన్నార్పకుండా చూసేను.

అయిదడుగులపై బడ్డ పొడవుతో, సన్నని గెడకర్రలా ఉంది మనిషి. నల్ల జీడిగింజలాంటి శరీరవర్ణం. భయంకరంగా ముందుకి పొడుచుకు వచ్చిన గుండ్రని పెద్ద కళ్ళు, ముఖాన్ని వదిలి బాగా ముందుకిసాగి - కొనతేలి కిందికి వంగిన ముక్కు, పై పెదవిని ఎక్కు పెట్టినట్లు ఏపుగా పెరిగిన తెల్లనిపళ్ళు - ఒక్క చూపులోనే ఇదంతా ఆకళింపుకి వచ్చిందంటే రూపు ఎంత విలక్షణంగా వుందో సులువుగా అర్థమవుతుంది.

నెత్తిమీది విస్తళ్ళకట్టని వాకిట వరండాలో కుదవేసి,

కొబ్బరిపీచులా మోటుగా ఎర్రగా వున్న కొద్దిపాటి వెంట్రుకలని విదిలించి ముడి కట్టుకుంటూ "దొడ్డమ్మగారూ! ఏమండోయి దొడ్డమ్మగారూ" అంటూ మళ్లా పిలిచింది.

"ఎవరు? సుందరీ!" అంటూ అత్తయ్య బయటికి వచ్చింది. పిల్లల రూపురేఖల్ని నిర్ణయించే శక్తి తల్లితండ్రులకి వుండదు. ప్రకృతిసిద్ధమైన ఆకృతిని వారు మార్చలేరు. కాని అంత అంద వికారంగా ఉన్న పిల్లకి "సుందరి" అని పేరుపెట్టి ఆ పిల్లని జీవితం పొడుగునా పరిహాసాస్పదంగా చేసే వాక్కు-మాత్రం పొందగలిగేరు. ఎవరో తెలియని ఆమె తలితండ్రుల్ని ఆ క్షణంలో క్షమించలేక పోయేను.

"కాస్త చల్లని నీళ్లు పొయ్యి, దొడ్డమ్మా! నోరు ఆర్చుకు పోతున్నది," అంది ఆమె. అత్తయ్య ఇచ్చిన నీళ్లు తాగి "విస్తళ్ళు కావాలా దొడ్డమ్మా," అంటూ ప్రశ్నించింది.

"విస్తళ్ళు ఉన్నాయి కాని మా మేనగోడలు వచ్చింది. దానికి నువ్వుపప్పు అప్పడాలంటే యిష్టం. ఈసారి ఇటు వచ్చి నప్పుడు ఒక అరవండ పట్టుకురా," అంది అత్తయ్య.

"పోస్టు" అన్న కేకతో వీథి గడపలోకి వచ్చేను. ఉత్తరం అయితే వచ్చింది కాని, అన్నయ్య దగ్గరినుంచి కాదు. కవరుపై చిరునామా నాదే వుంది. దస్తూరి కొత్తది. 'ఎవరు వ్రాసిఉంటారు?' అని ఆలోచిస్తూనే కవరు చించేను.

దిగువ సంతకం చూసేను. జగదీశ్. 'ఇదేమిటి, జగదీశ్ ఉత్తరం వ్రాయడమేమిటి? నాకెందుకు వ్రాసేడు? ఏం వ్రాసేడు?' అనుకున్నాను.

క్షణకాలం మనసు తత్తరపడింది. చేతులు కొద్దిగా కంపించేయి. ఇంతలోనే సర్దుకొని, చిన్నగా నవ్వుకొన్నాను. 'దెయ్యాన్నో, భూతాన్నో చూసినట్లు ఉత్తరాన్ని చూసి కంగారు పడడం ఏమిటి? పరిచయం ఉంది కాబట్టే ఏదో వ్రాయాలనిపించి వ్రాసి వుంటాడు. దీని కింత రాద్ధాంతం ఏమిటి' అనుకొన్నాను.

"మా చెల్లెలి పెళ్ళి సలక్షణంగా పూర్తయింది. మీరు రాక పోవడం నాకు కొరతగానే అనిపించింది. నా సెలవు పూర్తయింది.

రేపు వెళ్ళి పోతున్నాను. మన పరిచయం కొద్దిరోజులే అయినా దానిని అంతతో చెల్లుబెట్టా లనిపించక మీ కీ ఉత్తరం రాస్తున్నాను.

"మాధవ్ నాకు ప్రియమిత్రుడు. మీరు అతనికి క్షేమాస్పదులు. అందుకే మీ స్నేహాన్ని నిలుపుకోవాలని ఆశిస్తున్నానేమో?

"ఈ దిగువ నా అడ్రసు యిస్తున్నాను. మీ కెప్పుడైనా నేను గుర్తుకువచ్చి ఉత్తరం వ్రాయాలనిపిస్తే అది ఉపకరిస్తుంది. మనసులో మీ జ్ఞాపకాలు కదిలినప్పుడు మీకు ఉత్తరం వ్రాసే అనుమతి కోరుతూ - జగదీశ్!"

రెండు మూడుసార్లు పై నుంచి క్రింది వరకూ చదివేను. జగదీశ్ వ్రాయా లనుకున్నదంతా అందులో వ్రాయలే దనిపించింది. ఎందువల్లో ఎక్కడికక్కడ తనను తాను నిగ్రహించుకొంటూ వ్రాసినట్లుంది. అలా ఎందుకు అనుకొన్నానో చెప్పడం మాత్రం కష్టం. ఎవరైనా "జగదీశ్ దగ్గర నుంచి నీకు ఉత్తరం వస్తుంది, ఎలా ఉంటుందో చెప్పుకో," అంటే నేను ఊహించే లేఖమాత్రం ఇలా వుండదు! ఇది అతని తత్త్వాన్నీ, మాటలనీ అనుసరించింది కాదు. "ఏమండోయ్, మీ అత్తయ్య గారింటికి వెళ్ళగానే మమ్మల్ని మరచిపోలేదు కదా!" అంటూ అతడు ఉత్తరం ప్రారంభిస్తే దిగువ సంతకం చూడనక్కర లేకుండానే అది జగదీశ్ ఉత్తరమని పోల్చుకోవచ్చు!

ఉత్తరం యింకా చేతిలో రెపరెప లాడుతుండగానే విస్తళ్ళ కట్ట తలపై సరిపెట్టుకొని యిందాకటి ఆమె తిరిగి వచ్చింది. అత్త చెప్పడం మూలంగా 'నేనే ఆ మేనకోడల్ని' అని భావించి ఉంటుంది. ముందులా దూసుకుపోకుండా, ఆగి, నన్ను పరకాయించి చూసింది.

ఆ క్షణంలో ఆమె మనసులో ఏం భావాలు కదిలాయో చెప్పడం కష్టం. కంఠాన్ని కొంచెం మృదువుగా తగ్గిస్తూ, "అమ్మడూ, ముఖాన బొట్టు లేదు," అంటూ వెళ్ళిపోయింది.

ఆమె వితంతువు. వైధవ్య దుఃఖాన్ని అనుభవిస్తున్న ఆమె

నా కా గురదృష్టం పట్టకూడ దనుకొందేమో? పిల్లలు అమంగళ మైన పనులు చేస్తుంటే పెద్దలు మందలించే ధోరణిలో ఆ మాట అంది ఆమె.

"ఇంతకి పూర్వం వచ్చివెళ్ళినావిడ ఎవరత్తయ్యా," అని ప్రశ్నించేను.

"ఎవరు? సుందరి మాటా నువ్వడుగుతున్నది?"

"ఆ తల్లిదండ్రు లెవరో కాని ఏం పేరు పెట్టేరు పిల్లకి," అన్నాను.

"పేరు కేం? నిక్షేపంలాంటి పేరు. వాళ్ళ నాయనమ్మ ఆ పేరు పెట్టుకొనే డెబ్బయి ఏళ్లు అయిదవతనం అనుభవించి పుని స్త్రీ గానే తనువు చాలించింది. దీని ఖర్మంకాలి దీని బ్రతుకు ఇలా అయింది కానీ..."

"అదికాదు అత్తయ్యా, అంత అందవికారంగా ఉన్న పిల్లకి..."

"బాగుందే! పురిటిగుడ్డుకి రూపేం తెలుస్తుంది? ఆనవాయి తీగా పెద్దవాళ్లు పేరు పెట్టుకొంటారు కాని! అయినా ఎవరిపిల్ల వారికి ముద్దు. వాళ్ళమ్మ కంటికి సుందరి రంభలా కనిపించి ఆ పేరు పెట్టుకొన్నా రేమో," అంది అత్తయ్య నవ్వుతూ.

"ఇంతకీ ఎవ రీ సుందరి? ఇదివరలో నే చూసిన గుర్తు లేదే!"

"నువ్వు చూసి ఉండవు. ఈ మధ్యనే, పిల్లల చదువుల కోసం ఈ ఊరు వచ్చింది. మన శాఖవాళ్లే. పచ్చగా ఉన్ననన్ని రోజులూ ఇటు పుట్టింటివారూ, అటు అత్తింటివారూ దాని యింటి మీద పడి తిన్నారు. అంతా అయిపోయాక ఎవరిదారిన వారు జారుకున్నారు. చిన్నపిల్ల, దానికేం తెలుస్తుంది? నమ్మింది. మోస పోయింది. కంచే చేను మేస్తే కాపాడే వా రెవరన్నట్టు 'తన' అను కొన్న వాళ్లే దాన్ని నాశనం చేసేరు. ఏదో ఆ భగవంతుడైనా చల్లగా చూస్తే ఆ పిల్లలు పెరిగి పెద్దవారై దాని కష్టాలు తీర్చాలి" అంది అత్తయ్య సానుభూతిగా.

"పుట్టింటివారు కాస్త ఉన్నవారేనా అత్తయ్యా?" అని ప్రశ్నించేను - యింట పుట్టిన ఆడపిల్లని వీధులవెంట తిరిగి విస్తళ్ళు

అమ్ముకొంటూ బ్రతకమని ఎలా వదిలివెయ్యగలిగేరన్న అను మానంతో.

"తల్లీ తండ్రీ లేరు; అన్నలు ధనవంతులు కాకపోయినా సంసారాలు వెళ్ళదీసుకొంటున్నారు."

"మరి?"

"నీకేమీ తెలియదే భారతీ! కావాలని ఈ గుది బండని ఎవరు మెడకు కట్టుకొంటారు? దీని బాధ్యత, దీని పిల్లల చదువు సంధ్యలూ చూసే పూచీ ఎవరు నెత్తిన వేసుకుంటారు? దానిదగ్గరేమైనా డబ్బు మిగిలివుంటే, ఈ నాడు ఇంటికెళ్తే మెటికలు విరిచే వదినలు దాని కాళ్ళకింద మెత్తలు పరుస్తారు. బావలు, మరుదులు బాజా భజంత్రీలతో ఎదురువస్తారు. డబ్బు తల్లీ, అన్నిటికీ అతి ముఖ్యం," అంది అత్తయ్య కరుకుగా.

అత్తయ్య సుందరిమీద జాలికొద్దీ ఆమె బంధువులని అంత కఠినంగా విమర్శించింది కాని, తన మాటలు నా మనసులో ఎంత లోతుగా నాటుకొంటాయో తెలుసుకొని ఉంటే అలా అనక పోవును.

*　　　　*　　　　*

ఆ రాత్రంతా నాకు నిద్ర లేదు. "డబ్బులేని విధవరాలిని ఎవరూ ఆదరించరా? తోడబుట్టినవాళ్ళకి కూడా ఆమె బ్రతుకు బరువై పోతుందా? నా డబ్బు చూసేనా నా వాళ్ళంతా నా మీద ఇంత ఆపేక్ష చూపిస్తున్నారు? దానికోసమే అంతా దగ్గరికి తీస్తున్నారా? ఈ డబ్బు లేకపోతే నేను వీరికేమీ కానా?

"ఈ అభిమానాలు, అనుబంధాలు అన్నీ డబ్బుకి ముడిపెట్టుకునే ఉన్నాయా? అత్తయ్యా, మామయ్యా, అన్నయ్యా, వదినా, భ్రమరాంబత్తా, రామ్మూర్తి మామా అంతా నా డబ్బు చూసి, బెల్లంచుట్టూ మూగిన చీమల్లాంటి వారేనా? వారి ఆసక్తి అంతా బెల్లం మీదేనా? దాన్నిపట్టి ఉంచిన డబ్బా ఎలా పాడై పోయినా వారికి పట్టదా?

"భగవంతుడా! ఇంతేనా వీరి అభిమానాలకి ఉన్న విలువ? ఈ బంధువుల అభిమానాన్ని చూసుకొనేనా నేను ముచ్చట పడు

తున్నది? నాకేం కొరత ఉండబోదని ధైర్యంగా తిరుగుతున్నది?" అని బాధపడ్డాను. ఈ ధన పిపాసుల మధ్య నన్ను ఒంటరిగా వదిలి పోయిన మాధవ్‌ని తలచుకొని మనసు చులకనపడేలా ఏడ్చేను.

ఆ మాట ఆ రోజునే కాదు. అటు తరువాత కూడా నా మనసుని వదలలేదు. ఎవరు అభిమానంగా ఒక మాటన్నా - అదిగో నా డబ్బుకోసం వలపన్నుతున్నా రనిపించేది. ఎవరు ఆప్యాయంగా పలకరించినా, 'మీ అభిమానం నా మీద కాదు, నా డబ్బుమీద' అనుకొనేదాన్ని.

ఈ ఆకర్షణకి దూరంగా ఎక్కడో నిల్చుని "మీ కెప్పుడైనా నేను గుర్తుకొచ్చి ఉత్తరం వ్రాయాలని ఉంటే ఉపకరిస్తుం"దని అంటున్నాడు జగదీశ్.

"ఏది మంచో ఏది చెడో, ఎవరు హితులో ఎవరు అహితులో తెలుసుకోలేక సుడిగుండం మధ్య చిక్కుపడ్డ గడ్డి పోచలా గిరగిర తిరుగుతున్న నాకు మీ వంటి సహృదయులైన స్నేహితుల అవసరం ఎంతయినా ఉంది. జగదీశ్, మన పరిచయానికి తుదివాక్యం పలక్కుండా మీరు ఉత్తరం వ్రాసినందుకు ఎంతో సంతోషంగా ఉంది" అని వ్రాసి ఉత్తరం పోస్ట్ చేసేను.

*　　　　*　　　　*

అది మొదలు వారం వారం జగదీశ్ దగ్గర నుంచి ఉత్తరాలు వస్తుండేవి. ఒకటి రెండు సార్లు "ఎవరి దగ్గరి నుంచే ఉత్తరం వచ్చింది, భారతీ" అంటూ అత్తయ్య ప్రశ్నించింది.

"ఎవరో స్నేహితుని దగ్గరి నుంచి" అన్నాను.

"స్నేహితుడా!" క్షణకాలం అత్తయ్య చూపులో ఏదో మార్పు వచ్చింది.అంతలోనే ఆ ఆశ్చర్యం ఒక రీతిగా ఆందోళనగా మారింది. నా మాట ఆమెకి ఎలా ధ్వనించిందో—"మంచివాడేనా తల్లీ" అంది.

"జగదీశ్ చాలా మంచివాడు, అత్తయ్యా!ఎంతో సరదాగా మాట్లాడుతాడు."

"అతనితో నీ కెక్కడ పరిచయం అయింది?ఇదివర కెప్పుడూ చెప్పలేదే"

"జగదీశ్ అన్నయ్య స్నేహితుడు. అక్కడే పరిచయం అయింది" అన్నాను.

అన్నయ్య స్నేహితుడు అనగానే అత్తయ్య కేదో అంతా అర్థమై పోయినట్లు ఆమె మరింకేమీ ప్రశ్నించకుండా వెళ్ళి పోయింది.

జగదీశ్ ఉత్తరం చదువుతుంటే అతడు ఎదుట నిలబడి నవ్వుతూ మాట్లాడుతున్నట్లే అనిపించింది. అందులో పెద్దగా విశేషాలు లేకపోయినా ఒంటరిగా కూర్చుని రెండు మూడుసార్లు చదువుకునేదాన్ని. నిండు హృదయంతో వ్రాసిన మాటలకి ఎదుటి వారి మనసుకి సానుభూతి నిచ్చే శక్తి ఉంటుందేమో! జగదీశ్ ఉత్తరం వచ్చిన నాడు మనసుకీ, శరీరానికీ అలసట తగ్గినట్లు, ఊరట కలిగినట్లు అనిపించేది.

జగదీశ్ వ్రాసిన ప్రతిమాట వెనకా వ్రాద్దామనుకొని వ్రాయకుండా నిగ్రహించుకొన్న ఇంకేదో వ్యాఖ్య దాగివున్నట్లే అనిపించేది. అదేమై ఉంటుందని గంటలతరబడి ఊహిస్తూ, ఆలోచిస్తూ గడిపివేసేదాన్ని. అతడి మాటలు నాలో నాకే తెలియని ఏదో విధమైన చలనాన్ని రేపెట్టేవి. ఆ సంచలనాన్ని ఆపేందుకు నరాలన్నీ బిగదీసుకుని ముడుచుకు పోయేవి. మనసుకి, శరీరానికి చెప్పలేని యాతన కలిగేది. అయినా ఆ అనుభవంకోసం మనసు ఉద్రూత లూగుతూ ఎదురు చూసేది.

*　　　　*　　　　*

నేను ఊహించినట్లే మామయ్యా, అన్నయ్యా ముఖస్థంగా దిద్దుకోలేని సర్దుబాట్లని ఉత్తరాలద్వారా సాధించేరు. రెండు నెలలపాటు ధారావాహికంగా సాగిన అభిప్రాయాల పరటా మూలంగా ఒక నిర్ణయానికి రాగలిగేరు. మామయ్య కొనాలను కొంటున్న ఇంటికీ, తోటకీ కొంత సొమ్ము మినహాయించి, మిగిలింది అన్నయ్య కోరుతున్న విధంగా వ్యాపారంలో పెట్టడానికి యిద్దరూ రాజీ పడ్డారు.

నా డబ్బు ఖర్చుచేసేందుకు మాట మాత్రంగానైనా నా ఒప్పుదల తీసుకోవాలన్న ఆలోచన వారికి రాకపోవడం నాకు

ఆశ్చర్యం కలిగించింది. మనసులోంచి తొలగింప జూసిన అను మానాలు, సంశయాలు మళ్ళీ తలెత్తు కొన్నాయి.

మామయ్య తను కొనబోయే స్థలం గురించీ, అందులో వెయ్యబోయే మొక్కల గురించీ, కట్టబోయే ఇంటిని గురించీ కమ్మని కలలు కంటూ కబుర్లు చెప్పేవాడు. ముసలితనంలో నాకింత ఆనందాన్ని కలిగిస్తున్నావమ్మా. ఈ కోరెక్క నా మనసులో ఎంత కాలంగానో ఉంది. ఈ నాటికి నీ మూలంగా తీరుతున్నది" అనేవాడు సంతృప్తిగా.

అదివరలో అయితే మామయ్యకి మొక్కలమీద ఉన్న ఆపేక్షకి సంతోషించేదాన్ని. కళ్ళు అరమూసుకొని అతడు అలా కలలు కంటుంటే మామయ్య చంటి పిల్లాడివాటం. ఏది వచ్చినా భరించలేడనుకొని ఉండేదాన్ని.

కాని ఆ మాటల వెనకగా ఉన్న మనసు తెలిసేక. అర మూసిన కన్నుల వెనకగా తారట్లాడుతున్న ఆలోచనల్ని పసికట్టేక నా మనసు భగ్గున మండిపోయింది.

అవసరం ఉన్నా లేకున్నా మనిషికి డబ్బంటే ఏ వయసులో నైనా ఎంత కాపీనం, ఆధిపత్యం అంటే ఎంత ఉబలాటం అనుకొన్నాను.

రెండు రోజుల కొకటి చొప్పున అన్నయ్య దగ్గర నుంచి ఉత్తరాలు వస్తూండేవి. తను తలచిన పని జయప్రదంగా నెర వేరేందుకు అన్నయ్య పడుతున్న శ్రమని, ప్రయోగిస్తున్న చాకచక్యాన్ని కాగితాల నిండా పులిమి పంపుతుండేవాడు. నాకోసం పన్నుతున్న ఈ వల నిర్మాణ నైపుణ్యాన్ని చూసి నేను మెచ్చుకోవాలని అన్నయ్య అభిప్రాయం.

తన చెల్లెలు కళ్ళు తెరచిందని అన్నయ్యకి తెలియదు. తను అన్న ప్రతి మాటకీ గంగిరెద్దులా తల ఊపే తరుణం మించి పోయిందని అన్నయ్య ఎరుగడు.

అన్నయ్య వ్రాస్తున్న ఒక్కొక్క ఉత్తరం, మామయ్య చేస్తున్న ఒక్కొక్క ఏర్పాటూ నా కాళ్ళ కింద మంటలు పెట్టేయి. నా మనసులో శాంతి నంతా చీల్చి చెండా

డేయి. ఎంత మోసం! ఎదుటి వాళ్ళ డబ్బుని తనా పరా అన్న తేడా లేకుండా స్వాహా చేయడానికి ఎంత ఆత్రుత! సాధ్యమైనంత తొందర్లో నా చేతులు కడిగేందుకు ఇద్దరూ ఏమి ఆరాట పడుతున్నారు—అనుకొన్నాను. . . .

అనుమాన మేఘాలు చుట్టుముట్టి, అపనమ్మక మనే పరాగం వాటికి తోడు కాగా, ఉప్పెన సమయంలో విరిగి పడుతున్న కల్లోల సముద్రంలా నా మనసు తల్లడిల్లిపోయింది; ఆక్రోశించింది.

బంధువుల స్వార్థానికి, మోసానికి గురై కుతకుత ఉడికి పోతున్న నా జీవితంలో తొలకరి జల్లుల్లా వుండేవి జగదీశ్ ఉత్తరాలు. ఆ స్వాతి జల్లు కోసం ఎదురు చూస్తుండగానే నా మనసులో ఇంత దావానలాన్ని రాజుకొల్పిన సుందరి వచ్చింది.

ఆమె ఎప్పుడో ఒకసారి వస్తున్నా, కావాలనే ఆమెని తప్పుకు తిరిగేదాన్ని - కాలుతున్న ఈ అగ్నిలో మరి కాస్త ఆజ్యం ఎక్కడ పోస్తుందో అన్న భయంతో.

ఊరల్లా సంచారం చేసే ఆమెకి నా వైధవ్యం విషయం తెలుసుకొందుకు అట్టేకాలం పట్టి ఉండదు.

"ఈ వయస్సులో ఎంత కష్టం వచ్చిం దమ్మడూ! ఆ రోజు, తెలీక, ఫాషన్ కోసం బొట్టు మానుకొన్నావేమో అని అన్నా నమ్మా! మరోలా అనుకోకు. కళగావున్న నీ ముఖం చూసి నీ కీ రాత పడుతుందనుకోలేదు" అంది విచారిస్తున్నట్లు, నెమ్మదిగా.

రవి నా భుజం మీదుగా ఆమెని చూసి గుక్క పట్టేడు.

"అబ్బాయా? పండులా ఉన్నాడమ్మా! జాగ్రత్తగా పెంచుకో. వాడే నీకు దిక్కవుతాడు" అంది.

"మా అన్నయ్య కొడుకు." అని వెంటనే జవాబు చెప్పేను.

"పోనీలే. చిన్నప్పటి నుంచీ దగ్గరికి తీసుకొంటే వాడే నీకు కొడుకవుతాడు. ఎంత పెట్టి పుడితే అంతే. ఏం జేస్తాం" అంది ఆమె ఓదార్పుగా. నా ఒంటి మీద తేళ్లూ, జెర్రులూ పాకిన ట్లయింది. రవి నాకు కొడుకా? అన్నయ్య, వదిన ఈ ఆలోచన తోనే వాడిని నాకు చేరిక చేస్తున్నారా? రవిని ఎరగా పెట్టి

నన్నూ, నా డబ్బునీ తన పిడికిట్లో బిగించాలని చూస్తున్నాడా అన్నయ్య?

"ఛీ...నా ఎదుట నుంచి పో". అని ఆమెని వెంటనే తరమాలనిపించింది. నిర్మలంగా ఉన్న నా మనస్సులో ఎందుకిలా విషం పోస్తున్నావు? 'నా' అనుకొంటున్న వారి నుంచి నన్నెందుకిలా దూరం చేస్తున్నావు? నా బ్రతుకంతా నిత్యశంకితురాలుగా బ్రతకమని ఎందుకు శపిస్తున్నావు సుందరీ? నీకు నేనేం అపకారంచేసేను? ఓ మంథరా! ఈ పని కోసం నిన్నే దేవుడు సృష్టించేడు?" అని అరవబోయేను.

అప్పటికే ఆమె వెళ్ళిపోయింది. ఆలోచించి చూస్తే ఇందులో ఆమె చేసింది ఏమీ లేదు. అంతకాలంగా నాలో అంతర్గతంగా ఉన్న భయాలు, అవకాశం, చూసుకొని, ఆనాటికి బయటికి వచ్చేయి.

ఒక విధంగా ఆమె నాకు ఉపకారం చేసిందనే చెప్పవచ్చు. మనుష్యుల మాటల్ని, చేతల్ని గుడ్డిగా నమ్మకుండా వారి అభిప్రాయాల అంతర్యాలను తరిచి చూసే అవసరం తెలియ జేసింది.

ఆ స్త్రీపై ఆధిపత్యం కోసం మామయ్య, అత్తయ్య పడుతున్న ఆరాటం, డబ్బుని తన పిడికిట్లో బిగించాలని అన్నయ్య చేస్తున్న యోచనలు, కొడుకుని ఎరగా చూపి నన్ను పట్టి ఆడించాలని వదిన పన్నుతున్న పన్నాగం తెర తొలగిన తోలుబొమ్మలాటలా కళ్ళముందు తైతక్కలాడేయి. నా జీవితాన్ని, డబ్బుని పడుగు పేకలుగా నేసి, నన్నే పట్టబోతున్న ఈ వల ఉచ్చుల్ని తెంచి వెయ్యాలి అనుకొన్నాను.

* * *

ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండగానే నాలుగు నెలలు గడిచిపోయాయి. మధ్యలో నన్ను చూడ వచ్చిన వదిన, రవి పట్ల నేను ముభావంగా ఉండడం చూసి, బిడ్డను తీసుకు వెళ్ళిపోయింది. అన్నయ్యా, వదినల ఎత్తుల్ని తలకిందులు చేయాలన్న తలపుతో రవిని పంపివేసేనే కాని వాడు వెళ్ళిపోయేక పొద్దు గడవక చికాకు పడేదాన్ని.

పని లేకుండా పది నిమిషాలు కూర్చుంటే మనసు గాలికి రంగులు దిద్ది నన్ను భయపెట్ట చూసేది. దాని బాధ నుంచి తప్పించుకొందుకు విధిగా పని కల్పించుకోవలసి వచ్చేది.

మల్లె మొగ్గ తొడిగే కాలం వచ్చింది. "ఆకులు దూచడం, నీళ్ళుపొయ్యడం అత్త వంతూ, మొగ్గలు పెట్టుకోవడం నా వంతూ" అనేదాన్ని చిన్నప్పుడు.

"దానికి ఇంకోటి కూడా చేర్చు. మాల కట్టడం కూడా మీ అత్త వంతే" అనేవాడు మామయ్య.

పువ్వులంటే ప్రీతి ఉన్నా, చెట్లకి సంరక్షణ చేసే అలవాటు నాకు లేదు. ఆ రోజు ఏమీ తోచక మల్లె ఆకులు దూచి పోస్తున్నాను.

"మరీ లేత ఆకుల్ని తెంచబోకు. మొగ్గ తొడిగే కాలం దగ్గర పడింది" అంది అత్తయ్య.

పువ్వులు కోస్తున్నా, ఆకులు దూస్తున్నా జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'పుష్ప విలాప'ం గేయం జ్ఞాపకం వస్తుంది నాకు. నిజంగా చెట్లూ, పువ్వులూ మానవుల అలంకరణాల గురించీ, నిర్దయ గురించీ అలా ఆలోచిస్తాయా అనుకొంటాం. ఆకులు దూచిన మల్లె తీగె బోసిపోయి, బంధువుల బాసలు నమ్మి, ఉన్నదంతా పోగొట్టుకొన్న విధవరాలు సుందరిలా వుంది. ఈ మల్లె తీగె పది రోజుల నాటికి తిరిగి చిగురిస్తుంది! కాని ఆ విధవరాలు పోగొట్టుకొన్న జీవితాన్ని తిరిగి అందుకొని సుఖంగా బ్రతికే మార్గం ఉందా? అనే ఆలోచన వచ్చింది.

ఆలోచన అంతం కాకుండానే వీధి తలుపు చప్పుడయింది. తలుపు తోసుకొని అన్నయ్య వచ్చేడు. వెనకగా యింకెవరో ఉన్నారు.

"భారతీ, మామయ్య ఇంట్లో ఉన్నాడా?" అని అన్నయ్య ప్రశ్నించేడు.

"బజారుకు వెళ్ళేడు. అత్తతో చెప్పి వస్తాను ఉండు" అని, క్రొత్త మనిషి దృష్టిని తప్పించుకొందుకు ఇంట్లోకి వెళ్ళిపోయేను.

"మా చెల్లెలు భారతి" అని అన్నయ్య నా గురించి అన్న

మాటలు విన్నాను. ఇంట్లోంచి అత్తయ్య రాకపూర్వమే వీధిలోంచి మామయ్య వచ్చేడు. వారు ముగ్గురూ ఉత్సాహంగా చాలా చాలా విషయాలు మాట్లాడుకొంటున్నారు. వాళ్ళ మాటలు చెవుల్లో పడుతున్నా సంభాషణ ఆకళింపు చేసుకోవాలనే అభిలాష నాకు కలగలేదు. అత్తయ్య వారు ముగ్గురికీ కాఫీ, టిఫెన్లు అందించింది.

చీకటి పడబోయే సమయంలో అన్నయ్యని చాటుకు పిలిచి, "రాత్రి భోజనానికి ఉంటాడా" అని ప్రశ్నించింది అత్తయ్య.

"లేదు. వెళ్ళిపోతాడు" అన్నాడు అన్నయ్య.

పది నిమిషాలు గడిచేక "అన్నయ్య నిన్ను పిలుస్తున్నా"డంటూ అత్తయ్య వచ్చింది. పైట కొంగును నిండుగా కప్పుకొని చావిట్లోకి వచ్చేను.

"రా! ఇలా కూర్చో." అని అన్నయ్య ఆప్యాయంగా తన పక్క నున్న కుర్చీలో చేయి పట్టుకొని కూర్చోపెట్టుకొన్నాడు.

"మా చెల్లెలు, భారతి" అన్నాడు అన్నయ్య ఈసారి, ఆ వ్యక్తికి సమక్షాన.

ఆ వ్యక్తి నోరు ఒక వంకకి సొట్ట పోయేలాగా చిన్నగా నవ్వుతూ, "నమస్కారమండీ. మిమ్మల్ని చూసింది ఈ రోజే. అయినా మీ గురించి వింటూ చాలా కాలమయింది" అన్నాడు.

"నా స్నేహితుడు వరదరాజు. మనం పార్ట్‌నర్స్‌గా ఉండ బోయేది ఇతడితోనే. తాత తండ్రుల కాలం నుంచి వ్యవహారాల్లో ఆరితేరిన కుటుంబం. నీకు పరిచయం చేద్దామనీ, ముఖాముఖిని మాట్లాడుకొని మీ రిద్దరూ ఒక నిర్ణయానికి వస్తే మంచిదనీ తీసుకు వచ్చేను" అన్నాడు అన్నయ్య.

అన్నయ్య ఎంత తెలివిగా నన్ను నొక్కిపెట్టాలనుకున్నాడు! తను ఒంటరిగా వస్తే అవును, కాదు అని ఆటంకాలు చెపుతానేమో అని అతన్ని కూడా వెంట తీసుకువచ్చేడు. అత్తయ్యకి, మామయ్యకి చెయ్యవలసిన బోధన లన్నీ పూర్తిచేసి ఉంటాడు. నా నోటునుంచీ మాట సాయం రాని పరిస్థితిలో పెట్టి అవుననిపించాలని అన్నయ్య ఎత్తుగడ.

ఎదురుగా ఉన్న వ్యక్తిని పరకాయించి చూసేను. ఒకసారి

చూసిన వెంటనే మనుష్యుల మంచి చెడ్డలను పరీక్షించి చెప్పటం కష్టం. కాని మనసులోకి వచ్చే భావాన్ని వెనుకకు నెట్టడం కూడా కష్టమే.

'నమ్మినవాడి మెడకి రాయి కట్టి నీళ్ళలో దింపి, నిశ్చలంగా నిద్రపోగలిగిన వ్యవహారవేత్త' అనిపించింది, అతడిని చూడగానే. అన్యాయమైన పని చేస్తే, పైవారు తిట్టకపోయినా, మనసు తిడుతుంది అంటారు. వరదరాజు భారీ ఖాతీలోంచి బయట జరిగే అన్యాయాలని చూసి, మందలించే అలవాటు అతడి మనసు ఏనాడో మానుకొని ఉంటుంది అనుకొన్నాను.

"ముందు మనలో మనం ఒక నిర్ణయానికి వచ్చేక ఇతరుల ముందు ప్రస్తావిస్తే మంచిదేమో, అన్నయ్యా" అన్నాను.

"వరదరాజు మన ఇంటిలో మనిషిలాంటివాడే. నీకేం సంకోచం అక్కరలేదు. నీవేమైనా సలహాలు, సందేహాలు తీర్చుకోవాలనుకొంటే, వ్యాపార వ్యవహారాలు చేసి ఉన్నవాడు కాబట్టి, తీరుస్తాడని వెంటబెట్టుకు వచ్చేను......

"ఇదివరలో ఇతడు కట్టిన సినిమాహాల్లో భాగాలు తీసుకొన్న వాళ్ళంతా లాభాలతో ఉన్నారు. ఈ పేపర్ మిల్లులో కూడా భాగం కావాలని వాళ్ళంతా వెంటపడుతున్నారు. ముందు మన వాటా సంగతి తేల్చుకోనిదే ఏమీ చెప్పలేనని వాళ్ళని వదిలించుకొనేసరికి తాతలు దిగొచ్చారుట. అన్ని పనులూ మానుకొని నా కోసం ఇక్కడికి వచ్చేడంటే......"

నోరు తెరవకుండా కూర్చున్న వరదరాజుకి వకాల్తా పట్టినట్లు అన్నయ్య తెగ వాగేడు. 'నా కున్న సందేహాలనీ, భయాలనీ తీర్చే శక్తి మీకెవరికీ లేదు. ఈ క్షణం వరకూ నా ముక్కూ, ముఖం తెలియని ఈ వరదరాజుకి అసలే లేదు-'అనాలనుకొన్నాను.

"అంతా ముందు అనుకొన్నదే కదా, మళ్ళీ ప్రత్యేకంగా అడిగి తెలుసుకోవలసింది ఏముంటుంది?" అన్నాడు మామయ్య. వరదరాజు చేసి చూపిన అంకెల గారడీ మామయ్య మీద బాగానే పని చేసింది. తన అడ్డంకి లేకుండా అన్నయ్య బాటని ఖాళీ చేసేడు.

"అది సరే అనుకోండి..." అంత సేపటికి వరదరాజు నోరు విడింది.

"వ్యాపారం అనగానే వెయ్యెరకాలైన పనులు ఉంటాయి. కౌయితాలు, కరామత్తులు చూసుకోడం, డబ్బు లెక్కలు సరి చూసుకోడం ఇంకా ఇలాటివే తల మునిగినన్ని. ప్రతిసారీ మీరు కలుగజేసుకోవాలంటే మీకు కష్టమవుతుంది. ఈ వాటా మీ అన్న గారి పేరున తీసుకొంటే..." క్షణకాలం ఆగి, "వీలో మీకు పేరెవరిదైతేనేం? డబ్బు చేరేది మీకేగా" అన్నాడు.

"వరదరాజు అన్న మాటలో నిజం లేకపోలేదు, భారతీ! ఈ పడివాట్లన్నీ నువ్వుపడలేవు. కావాలంటే ఆ డబ్బుకి నీకు నోటు వ్రాస్తాను." అన్నాడు, అన్నయ్య.

"అలాగే చెయ్యి, అన్నయ్యా! వసూలు కాకపోతే కోర్టులో దావా వేసి వసూలు చేసుకో వచ్చు. ఇద్దరం కలిసి ఒకే బండిమీద పోతే ఖర్చులు కూడా కలిసొస్తాయి" అన్నాను.

"బలే, బలేబాగా చెప్పేరు. నేను ఆ మాటే అంటే సారథి వినడం లేదు. 'ఒక ఇంట్లో అప్పులు సప్పులు ఏమిటి? చెప్పితే ఆవిడే వింటా'రంటుంటే..." అంటూ గులకరాళ్లు కుండలో పోసి ఆడించి నట్లు నవ్వేడు వరదరాజు.

అతడి నవ్వు నాలో నిద్రపోతున్న దెయ్యాన్ని తట్టిలేపింది. "మీ రాడుతున్న నాటకం నాకు తెలుసు. నే నెందులోనూ భాగం తీసుకోనేది లేదు. నా డబ్బుని ఎవరికీ దానం చెయ్యడం అంత కన్నా లేదు" అని గట్టిగా చెప్పాలనుకొన్నాను.

పై వాళ్ళముందు అన్నయ్యని అవమానపరచలేక ఊరు కొన్నాను.

"ఇంకా వ్యవధి వున్నది కదా. అన్నయ్యా! ఆలోచించి ఆయనకి తెలియజేద్దాం" అన్నాను.

అన్నయ్య నాతో ఏకాంతంగా ఏదో చెప్పాలన్నట్లు, వీధి వరండా వైపు నడుస్తూ, "ఇలా రా, భారతీ" అన్నాడు.

అన్నయ్య చెప్పబోయేది నాకు తెలుసు. సమయం మించి పోతే వాటాలు అమ్ముడయిపోతా యంటాడు. మన కేదో ముంచుకుపోయే నష్టం వస్తుందంటాడు.

"వస్తే రానీ. ఈ నాటకానికి భరతవాక్యం ఎక్కడో తేలే వరకూ నే నెవర్నీ నమ్మి సొమ్ము చేతిలో పెట్టదలచుకోలేదు." అని అన్నయ్యతో నిష్కర్షగా చెప్పాలనుకొన్నాను.

జవాబు సిద్ధం చేసుకొని నేను అటు కాలు కదిపేసరికి పోస్టుమన్ గుమ్మం ఎక్కాడు. ఆ రోజు జగదీశ్ దగ్గరి నుంచి ఉత్తరం వస్తుందనుకొంటున్నాను. అది అన్నయ్య చేతిలో పడడం యిష్టంలేక ఆత్రతగా ముందుకిపోయి అందుకొన్నాను. అది నాలుగు రోజుల క్రిందట వదిన రాసి పోస్టు చెయ్య బద్ధకించిన కార్డు. ఆ నాటికి నా దగ్గరికి చేరింది. నిరాశగా కార్డుని చేతితో ఇటు అటు తిప్పుతూ అన్నయ్య మాటలు వింటున్నాను. కార్డులోని ఒక వాక్యం నా కళ్ళని ఆకట్టుకొంది.

"జగదీశ్ కి మీ ఊరు బదిలీ అయిందటగా, అన్నయ్యా" అన్నాను.

"అవును. వారం పది రోజులలో వచ్చి చార్జి తీసుకోవాలనీ వ్రాసేడు," అన్నాడు అన్నయ్య.

"మరి ఆ విషయం యింతవరకూ చెప్పలేదేం?"

"ఈ వ్యవహారంలో పడి చస్తుంటే నా బుర్రలో ఆ చెక్కడుంది" అన్నాడు అన్నయ్య.

అంత మంచి విషయం విన్నాక అన్నయ్యతో వాదన పెట్టుకోవాలనిపించలేదు. "ఈ డబ్బు పోతే పీడా పోయింది, మనసుకి శాంతయినా మిగులుతుంది" అనుకొన్నాను.

"నీ యిష్టం అన్నయ్యా" అన్నాను నెమ్మదిగా.

కాలితో తన్నితే దూరంగా తుళ్ళిపడే బంతిలా చావిట్లోకి పరుగుతీసి, "పదవోయి, వచ్చిన పని పూర్తయింది" అన్నాడు అన్నయ్య.

"ఏమయింది?" అని అత్తయ్య ఆత్రంగా అడిగింది.

"భారతి ఒప్పుకొంది." అన్నాడు అన్నయ్య.

అత్తయ్య కళ్ళలో ఏదో తెలియని భావం మసలి, అంతలోనే మాయమయింది.

# 6

నేను అన్నయ్యగారింటికి వచ్చి పదిహేను రోజులు పైగా అయింది. అప్పటివరకూ జగదీశ్ జాడలేదు. "ఎక్కడా కనిపించడంలేదు. ఏదైనా ఊరికి వెళ్ళేడేమో?" అన్నాడు అన్నయ్య.

సాయంకాలం అద్దం ముందు, తలంటు పోసుకొన్న జుట్టుకి నూనె రాసుకొంటున్నాను. పలచని కిటికీ తెరలలోంచి సంధ్య కాంతి నా ముఖంమీద పడుతున్నది. క్షణకాలం నా రూపుని నేనే తనివితీరా చూసుకొన్నాను. నా రూపమూ, నా ఆరోగ్యమూ, అప్పటి నా యవ్వనమూ చూచి నాలో నేనే చకితురాలనయ్యాను.

"నీ కీ గాలీ నీరూ బాగా పడిందే భారతీ" అంది వదిన నన్ను చూడగానే. వదిన ఆ మాట ఎందుకందో బోధపడింది.

పసిడి కాంతితో మిస మిస లాడుతున్న బుగ్గలపై గులాబి రంగు పై మెరుపు దిద్దుతున్నది. కళ్ళునిండిన కాంతి, కనురెప్పల చాటునుంచి, కనుకొలకుల గుండా బుగ్గలమీదికి ప్రవహిస్తున్నది. నున్నని సన్నని మెడకిందుగా ఆరోగ్యం, యవ్వనం, అందం ముప్పేటగొలుసు అల్లికలా జిగి బిగి అల్లికతో కులుకుతున్నాయి.

సున్నితమైన పొడుగుపాటి వేళ్ళు నల్లని కురులతో నాట్యం చేస్తుంటే ఆ వేళ్ళ కొసలని తాకాలనీ, ముద్దు పెట్టుకోవాలనీ అభిలాష కలిగేలా వున్నాయి.

నా అందాన్ని అద్దంలో చూసుకొంటూ మెల్లగా నవ్వుకొన్నాను. రెండు బుగ్గలమీద రెండు గులాబులు పూచేయి. పలువరుస పొందికగా కట్టిన సన్నిజాజి చెండులా తళుక్కున మెరిసింది.

"ఎందుకు యింత అందం? దీనితో ఏం చేసుకోను? పుష్ప సదృశంగా ఈ శరీరాన్ని పెంచి ఏం లాభం? చూసి ఎవరు ముచ్చటపడాలి? పాలుపోసి పెంచుతున్న ఈ అందం ఏదో రోజున పామై నన్ను కాటు వేయవచ్చు" అనుకున్నాను.

మృష్టాన్న భోజనాలతో ముద్దు ముద్దుగా ఈ శరీరాన్ని పెంచుకొంటూ పోతే అది యుక్తాయుక్త విచక్షణ లేకుండా అన్ని రుచులూ కావాలంటుంది. మనసు వాయువేగాన్ని మించిన వేగంతో కోర్కెల బాటవెంట పరుగు పెడుతుంది. మనిషికి తన వెంట రాగలిగే శక్తి వుండా. లేదా అనే ప్రశ్న దానికి వుండదు.

దానిని శాసించే శక్తి రావాలంటే జీవితంమీద నిర్లిప్తత పెంచుకోవాలి. పెద్దలు వితంతువులకి ఏర్పరచిన విధులను తూచా తప్పకుండా, ఆ కామాక్షి పాటించినట్టు, పాటించాలి.

కామాక్షి అత్తకి దూరపు చుట్టం. నా చిన్నతనంలో మా యింటికి వస్తుండేది. పాతికేళ్ళ వయసు లేని ఆ వితంతువు ఎటువంటి సరదాలనీ దగ్గరికి రానీకుండా విరాగినిలా జీవితం గడిపేది. సాత్వికాహారం, ఏకభుక్తం చేసేది. చాపమీదే నిద్రపోయేది. ఏ కాలంలోనూ చన్నీళ్ళ స్నానం. తీర్థయాత్రలూ, పూజలూ, పురాణాలూ యివే ఆమె జీవితం.

ఆమెకు ఈ జీవితం గురించిన చింత వుండేదికాదు. మరణానంతర జీవితాన్ని గురించే ఆమె ఆశలు, ఆలోచనలు. ఆ వయస్సులో ఆ పరాత్పరుడి పిలుపుకోసం ఎదురుచూస్తూ రోజులు గడిపేది. ఏదో ప్రమాదంలో తొందరగానే ఆమె తన గమ్యస్థానం చేరుకొంది.

నేను కామాక్షిలా పరాత్పరుడి పిలుపుకోసం ఎదురు చూడడం లేదు. నాకు బ్రతుకులోని తీపి యింకా తగ్గలేదు. మనసులోని ఆశల వేడి యింకా చల్లారలేదు. అందమైన ఈ రూపాన్ని, ఆనందాన్ననుభవించగల మనసుని నాకు భగవంతుడు ప్రసాదించేడు. వీటిని చూస్తూ చూస్తూ బుగ్గి చెయ్యలేను. బ్రతుకుపై అంత నిరాశ నాలో యింకా ఏర్పడలేదు.

ఆలోచనలు ఒకసారి మనసులోకి వస్తే, దారీ తెన్నూ లేని

డొంకల్లోకి ఈడ్చుకు పోతాయి. తిరిగి బయటపడడం అంత సులువైన పనికాదు.

పడుగు పేకలుగా సాగుతున్న ఆలోచనా తరంగాల అల్లిక లోంచి ఛాయా మాత్రంగా కనిపించినది జగదీశ్ రూపం.

"జగదీశ్!" ఆత్రంగా వెనక్కి తిరిగిచూసేను.

నిజమే. జగదీశ్ గది గుమ్మంలో నిలబడి అద్దంలోకి తదేక దీక్షతో చూస్తున్నాడు.

"ఓ! జగదీశ్! మీరా? ఎంతసేపయింది వచ్చి? ఈ ఊరెప్పుడు వచ్చేరు?" అని ప్రశ్నించేను తడబడుతూ.

"ఈ ఊరువచ్చి నెలరోజులకి పైగా అయింది. ఇంక ఇక్కడికొచ్చి ఎంత సేపయిందనే మీ ప్రశ్నకి సమాధానం చెప్పడం కొంచెం కష్టమే. చావిట్లో ఎవరూ కనిపించకపోవడంతో గది గుమ్మంలోకి వచ్చేను. ఆపైన జరిగింది అద్దంలో మీ రూపు చూడడం..."

"మిమ్మల్ని ఈ సమయంలో ఈ విధంగా చూస్తానని కలైనా రాలేదు. ఆశించని సమయంలో ఎదురుగా అద్దంలో మీ రూపు చూసి..."

"ఇంతకీ ఎప్పుడొచ్చేరు? ఏమిటి సంగతి?" అన్నాడు జగదీశ్.

అతడి నాలుక చివరవరకూ వచ్చి, బలవంతంగా నొక్కి పెట్టిన మాటేమిటో తెలుసుకోవాలనే కోర్కె బలీయమయింది నాలో.

"ఊఁ, అద్దంలో చూసి ఏమనుకొన్నారు?" అని రెట్టిస్తూ ప్రశ్నించేను. ఆ మాట అతని మనసులో సుస్థాపితమైపోయింది. తిరిగి బయటికి లాగే శక్తి ఎవరికీ లేదు.

"మీ కా ఊరి నీళ్లూ, గాలీ బాగా పడ్డాయనుకొన్నాను. అన్నట్లు నాకు ఈ ఊరికి బదిలీ అయినట్లు నే వ్రాసిన ఉత్తరం అందిందా?" అని మాట మారుస్తూ ప్రశ్నించేడు జగదీశ్.

"నే నిక్కడికొచ్చి పదిహేను రోజులకి పైగా అయింది. మీ ఉత్తరం నాకు రీడైరెక్ట్ చేశారు.

జగదీశ్ ఆశ్చర్యంగా నో రింత చేసుకొని ''ఏమన్నారూ?'' అన్నాడు.

''పదిహేను రోజులై మీ దర్శనంకోసం చూస్తుంటే ఇప్పటికి లభ్యమయింది అంటున్నాను.''

''ఇలా ఎందుకు జరిగింది?'' అని తన్ను తాను ప్రశ్నించుకున్నట్లే పైకి అన్నాడు జగదీశ్.

''మీరు ఊర్లో లేకపోవటంచేత.'' అని, ఆ ప్రశ్న నుద్దేశించి అన్నది కాకపోయినా, జవాబు చెప్పేను.

''నేనా? ఎక్కడికి కెళ్లేను?''

అతడి అయోమయ పరిస్థితి చూస్తే నాకు నవ్వాగిందికాదు.

''నాకేం తెలుసు'' అన్నాను చిన్నగా నవ్వుతూ.

''ఇక్కడ డ్యూటీలో జాయిన్ అయేక నే నెక్కడికీ వెళ్ళలేదండీ. నేనూ, సారథీ నాలుగు రోజుల కోసారి కలుస్తూనే ఉన్నాం'' అన్నాడు నెమ్మదిగా.

ఇందులో అన్నయ్య భాగం చాలా ఉందని ఆ క్షణాన్నే తెలుసుకున్నాను. అన్నయ్య కావాలనే నా వార్త జగదీశ్ కి అందచెయ్యలేదు. ఊళ్ళో లేడని, ఎక్కడా కనిపించడంలేదని నాతో అబద్ధం చెప్పేడు.

''ఊళ్లోనే ఉంటే ఇన్ని రోజులవరకూ మా యింటికి రాలేదేం?''

''ఇంటి దగ్గర మీరు వున్నారని నాకెలా తెలుసు? మీ వదినగారు పుట్టింటికి వెళ్లేరాయె. సారథిని ఎక్కడోక్కడ కలుస్తూనే వున్నాను. ఇంక యింటికి రావడం దేనికి?''

అతని మాట పూర్తి అవుతుండగానే వదిన వచ్చింది, ''ఎవరు భారతీ, ఇంటికి వచ్చింది?'' అంటూ,

''ఓహో జగదీశ్ గారా! చాలాకాలం అయిందే చూసి'' అంది వదిన, అతణ్ణి చూచి, పోల్చుకుని.

''మీరు ఎప్పుడు వచ్చేరు? మీ ఊళ్లో అంతా బాగున్నారా'' అంటూ జగదీశ్ కుశల ప్రశ్నలు వేసేడు.

రెండు నిమిషాలపాటు పదడుగుల ఎత్తు ముత్యాలూ, రవ్వలూ

చింది చింది ఆరిపోయే ముందు వుండే చిచ్చుబుడ్డి కాంతిలా వదిన ముఖం తెల్లబడింది. అంతలోనే తేలుకొని "ఆఁ ఆఁ, ఈ మధ్యనే; నాలుగైదు రోజులయింది" అంది.

జగదీశ్ మరి కాస్తసేపు కూర్చుని ఈ మాటా ఆ మాటా చెప్పి వెళ్ళిపోయేడు. మెట్లు దిగినవాడు తిరిగివచ్చి "మిమ్మల్ని చూసిన ఆనందంలో అసలు వచ్చినపని మరచిపోయి వెళ్ళిపోతున్నాను. సారథి ఈ పుస్తకం కావాలన్నాడు. ఒక స్నేహితుడి దగ్గర వుంటే అడిగి తీసుకువస్తూ, మీ యింటి తలుపులు తీసి వుండడం చూసి యింట్లో వున్నాడనుకొని గుమ్మం ఎక్కేను. సారథి వచ్చేక ఇయ్యండి" అన్నాడు పుస్తకాన్ని బల్లమీద పెడుతూ.

రాత్రి భోజనాలు పూర్తయి అన్నయ్య తన గదిలోకి వెళ్ళిపోతుంటే "జగదీశ్ వచ్చివెళ్లేడు, నీకీ పుస్తకం యిమ్మన్నాడు" అన్నాను, పుస్తకం చేతిలో పెడుతూ.

అన్నయ్య నా మాట అర్థం కానట్లు తెల్లబోయి చూసేడు. తప్పుచేసి దొరికిపోయిన దొంగలా తడబడ్డాడు.

"ఏమిటి? ఏమంటున్నావు?...జగదీశ్ ఊరినుంచి వచ్చేశాడా?"

"ఇలా ఎందుకు జరిగిందన్నయ్యా" అంటూ తీక్షణంగా చూస్తూ ప్రశ్నించేను. అన్నయ్య జవాబు చెప్పలేదు.

"ఇన్ని అబద్ధాలు ఎందుకు చెప్పేవు? నీ చెల్లెలి జీవితంలో ఎవరివల్లనైనా కాస్త ఆనందం పొందగలిగితే దానిని తుడిచిపెట్టడమేనా నీ పని?" అన్నాను, ఉండబట్టుకోలేక.

"అనవసరమైన అనుమానాలు పెంచుకోకు భారతీ! నేను ఏం చేసినా నీ మేలుకోరే చేస్తున్నాను! అంటూ అన్నయ్య వెళ్ళిపోయేడు.

గదికి ఉన్న ఒక్క కిటికీ మూసివేసి, గాలి ధారాళంగా రావడంకోసం ఆ పని చేసేనన్నట్లున్నది అన్నయ్య మాట. ఏదో ఒక కారణంగా జగదీశ్‌తో పరిచయం ఏర్పడ్డది.అతడు స్నేహపాత్రుడు,

సహృదయుడు అని అన్నయ్య కూడా ఒప్పుకొంటాడు. జగదీశ్ మాటలతో నాకు కాలం సరదాగా గడిచి పోతుంది. ఆ పాటి ఆనందానికి కూడా నేను నోచుకో కూడదని అన్నయ్య అభిప్రాయమా? జగదీశ్‌ని ఇంటికి రానీయకూడదనీ, చెల్లెలు అతనితో స్నేహంగా ఉంటే తనకేదో నష్టం కలుగుతుందని అన్నయ్య అభిప్రాయం అయితే, ఆ మాటఎదుటపడి సూటిగా చెప్పవచ్చునే. దాని కింత డొంక తిరుగు డెందుకు?

జీవితం అంటే ఏమిటో తిన్నగా చవి చూడకముందే దానిని పోగొట్టుకొన్న నిర్భాగ్యురాలు తిరిగి మనిషిలా జీవించాలనో, అందరిలా సుఖపడాలనో కోరుకొంటే, దానికి ఆత్మీయులనుకొన్న వారుకూడా నేరంగా పరిగణించి ఎదురు తిరుగుతారా?

ఎటూ తెగని ఆలోచనలు ఆ రాత్రల్లా కలవరపెట్టేయి. ఉదయం లేచేసరికి నా కళ్ళు ఎర్రగా ఉన్నాయి. రాత్రల్లా నిద్ర లేక బాధపడ్డానని వదిన గ్రహించింది.

“మీ అన్నయ్యని తప్పు పట్టుకోకు భారతీ! ఎదురుగా ఉన్నవి పాలో, నీళ్ళో నీకు తెలియదు. డబ్బు పాపిష్టిది. ఎంతలాటి వాళ్ళనైనా వశం చేసుకొంటుంది!” అంది వదిన.

ఆ విషయం నా కింతకు పూర్వమే తెలుసు వదినా—అని చెప్పాలనుకొన్నాను. పైనుంచి ఈగనైనా వాలనీకుండా వీరంతా ఎందుకు కాపలా కాస్తున్నారో నాకు తెలుసు. మీ క్కావలసింది నా సుఖం కాదు; నా ఆనందం కాదు - నా డబ్బు. దానికోసం నన్ను చెయ్యిదాటి పోనియ్యకుండా కట్టుదిట్టాలు చేస్తున్నారు. ఎవరికి వారే తమకన్న ఆప్తులు లేనట్లు ప్రవర్తిస్తున్నారు. నాకు మీ భయం తెలుసు. వదినా! నా కెవరితోనైనా స్నేహం ఏర్పడితే మీ మాట విననేమో, నా సొమ్ము మీకు దక్కదేమో అని అభిప్రాయ పడుతున్నారు. అటువంటి ప్రమాదం జరక్కుండా అన్నయ్య జాగ్రత్త పడుతున్నాడు—అనాలనిపించింది. కాని ఆ మాటలన్నీ మనసులోనే నిలిచిపోయేయి.

“డబ్బు ఎంత పాపిష్టిదో అనుభవిస్తున్న నాకు తెలియదా వదినా!” అంతమాత్రం అని ఊరుకొన్నాను.

మరునాడు జగదీశ్ వచ్చేడు. అన్నయ్య ప్రవర్తనలోని అంతరార్థం గ్రహించి కూడా రాకుండా ఉండలేకపోయే డంటే అతడు నా స్నేహానికి ఎంతో విలువ ఇస్తున్నాడని సంతోషించేను. జీవితంలో మొదటిసారిగా అన్నయ్య అధికారంపై ప్రతిఘటన చెయ్యాలనే ఆలోచన మనసులోకి వచ్చింది. ముందుకన్న మించిన చనువుతో జగదీశ్ తో మాట్లాడుతూ, అతడు ఎప్పటిలా వచ్చే అవకాశం కల్పించేను.

అన్నయ్యా, వదినా పూర్వంలా సంభాషణల్లో పాల్గొనడం మానేసేరు. అప్పుడప్పుడు వచ్చి కాస్తసేపు కూర్చుని వెళ్ళిపోయే వారు. ఆ విధంగా వారు తమ విముఖత చూపించినా నేను మొండిగా, వారి వ్యతిరేకతను గురించి పట్టించుకో కూడదని నిర్ణయించుకొన్నాను.

"నాలుగు రోజులు మీ ఇంటికి రాకపోతే ఏం తోచనట్లు ఉంటుంది" అనేవాడు జగదీశ్. నాకూ అలాగే అనిపించేది. జగదీశ్ వచ్చి వెళ్ళిన గంటనుంచి "తిరిగివస్తే బాగుండును" అనుకొనేదాన్ని.

...అంతకు ముందురోజు సాయంకాలం జగదీశ్ వచ్చి వెళ్ళేడు. వదిన పక్క వీధిలో పేరంటానికి వెళ్ళింది. అన్నయ్య ఆఫీసునుంచి ఇంకా రాలేదు. ఏం చేసేందుకూ తోచక బూజు పట్టిన చిత్రలేఖన పరికరాలని దులిపి, ముందు వేసుకొని కూర్చున్నాను. జగదీశ్ కోరిన సూర్యాస్తమయ దృశ్యం వేసి అతని పుట్టిన రోజు నాడు ప్రెజెంట్ చెయ్యాలనుకొన్నాను.

కాని, కళ్ళతో చూడని ఆ దృశ్యాన్ని మనసు ఊహించలేక పోయింది. మనసు కందని భావాన్ని కుంచె దిద్దలేకపోయింది. ఏదో విధంగా చిత్రంవేసి జగదీశ్ కియ్యాలనే అభిప్రాయం మాత్రం మారలేదు.

చక్కని సాయంకాలం. గలగల పారే నదికి ఆవలిగట్టున చిక్కని చింతతోపు. అందులోంచి ఎర్రని కాంతుల్ని వెదజల్లుతూ భూమికి ఆవలి పక్కకి ప్రయాణిస్తున్న సూర్యబింబం. ఈ మాటలకి

ఎలా రూపకల్పన చెయ్యడం? ఆ దృశ్యాన్ని చూస్తూ జగదీశ్ పొందిన అనుభూతిని అందులో ఎలా పొదగడం?

ఆలోచిస్తూ గదిలో ఇటూ అటూ తిరుగులాడేను. ఎదురుగా గోడకి, యమున ఒడ్డున, రాసక్రీడానంతరం అలసి సొలసి ఒకరి చేతుల్లో ఇంకొకరు సోలిపోయి, అరమూసిన కన్నులతో ప్రపంచాన్నే మరచి ఆనంద పరవశులై వున్న రాధాకృష్ణుల చిత్రం వేలాడుతున్నది.

ఆ చూపుల్ని కాగితం మీదికి తేవాలనీ, ఆ భావనలని వారి కళ్ళలో చూపాలనీ ప్రయత్నం మొదలుపెట్టేను. మనసులో యమునా నదీ జలంలా మిలమిల మెరుస్తున్న ఆదృశ్యం కాగితం మీదికి రానంది. ఎడతెగని ప్రయత్నానికి ఫలితంగా ఎన్నో కాగితాలు చిరిగి పోగులు పడ్డాయి.

కాగితాల కుప్ప పెరుగుతున్న కొద్దీ, ఆ దృశ్యాన్ని సాక్షాత్కరింప జేసుకోవాలన్న తపన ఎక్కువైంది. చిన్ననాడు చదువుకొన్న బ్రూనూ - సాలీడూ కథ జ్ఞాపకం వచ్చింది.

నేను వాంఛించిన బొమ్మకోసం, మూడు రోజుల పోరాటంతో కొద్దిగా పోలికలు వచ్చేయి. ఆ పాటి విజయానికే నాలో ఉత్సాహం పుట్టుకు వచ్చింది. మరి రెండురోజుల అవిరళ కృషితో చిత్రానికో రూపు వచ్చింది. మనసులో సంతృప్తి మొదలింది. ఒరిజినల్‌గా గియ్యలేక పోయినా మరో బొమ్మను చూచి ఐనా బాగా కాపీకొట్టగలనన్న మాట!... నా అజంతా సుందరి చిత్రం చూసి మాధవ్ అన్నమాటలు జ్ఞాపకం వచ్చేయి.

"మీ కింత బాగా వెయ్యడం చేతనయి వుండీ నే కోరిన బొమ్మ గియ్యలేదు. ఇంతకీ మీ గుర్తుగా నా కేదైనా ఇవ్వాలని మీకు లేదు" అంటూ నిష్ఠూరంగా అన్నాడు జగదీశ్.

"చూసి వెయ్యగలను కాని నా అంతట నేను ఆలోచించి వెయ్యలేనండి" అంటే జగదీశ్ ఒప్పుకో లేదు.

"ఎలా గొచ్చినా సరే.మీరు వెయ్యక తప్పదు; నా కియ్యకా తప్పదు" అంటూ మొండికేసేడు.

"నాకు బాగా గియ్యడం రాదని మీకు తెలుసుగా? మీ

గ్రామ ప్రకృతి సౌందర్యాన్ని అవకతవకలుగా చిత్రించి అవమానం పాలు చేసేనని కోపం తెచ్చుకోకూడదు" అన్నాను.

చిత్రం ఎలావున్నా దానితో నాకు పేచీ లేదు. అది చూసినపుడు అది ఆ జ్ఞాపకాలని మనసులోకి తేగలిగితే చాలు" అన్నాడు, అతను.

మరునాటి నుండి జగదీశ్ తను అన్నట్టే రోజూ వచ్చి తను కోరిన చిత్రం ఏ దశలో వుందో చూసి పోతుండేవాడు. రంగులు కలుపుకొని కుంచె చేతిలోకి తీసుకొనే వరకూ "ఆపాటి వెయ్యలేక పోతానా" అనుకొన్నాను. తీరా మొదలుపెట్టే సరికి మాధవ్ నా చిత్రలేఖనా నైపుణ్యం గురించి అన్నమాటలు గుర్తుకు వచ్చేయి.

నా చిత్రం ఆ దారిలోనే నడుస్తున్న దనుకొన్నాను. ఆకాశంలో మేఘాలు కొండల్లాగ, చింతతోపు చేయి తగిలి ఒలికి పోయిన నల్లరంగు మచ్చలాగ, కాలిబాట రంగు ఫులమడంలో వచ్చిన జీరలాగ కనిపించ సాగాయి.

ఎన్ని కాగితాలు చించిపోసినా మనసులోని భావనకి ఒక రూపం అంటూ రాలేదు. ఒక విధంగా నా ప్రయత్నం అదేపనిగా విఫలం కావడంవల్ల చికాకు కలిగినా, ఇంకొకందుకు అది మంచిదే అనిపించింది! జగదీశ్ రోజూ వచ్చి గంటల తరబడి కూర్చుని నే గీస్తున్న బొమ్మని, వేస్తున్న రంగుల్ని చూసి కామెంట్సు చేసేవాడు. అంతలా చెపుతున్నవారు మీరే గియ్యకూడదూ అనేదాన్ని. "నాకే ఆ పాటి వచ్చుంటే మిమ్మల్నెందుకు బ్రతిమాలుకొంటాను? పదిహేను రోజులై అప్పలాడిలా తిప్పుతున్నారు. నాకు తెలుసు. నా సహనం పరీక్షించడానికి మీరు కావాలనే ఆలస్యం చేస్తున్నారు. రేపు ఎలా వుంటే అలా పట... అన్నాడు జగదీశ్.

జగదీశ్ అన్నమాటలో సత్యం లేకపోలేదు. ఆ... ఎంత ప్రయత్నించినా అంతకన్నా బాగా వెయ్యడం నాకు చేత కాదని తెలుసు. కాని బొమ్మని పూర్తిచేసి జగదీశ్ చేతిలో పెడితే, ఇప్పటిలా రోజూ రాడేమో అన్న ఆలోచనతో కాలయాపన చేయసాగేను.

జగదీశ్ ఒక్కరోజు రాకపోతే నాకేం తోచేది కాదు. కాలుగాలిన పిల్లిలా తిరిగేదాన్ని. ఏ కొత్త సవ్వడి అయినా అతడే వస్తున్నాడని అనుకొనేదాన్ని. వేళమీరి ఇంక ఆ రోజుకి రాడని తెలిసిపోయేక "మరీ అంత ముంచుకుపోయే పను లేమున్నాయ్ ఇతడికి" అని నాలో నేను విసుక్కునేదాన్ని.

నాకు జగదీశ్‌పై ఉన్న అధికారం ఏమిటో! అతడు రోజూ నా దగ్గరికి ఎందుకు రావాలో? ఈ నిరీక్షణకి అర్థం ఏమిటో తరిచి చూసుకోవాలనే ఆలోచన మనసులోకి వచ్చేదికాదు. 'రోజూ వస్తున్నవాడు ఈ రోజు ఎందుకు రాకపోవాలి?' సిద్ధంగా ఉన్న ప్రశ్న ముందుకు వచ్చి నిలిచేది.

వారం దాకా జగదీశ్ రాలేదు. ఆఖరుకు ఒకనాడు అతడు వచ్చిన సంగతి తెలిసికూడా నే బయటికి రాలేదు.

"భారతి లేదాండీ?" అని జగదీశ్ వదిన్ని ప్రశ్నించేడు.

"లేకేం? ఆ గదిలో ఉంటుంది, చూడండి." తాను జగదీశ్‌తో మాటలు పెంచుకోడం వదిన కిష్టంలేదు.

"మరీ యింత చనువు పరాయి మగాడి కియ్యడం మంచిది కాదు భారతీ! అనవసరంగా లోకంలో అపవాదుల పాలవుతావు" అని వదిన ఒకటికి రెండుసార్లు హెచ్చరించేది.

"అటువంటి పరిస్థితి రాకుండా నే చూసుకొంటాను వదినా" అన్నాను. "నా అంతటి దానివి నువ్వు. నేనేం చెప్పను? మీ అత్తయ్య ఉంటే నా కీ బాధ..." వదిన మాట పూర్తిగా వినిపించుకోకుండా నే అక్కడి నుంచి కదిలిపోయేదాన్ని.

జగదీశ్ గుమ్మంలో నిలబడి "భారతీ, ఏం చేస్తున్నారు? రావచ్చా" అని ప్రశ్నించేడు.

"మీ రిన్నిరోజులురారని తెలిస్తే ఆ చిత్రాన్ని రాత్రికి రాత్రి, నిద్రమాని పూర్తి చేసేదాన్ని కాదు"అన్నాను కొత్త విసుగుదలతో.

"ఏదీ? పూర్తయిందా? ఎక్కడుంది?"

"అగండి. ముందు మీరు ఇన్ని రోజులు రాకపోయినందుకు కారణం చెపితేగాని ఆ చిత్రాన్ని చూసేందుకు వీలులేదు"అన్నాను, ఆజ్ఞాపిస్తున్నట్లు.

''ఈ మధ్య 'సత్రం భోజనం మఠం నిద్ర' తో విసుగెత్తి ఇల్లు, యింటి భోజనం కావాలని మారాం చేసింది మనసు. అందు కని పిన్నితో చెప్పి...''

క్షణకాలం నా శరీరం రక్త చలనం ఆగిపోయినట్టు మొద్దు బారిపోయింది. ఏదో బాధ ఎలెక్ట్రిక్ షాక్‌లా శరీరమంతా ప్రవ హించి అంతలోనే మాయమయింది. నెమ్మదిగా మాటని నొక్కుతూ ''పెళ్ళి చేసుకున్నారా?'' అని ప్రశ్నించేను.

''నేనా...పెళ్ళా? అబ్బే...పిన్నిని, పిల్లల్ని తీసుకొచ్చి కాపురం పెట్టేను.''

'అంతేకదా?''

''అంటే మీ అభిప్రాయంలో...''

''అహాఁ...మరేం లేదు.పిన్నిని, పిల్లల్ని తీసుకొచ్చి కాపురం పెట్టడం చాలా మంచిపని చేసేరు. ఇక ఏరోజైనా మీరు రాక పోతే ఇంటికొచ్చి చెవులు పట్టుకుని లాక్కు రావచ్చంటూను.''

''మరి ఏదీ...నా బొమ్మేది?'' చెప్పినట్లు చేసి వెంటనే తాయిలం కోసం చెయ్యిపట్టే చిన్నపిల్లాడిలా అడిగాడు జగదీశ్.

''ఊరికే అన్నాను. ఇంకా పూర్తి కాలేదు. మీరు ప్రక్కన లేకుండా అయ్యే పనేనా అది?'' అన్నాను.

''అనవసరంగా నా కాళ్ళ పెట్టేరు. మీకు కంటి కురుపు లేస్తుంది'' అన్నాడు జగదీశ్ బుంగమూతి పెట్టి.

''మీ శాపం ఫలించదు లెండి. వేసవికాలం వెళ్ళిపోతున్నది'' అన్నాను.

* * *

మల్లెతీగ కడసారపు బిడ్డల్లా మొగ్గలు అరుదుగా అక్క డక్కడ వున్నాయి. పొట్టిగా, పీలగా ఆకులమధ్య దాగిన మొగ్గల్ని రఘూ, నేనూ ఎంచి ఎంచి కోసేము. మొగ్గలు నా ముందు పోగుగా పోసి రఘూ వీథిలోకి ఆటలకి పరుగు తీసేడు. మల్లెల మధ్య మరువం పెట్టి మాలగా కట్టేను. మాలను రెండుముక్కలు చేసి ఒకటి పూజ గదిలో వేణుగోపాలుడి విగ్రహానికి వేసేను.

వదిన తలంటు పోసుకొంటున్నది. పచ్చి ఆకులో పదిలంగా

చుట్టి వదినకోసం తులసికోట తిన్నెమీద పెట్టేను. ఇంకా కొద్దిగా మొగ్గలు మిగిలి ఉన్నాయి. రోజూ నా కోసం కొన్ని మొగ్గలు రహస్యంగా దాచుకొని పడుకోబోయే ముందు ప్రక్కమీద జల్లుకోవడం నా కలవాటు. తెల్లవారి కళ్ళు విప్పగానే వాటిని ఏరి బయట పారవేసేదాన్ని. మల్లెపూలపట్ల నాకు ఉన్న మమకారం నన్నీ చాటుమాటు పనికి ప్రోత్సహించేది.

ఆ రోజు మిగిలిన మల్లె మొగ్గల్ని చిన్న దండగా కట్టేను. అద్దం ఎదుటికి రాగానే తలలో పెట్టుకోవాలనే కోర్కె కలిగింది. ఆదివరలో ఒకసారి అప్రయత్నంగా అటువంటి పని చేయబోయి నంగుకే చేతులు వణికేయి. కాని ఆ రోజు మనసు పట్టలేకపోయేను. ఎవరూ లేరుగా, కాస్తసేపు పెట్టుకు తీసేస్తే ఏమవుతుంది అను కొన్నాను. కాని తలపైకి చేతులు చేరేసరికి ఆసక్తి సన్నగిల్లి పోయింది. ఏదో తప్పు చేస్తున్నానన్న భావం మనసులోకి వచ్చి గుండె దడ దడ లాడింది. ఇది నిజంగా తప్పా? సుందర దృశ్యాన్ని చూస్తే పొందే అనుభూతులు, సున్నితమైన భావాలు మనసులో మసిలితే కలిగే సంచలనం వితంతువులు అనుభవించకూడదా అను కొన్నాను.

పువ్వులు ముడిమీద పెట్టుకోబోయి మనసయితే మార్చు కొన్నాను కాని, చేతులింకా అక్కడే ఉండిపోయాయి. ఆలో చనల మధ్య తలుపును మెల్లగా తట్టిన ధ్వని చెవులకి తాకలేదు.

"రాకూడని సమయంలో కాని రాలేదు కదా?" జగదీశ్ లోపలికివస్తూ పరధ్యానంగా ఉన్న నన్ను చూస్తూ అన్నాడు.

"లేదు! రండి! కూర్చోండి!" అన్నాను, ముడిమీది పువ్వుల్ని తడబడుతున్న చేతులతో తీసివేయబోతూ.

జగదీశ్ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"మీ తలలో ఉండడంచేత ఆ మల్లెలకి శోభ వచ్చింది. ఆ మల్లెలతో మీ ముఖానికి కళ వచ్చింది. మనసులోని కోర్కెలకీ, మల్లెల సువాసనకీ ఏదో ఓ సమయంలో లొంగనివారు ఉండరు. తియ్యకండి. కాస్త సేపు వాటిని అలాగే ఉండనీయండి. కనీసం

నేను ఉన్నంత వరకైనా" అని బ్రతిమాలుతున్నట్లు అన్నాడు జగదీశ్.

"నేను పువ్వులు పెట్టుకోకూడదని మీకు తెలియదా జగదీశ్? ఎవరైనా చూస్తే బాగుండదు; తప్పుపడతారు," అన్నాను.

"ఆ విధంగా చూస్తే చెయ్యకూడదని పెద్దవాళ్లు నిర్దేశించిన పనులు మీరేం చెయ్యటం లేదా? ఉదాహరణకి ఇలా ఒంటరిగా మాట్లాడడం, యింట్లో ఎవరూ లేకపోయినా ఆ రాత్రి నాకు భోజనం పెట్టడం, వీటికి పెద్దలు అనుమతిస్తారనే భావిస్తున్నారా? మీ వంక చాలామంది వేలెత్తి చూపిందికి, నోరువిప్పి మాట్లాడిందికి సాహసించలేక పోతున్నారంటే మీ డబ్బు వాళ్ళనోటికి తాళం వేస్తున్నదని తెలుసుకోండి.

"ఈ తప్పొప్పులకి ఓ పట్టిక అంటూ లేదు భారతీ! ఎవరి మనస్తత్వానికి, జీవితగతికి అనువైన విధంగా వారు తమ జీవితాన్ని మలచుకోవాలి," అన్నాడు.

క్షణకాలం ఆగి నా వంక పరీక్షగా చూసేడు జగదీశ్.

"ఊఁ, కానీండి మీ లెక్చర్. ఈ రోజు ఉపన్యాసకుల ధోరణిలో వున్నారు. వినిందికి నేనూ సిద్ధంగానే ఉన్నాను," అన్నాను అతని మాటల్ని తేల్చివేస్తూ.

నా మాట పాల పొంగులాంటి జగదీశ్ ఉత్సాహంమీద నీళ్ళు జల్లినట్లయింది. ఏదో గొప్ప కార్యం సాధించాలని బయలు దేరిన వాడికి గుమ్మంలోనే ఎర్రతేలు కుట్టినట్లు బాధపడుతూ, దిగులుగా ఊరుకున్నాడు.

"అదేం? అంతలోనే నదిలో నీరింకిపోయిందేం? మూగనోము పట్టేరు," అన్నాను.

"మీరు నా ఉత్సాహాన్ని పీకనొక్కి చంపేసేరు. ఇంక నా లెక్చర్ వినే అదృష్టం మీ కీ రోజుకి లేదు." అంటూ చిన్నగా నవ్వుతూ అన్నాడు జగదీశ్.

"తిరిగి మిమ్మల్ని ఆ ధోరణిలో పెట్టిందికి ఏం చెయ్యాలో చెప్పండి పోనీ."

"చెప్తే చేస్తారా?"

"చెయ్యగలిగేదైతే."

"మాట పోకూడదు సుమండీ."

"ఊఁ, కానీండి...ఇంకా సాగదియ్యక."

"మీరు ముఖాన బొట్టు పెట్టుకోండి. తలలో పువ్వులూ, ముఖాన బొట్టుతో మీ రూపు చూడాలని ఎంత కాలంగానో వుంది."

"జగదీశ్...అది..."

"అదిగో, మాట తప్పుతున్నారు. ఇదేం కష్టమైన పనికాదు. అదిగో, అద్దం, కుంకం ఆ బల్లమీద ఉన్నాయి. నన్ను తెమ్మంటే తెచ్చి మీ ముందు పెడతాను." జగదీశ్ చాలా ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు. గలగల పారే గంగాప్రవాహంలా సాగిపోతున్నాయి అతనిమాటలు.

"ఇది నే చెయ్యలేని పని జగదీశ్. నా చేతి వేళ్ళు వణుకుతాయి. నే పెట్టుకోలేను. ఈ పని నావల్ల కాదు. నే చెయ్యలేను."

"మీ చెయ్యికి బలాన్నిచ్చిందికి నా చేయి ఆసరా తీసుకోండి. భారతీ! ఒక దురదృష్ట ముహూర్తాన మీ నుదుట చెరిగిపోయిన బొట్టును తీర్చిదిద్దే అవకాశం నాకు కల్పించండి. జీవితంలో మీరు కోల్పోయిన ఆనందాన్ని తిరిగి అందుకోగలిగే మార్గం నన్ను చూపనీండి.

"ఈ రోజుల్లో అటువంటి వివాహాలు ఒక సమస్య కావు భారతీ. మనసులు కలిసిన వ్యక్తులు దొరకడమే సమస్య. నేను మీ పట్ల జాలితో ఈ మాట చెప్పడం లేదు. ఇంకే విధమైన ప్రలోభానికీ లోనై మిమ్మల్ని అర్థించడం లేదు. నా ఆనందం కోసం, మీ ఆనందం కోసం. జీవనదిలా జీవిత పర్యంతం నిరాటంకంగా ప్రవహించ వలసిన మన స్నేహం..."

"వద్దు, జగదీశ్. ఇటువంటి మాటలు వద్దు. ఇటువంటి భావనలతో ఇద్దరం బాధపడవలసి ఉంటుంది. మాధవ్‌ని మరచి పోయి మనం ఆనందంగా బ్రతకలేం. మనం స్నేహితులుగా, మాధవ్ ఆప్తులుగా ఇలాగే ఉండిపోదాం. ఇంకెప్పుడూ ఈ ప్రస్తావన తేకండి. ఈ విషయాన్ని మనసులోంచి తోసివెయ్యండి," అన్నాను నెమ్మదిగా.

"నేను మిమ్మల్ని తొందర పెట్టబోవడం లేదు భారతీ! నా అభ్యర్థన మీ మనసులో ఉంచుకోండి. ఏనాటికైనా మీ మనసు మారితే తెలియజెయ్యండి. మీ సమ్మతికోసం నే వేచి ఉండగలను. ఇంతకాలం అని చెప్పలేను. బహుశా యింకో భారతి తటస్థ పడే వరకూ," అని నిదానంగా అని వెళ్ళిపోయేడు జగదీశ్.

నెలరోజుల కాలంలో యింట్లో ఎన్నో మార్పులు వచ్చేయి. అనారోగ్య కారణంగా మామయ్య అనుకున్నకన్న ముందుగానే ఉద్యోగ విరమణ చెయ్యవలసి వచ్చింది. 'చెల్లకపోతే చిల్లర కాపురం' అన్నట్టు రెండు కాపురాలు ఎందుకని మాటామాట్లే సర్దుకొని అన్నయ్య యింటికి వచ్చేరు, అత్తయ్యా, మామయ్యా. ఒదిన కాపురానికి వచ్చిన కొత్తలో అన్నయ్యకి ఇంకా ఉద్యోగం కాని సమయంలో అంతా కలిసి ఉండేవాళ్ళం. తిరిగి అటువంటి సందడి వచ్చింది యింటికి. అత్తయ్యా, వదినా యింటిపనులు చేసుకు పోతూంటే మామయ్యా, అన్నయ్యా వ్యాపార వ్యవహారాల గురించి ముచ్చటించు కొంటుంటే, పెద్దల ఆసరా చూసుకుని

పిల్లలు అల్లరి రెట్టింపుచేసి యింటా, బయటా గంతులువేస్తూ చిందులు తొక్కుతుంటే, ఏ కోవకీ చెందని నేను ఒంటరిగా ఆ కుటుంబంతోటి సంబంధంలేనట్లు పడి వుండేదాన్ని. ఇంటిలో నా పట్ల ప్రేమాభిమానాలు తగ్గేయని చెప్పలేను కాని, ఆ అభిమానాల వెనక దాగివున్న ఆర్థికభూతం వాళ్ళ మాటల చాటు నుంచి, చేతల వెనకనుంచి, కళ్లు మిటకరించి, పళ్ళు మెరిపిస్తూ నన్ను భయపెట్టేది. నిలుచున్న పాళంగా మింగేస్తానని బెదిరించేది.

వరదరాజూ, అన్నయ్యా, మామయ్యా తరచు కలుసు కొంటూ, వ్యాపార విషయాలపై తర్జన భర్జనలు చేసేవారు. మామయ్య తాను కలలుగన్న తోటకి, యింటికి నిర్ణయించిన మొత్తం కూడా వ్యాపారంలో పెట్టేందుకు తన సమ్మతి తెలియ జేసేడు. ఆ ముగ్గురిమధ్య జరుగుతున్న ఒప్పందాలు, వాగ్దానాలు ఏమిటో తెలియని నేను, ఆ వ్యాపారపు జిత్తుల్లో చిక్కుకొని ప్రాణం కడంటి పోతుందేమో అని భయపడేదాన్ని.

మాటకీ, మనసుకీ దగ్గరగా వచ్చిన జగదీశ్ సలహా తీసు కొంటే మంచిదేమో అనిపించింది. కాని ఈ ధన వ్యామోహానికి దూరంగా నిర్మలంగా ఉన్న అతన్ని ఈ ఊబిలోకి లాగి అపవిత్రం చెయ్య బుద్ధికాలేదు. నిజమైన నా శ్రేయోభిలాషిగా అతడే నా మిగిలి ఉంటే అదే చాలు అనుకొన్నాను.

# 7

ఏదైనా అతిగా పెరిగితే అంకలోనే తరుగుతుందంటారు.

ఉన్నట్లుండి ఒక్కసారిగా వ్యాపార విశేషాలు ఇంట్లో విన రావడం మానేసేయి. నేను ఎవరినీ ప్రశ్నించలేదు. చెప్పవలసిం దేమైనా ఉంటే అన్నయ్యే చెపుతా డని ఊరుకొన్నాను. అతడు చెప్పినదానిలో నిజానిజాలు తేల్చి చూసే ప్రసక్తి ఏనాడో మాను కొన్నాను. నమ్మగలిగితే నమ్మడం, లేకపోతే లేదు.

హఠాత్తుగా వరదరాజు తండ్రి చచ్చిపోయేడట. అన్న దమ్ములు ఆస్తిని పంచుకొనే ప్రయత్నంలో ఉన్నారట. ఆ కారణంగా పేపరు మిల్లు వ్యాపారం వెనక్కి నెట్టుకు పోయిందట. "ఇక దానిమీద ఆశ పెట్టుకొని కూర్చుంటే లాభం లేదు. లాభసాటి అయిన ఇంకేదైనా చూడాలి" అన్నాడు అన్నయ్య.

అ స్తవ్యస్తంగా జరిగిన ఆ వ్యవహారంలో సొమ్ము చెయ్యి జారిపోనందుకు సంతోషించేను.

"మీ అదృష్టం బాగుంది. ఆ వరదరాజు సాలెపురుగు లాంటి వాడు. ఆ పట్టులోకి చేరిన ఈగ సమూలంగా నాశనమయి పోవల సిందే. ఈ సంగతి సారథితో కూడా చెప్పేను. కాని ఎవరి మాటకి ఎంత విలువియ్యాలో తనకు తెలుసన్నాడు. ఏమైనా ఈ రోజు మంచి వార్త విన్నాను" అన్నాడు జగదీశ్.

జగదీశ్ అన్న మాటని వదినతో చెప్పేను. "అన్నయ్యకి తెలిసి కూడా నన్నా గోతిలోకి దింపా లనుకొన్నాడు" అన్నాను. వదిన కూడా అన్నయ్య అన్నట్లే అంది.

"నీ రక్తం పంచుకు పుట్టిన అన్న మాటకన్న జగదీశ్ మాట

ఎక్కువ విలువయిందా నీకు? పట్టరానివాళ్ళ కాళ్ళు పట్టి జగదీశ్ ఎందుకు ఇక్కడకు బదిలీ చేయించుకున్నాడో ఎప్పుడైనా అడిగి చూడు. జీతం తక్కువైనా, పని ఎక్కువైనా, ఏ కార్య సిద్ధికోసం ఈ ఊరు చేరుకొన్నాడు? నీకు దగ్గరగా ఉండి మంచి కబుర్లు నాలుగు చెప్పి అప్పో సప్పో పేరుతో నీ డబ్బు లంకించుకోవాలని కాదూ!"

వదిన అన్నయ్య మాట నమ్మడం సహజమే. కాని నా డబ్బుకోసమే జగదీశ్ ఇంత ప్రయత్నం చేసి ట్రాన్స్‌ఫర్ చేయించుకొన్నాడంటే నేను నమ్మలేక పోయేను.

"మీ వదినగారు చెప్పిన దానిలో కొంత నిజం లేకపోలేదు. కావాలని కోరుకొని ట్రాన్స్‌ఫర్ చేయించుకోడం, డబ్బు రీత్యా, పని రీత్యా పరిస్థితి కొంత దిగజారి పోవడం వరకూ సరిగానే ఉంది. కాని, భారతీ, నే నింత దూరం వచ్చింది మీ డబ్బు కోసం కాదు, మీకోసం! మీకు దగ్గరగా ఉండాలని, మీతో స్నేహం పెంచుకోవాలనీ మనసు కోరడంచేత. ఈ మాట మీ ఎదురుగా నేను ఉన్నంత నిజం" అన్నాడు జగదీశ్.

అతని మాట నమ్మేను. ఆ మాట నమ్మకూడదనే భావం నా మనసులోకి రాలేదు; మా పరిచయ కాలంలో జగదీశ్ నిజంగా డబ్బు కోసం ప్రయత్నిస్తే తప్పక పొందగలిగి ఉండేవాడు. కాని మా ఇద్దరి మధ్య ఆ విషయం గురించిన ప్రస్తావనే రాలేదు. జగదీశ్ పట్ల నా నమ్మిక సడలవలసిన సంఘటన లేమీ జరగ లేదు. వదిన చెప్పిన మాట విన్న తరువాత అతనిపట్ల నాకు ఆదర భావం పెరిగిందే కాని తరగ లేదు.

మొదలుపెట్టిన నెల రోజుల నాటికి కాని జగదీశ్ కోరిన చిత్రం పూర్తి కాలేదు. మధ్య కాలంలో జగదీశ్ పిన్ని మా యింటికి వచ్చి అత్తయ్యనూ, వదిననూ, నన్నూ తనతో తీసుకు వెళ్ళింది. ఆవిడ పరిస్థితుల్నిబట్టి సర్దుకు నడుచుకు పోయే మనిషిలా కనిపించింది. పిల్లలు కలివిడిగా, చనువుగా ఉన్నారు. "మా పెద్ద పిల్లకి పెళ్ళయి అది అత్తవారింటికి వెళ్ళిపోయేక ఇంట్లో సందడే

తగ్గిపోయింది. జగదీశ్ ఆఫీసుకి, పిల్లలు స్కూలుకి పోతే నాకేం తోచదు. దగ్గరే కదా, ఎప్పుడైనా వస్తూండు" అన్నది నాతో, ఆవిడ, ఆప్యాయంగా.

"భారతి చక్కగా బొమ్మలు గీస్తారు పిన్నీ! ఆమె వేసిన రాధామాధవ చిత్రం ఎంత బాగుందనుకొన్నావు!" అన్నాడు జగదీశ్. "ఊరకనే అంటారండి. నాకేం రావు. అన్నీ అబద్ధాలు" అన్నాను. "అబద్ధాలా! ఆ చింత తోపులో సూర్యాస్తమయం చిత్రం పూర్తి కానీ, మా పిన్నికి చూపిస్తే తిరిగి మా గ్రామం వెళ్ళినంత సంబర పడుతుంది" అన్నాడు జగదీశ్.

ఆటు తరువాత రెండు మూడు సార్లు నేను వారి ఇంటికి వెళ్ళేను. ఆవిడ కూడా మా యింటికి వస్తూ పోతూండేది. నేనంటే ఎంతో అభిమానంగా, జాలిగా ఉండేది...నిజంగా నా డబ్బుతో ప్రమేయం లేకుండా నన్ను నన్నుగా ప్రేమించేవారంతా నాకు దేవతల్లా కనిపించేవారు.

"నీ గురించి జగదీశ్ చాలాసార్లు చెపుతూ ఉండే వాడమ్మా, కాని ఇంత సుకుమారంగా, ఇంత సున్నితంగా వుంటా వనుకోలేదు. ఈ రాత నీ నుదుట రాసిందికి ఆ బ్రహ్మదేవుడికి చేతు లెట్లా ఆడేయో" అంది ఆమె.

నెల రోజులు తిరిగేసరికి జగదీశ్‌కి విసుగు పుట్టింది. "ఇంక తిప్పితే నేను ఊరుకునేదిలేదు. రేపెల్లాగైనా మీ రా చిత్రం పూర్తిచేసి నా కియ్యావలసిందే!" అన్నాడు.

అన్నరీతిగానే మరునాడు 'చిత్రం ఇయ్యందే కదల' నంటూ జగదీశ్ పీఠం వేసుకు కూర్చున్నాడు.

ఇంక అతన్ని తప్పించుకొనే మార్గం లేదని గీసిన రేఖలపై ఆడుతూ బడుతూ నాలుగు రంగులు పులిమేను. ఆరీ ఆరని రంగుల కలయికని కౌగితం పీల్చుకోడంవల్ల అనుకోని రంగుల మేళవింపు కలిగింది.

"చూసేరా! రాదు, రాదు అంటూ ఇంత కాలం తిప్పేరు. ఆ నీటిలోని ఇసుక తిన్నెలకి వేసిన రంగు ఎంత చక్కగా వచ్చిందో" అన్నాడు జగదీశ్, ఉత్సాహంగా.

"దీనికే అంటారు గుడ్డిగుర్రం తాపు అని. తగిలిందా గట్టిగానే తగులుతుంది" అన్నాను నేను నవ్వుతూ.

చీకటి పడే వేళకి ఆ చిత్రం పూర్తయింది. దానిని ఆ రాత్రికి అలాగ వదిలి మరునాడు పట్టుకువెళ్ళితే బాగుంటుందన్నాను. ఆ చిత్రం తీసుకువెళ్ళకుండా ఇంటికి వెళ్ళనని మొండికేసేడు జగదీశ్. "ఈ రాత్రికి దీన్ని చించి పోగుపెట్టి, ఇంకోటి వేసిఇస్తానంటారు. నా కొత్త జోళ్ళు అరిగితేకాని ఆ చిత్రం నా కళ్ళ బడదు. చేతి కందిన వస్తువుని విడిచిపోయేటంత వెర్రి వెంగళాయిని కాను" అన్నాడు.

ఆ చిత్రం నేను ఆశించినదంకంటే బాగా వచ్చింది. ఇన్నాళ్ళ పరిశ్రమతో దానిపట్ల ఆప్యాయత పెరిగింది. ఆ వెంటనే కదిపితే ఆరని రంగులు చెదిరి, చిత్రం అధ్వాన్నంగా తయారయే ప్రమాదం ఉంది. ఇంత శ్రమా గంగపాలవుతుంది. ఏమైనా రేపుకాని ఇయ్య కూడదని నిశ్చయించుకొన్నాను.

"రేపుకాని మీ కియ్యను. నేను చిత్రించింది నా ఇష్టం" అన్నాను. "అది నా కిస్తానని ఏనాడో వాగ్దానం చేసేరు. ఇప్పుడు వేరుగా మీ రిచ్చే దేమిటి? నేనే లాక్కుపోతాను" అన్నాడు జగదీశ్, ముందుకి అడుగులు వేస్తూ.

నా కన్న ముందుగా అతడు టేబిల్ దగ్గరికి చేరుకొన్నాడు. అతని చేతిలో చిత్రాన్ని అందుకొందికి ప్రయత్నిస్తూ "వదలండి. మీకే చెపుతున్నది. పాడయి పోతుంది" అన్నాను.

నాకు అందకుండా అతడు దాన్ని పైకెత్తి పట్టుకున్నాడు. రెండు చేతులూ పైకెత్తి దాన్ని అందుకునే ప్రయత్నంలో అతనికి అతి దగ్గరగా వచ్చేను. ఒత్తుగా, మత్తుగా, అతని ఊపిరి నా తలపై తగులుతున్నది. తగిలీ తగలని దూరంలో అతని గుండెల కెదురుగా నేను!

చిత్రం చివరలు నా చేతి కందేయి. అతడు ఉన్నపళంగా దానిని వదిలిపెట్టి, రెండు చేతులతో నన్ను గుండెలకి అదుము కున్నాడు. చిత్రం నా చేతిలోంచి జారిపడి, ముఖం నిండా రంగులు

పులిమింది. జగదీశ్ దానిని పక్కకి నెట్టి సున్నితంగా పెదవులమీద ముద్దు పెట్టుకొన్నాడు.

"ఏమి టీ పని జగదీశ్?" అతన్ని బలంగా దూరంగా నెట్టి వేయాలని ప్రయత్నించేను. కాని నా అవయవాలు నా స్వాధీనంలో లేవు. పారవశ్యంతో మనసు సోలిపోయింది. ఏమి టీ వైపరీత్యం? నా శరీరం, మనసూ నాకే ఎదురు తిరిగే ఈ పరిస్థితి ఎలా కలిగింది? నా మనో నిబ్బరం, నిశ్చలత ఎక్కడికి పోయేయి? నే నేమై పోతున్నాను?

నాకన్న ముందుగా ఆ ఆవేశంనుంచి జగదీశ్ కోలు కొన్నాడు. నన్ను విడిచి నాలుగడుగులు దూరంగా వెళ్ళిపోయేడు. జగదీశ్ చేతుల పట్టు సడలగానే నా వంటిని పట్టిన మైకం విడి పోయింది. రెండు చేతులతోనూ ముఖం కప్పుకుని కుర్చీలో కూల బడ్డాను.

"భారతీ, నన్ను క్షమించండి. ఆవేశంలో అనుకోనివిధంగా హద్దులు దాటేను. మిమ్మల్ని అవమానించాలనీ, బలం ప్రయోగించి వశపరుచుకోవాలనీ కలలో కూడా తలవని కోర్కె. మరి ఈనా డెందుకిలా జరిగిందో? నన్ను నమ్మండి. మీ పట్ల నాకు పాడు తలంపులేవీ లేవు. ఏనాటికైనా మీ సమ్మతితో వివాహం చేసుకో..."

"జగదీశ్, ఇంకేమీ చెప్పకండి. వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళిపోండి. కొంతకాలం వరకూ ఇటువైపు రాకండి. ఈ బలహీన తని మన మనస్సుల్లోంచి పారదోలేవరకూ మనం పూర్వంలా స్నేహంగా ఉండలేం. ఈ మానసిక పరిస్థితి ఇలాగే ఉంటే స్నేహం పేరు మీదుగా మనల్ని మనం మోసం చేసుకొన్నట్లే అవుతుంది" అన్నాను నెమ్మదిగా.

*　　*　　*

జగదీశ్ వెళ్ళిపోయేడు. మిగిలిన సంధ్య వెలుగు కాస్తా మరుగుకి పోయి గదిలో చీకటి అలుముకొంది. కొంతసేపు గడిచేక, "భారతీ" అంటూ అత్తయ్య పిలుపు, లైటు స్విచ్ వేసిన చప్పుడు,

"ఇదిగో, ఇక్కడ కుర్చీలో నిద్రపోతున్నది" అన్న వదిన మాటలూ వినిపించేయి.

మూసిన కన్ను తెరవకుండా రెండురోజులు అలా పడిఉంటే గాలీ, ధూళీ తాకిందనుకొని అత్తయ్య మంత్రించిన రక్షరేక తెచ్చి నా జబ్బకి కట్టింది. అన్నయ్య డాక్టరుని పిలుచుకవచ్చేడు. "తీరిక లేని పరిశ్రమతో శరీరమంతా నలిగిపోయినట్లుంది. నీరసం తప్ప మరేం చికాకు లేదు. బలాన్నిచ్చే ఆహారం ఇస్తూ, కొన్ని రోజుల పాటు ఆవిడను విశ్రాంతి తీసుకోనీండి" అన్నాడు డాక్టర్.

ఆ రెండు రోజుల ఎడతెగని ఆలోచనలతో, ఆశానిరాశలతో, మంచి చెడ్డల పర్యాలోకనంతో అలిసిపోయిన మనసునీ, శరీరాన్నీ అపురూపంగా లభ్యమైన ఆ రాత్రి సుఖనిద్ర సేద దీర్చింది.

రెండురోజుల ఒంటరితనంతో నాలోని పిరికితనం కడుక్కుపోయింది. మంచి చెడ్డల పర్యాలోకనం ముందు బ్రతుకుకు దారి చూపింది. అద్దాలలో పొదివి పట్టుకొని లాలించిన ఆ రాత్రి సుఖనిద్ర ఉత్సాహాన్నీ, బలాన్నీ ప్రసాదించింది.

రెండు రోజులనాడు జీవం కోలుపోయి సమాధిగ్రస్తురాలైన భారతి తిరిగి బ్రతికింది. గడిచిన జీవితపు గాలిదుమారాల తాకిడికి తట్టుకోగలిగినంత బలంతో, ధైర్యంతో తిరిగి జీవితంలోకి కాలు పెట్టింది.

గది వదిలి బయటికి వచ్చేను.

"ఎలా వుంది భారతీ?" అంటూ ఇంట్లో అంతా అదే ప్రశ్న వేసేరు.

"బాగానే వుంది. ఇప్పుడేం చికాకు లేదు."

"ఇంతకూ ఏమయింది?" అని అడిగింది వదిన.

"ఏమయిందో నీతో ఎలా చెప్పను వదినా" అనుకొన్నాను.

"డాక్టరు చెప్పేడు కదూ, నీరసం తప్ప మరేం లేదని" అన్నాడు మామయ్య.

"రెండురోజుల నలతకే ముఖం ఎలా పీక్కుపోయిందో" అంది అత్తయ్య.

"నాకేం నలతా లేదు; కాలతా లేదు. ఇంక ఊరుకోండి బాబూ!" అన్నాను.

సాయంకాలం కాఫీలయేక "అలా ఒకసారి జగదీశ్ ఇంటికి వెళ్ళివస్తా" నన్నాను.

"ఒంట్లో సరిగా లేదుకదా? ఈ రోజే వెళ్ళాలని ఏముంది? ఇంకోరోజు వెళ్ళు" అంది అత్తయ్య.

"ఒంట్లో సరిగానే వుంది. తొందరగా తిరిగి వచ్చేస్తాను" అంటూ గుమ్మం దిగేను.

"దాని కెంత తోస్తే అంతే. ఇంకోనాడు చెప్పినమాట వింది కనకనా?" అత్తయ్య మాటలు మెల్లగా వినిపించేయి.

వీధి గుమ్మంలోనే జగదీశ్ చెల్లెలు రమణి కనిపించింది.

"మీ అన్నయ్య ఇంట్లో ఉన్నారా?" అంటూ గుమ్మం ఎక్కుతూ ప్రశ్నించేను. "ఉన్నాడు" అన్న అర్థం వచ్చేలా బుర్ర తిప్పుతూ వేలితో ఒక గది చూపించింది.

గుమ్మంలో నిలబడి మెల్లగా తలుపు తట్టేను.

"నన్ను బాధ పెట్టకు, పిన్నీ. నాకేం తినాలని లేదు" అని జగదీశ్ కంఠం మెల్లగా వినిపించింది.

ఆ గదికి మూడు కిటికీలు ఉన్నా ఒకటి మాత్రమే తెరవబడి వుంది. ఆ కొద్ది వెలుతురూ బయటినుంచి వచ్చిన వారికి గదిలో పరిస్థితిని తెలియజేసేందుకు అట్టే ఉపయోగపడలేదు. లోనికి అడుగు వేస్తూ, జగదీశ్ ఎక్కడ ఉన్నాడా అని ఇటు అటు పరిశీలనగా చూసేను.

"ఓహో...మీరా, భారతీ! పిన్ని అనుకొన్నాను," జగదీశ్ మంచం మీంచి లేచి ముందుకు వస్తూ అన్నాడు.

అతడు చూపించిన కుర్చీమీద కూర్చున్నాను.

"కిటికీలన్నీ మూసుకొని యిలా కూర్చున్నారు. ఉక్క పొయ్యడం లేదూ?" అన్నాను, సంభాషణ మొదలు పెట్టేందుకు ఊతగా.

"మనసులో చీకటి గూడుకట్టుకొన్నప్పుడు బయటి వెలుగును భరించడం కష్టం, భారతీ! మనిషి స్వార్థపరుడు. తను ఉత్సాహంగా

వున్నప్పుడు ఆకాశంమీద హరివిల్లు విరవాలనీ, ఆకాలంలో మల్లె పూలు పూయాలనీ, కాకి కూడా కోయిలలా కూయాలనీ కోరు కొంటాడు.

"అదే తన కేదైనా ఆపద, నష్టం వాటిల్లితే ఉరుములు, మెరుపులతో భూమ్యాకాశాలు దద్దరిల్లి పోవాలనీ, ఉప్పెనవచ్చి ప్రపంచమంతా మునిగిపోవాలనీ తలుస్తాడు.

"సానుభూతి సహాకారాలను తోటి మానవులనుండి, సాటి ప్రాణులనుండి పొందలేని మానవుడు అనంతమైన ప్రకృతిని తనకి తోడుగా ఉండమని కోరుకొంటాడు. ఉంటుందని ఆశిస్తాడు..." కాని వుండదు. అదే తమాషా. ఈ పిచ్చి మానవుడు యింతలా కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు; ఉంటే ఏం పోయింది అనుకోదు. ఏదో మునిగిపోతున్నట్లు తన పనులు క్రమం తప్పకుండా చేసుకు పోతూంటుంది ప్రకృతి.

"అందుకే మనసులోని చీకటికి తోడుగా గది చీకటి చేసు కొని కూర్చున్నానంటారు. అంతేనా? కాని అంత మాత్రాన ఏమయింది, జగదీశ్? ప్రపంచాన్ని రోజులాగే సూర్యుడు తన వెలుగుతో కాంతివంతం చేస్తున్నాడు. పువ్వులు పూస్తున్నాయి, పక్షులు కూస్తున్నాయి. మీ ఇంట మీ చిన్న చెల్లెలు మాత్రం అన్నగారి ఆర్భాటానికి అర్థం తెలుసుకోలేక దిగాలుపడి కూర్చుంది. అదొక్కటే మీరు సాధించింది." అన్నాను అతని మాటను పూర్తి చేస్తూ.

జగదీశ్ ఏమీ మాట్లాడలేదు. మెల్లగా లేచి వెళ్ళి కిటికీ రెక్కల్ని తెరిచేడు. వెలుతురు, గాలి బారుగా లోపలికివచ్చి ప్రాణానికి హాయి కలిగించేయి. అతడు తిరిగివచ్చి తన స్థానంలో కూర్చున్నాడు.

"ఈ రోజు మీ సంగతేం బాగులేదు. జగదీశ్ కాలేజీ రోజుల్లో యాక్ట్ చేసిన ఏ నాటకాల్లోవో నాలుగు మాటలు గుర్తుకు తెచ్చుకొని అప్పచెప్పి నన్ను పంపివెయ్యాలనుకుంటున్నారు. ఇంటికి వచ్చినవారికి కాఫీ, టీ లియ్యకపోతే మానె; కాస్త చల్లని మంచినీళ్ళయినా యియ్యాలని మీకు తోచలేదు. ఏమైనా

అంటే యింట్లో చీకటి, ఒంట్లో చీకటి అని మాత్రం చక్కగా కబుర్లు చెప్పగలరు."

పరిస్థితిని, పరిసరాల్ని తేలిక చెయ్యాలనే వుద్దేశంతోనే ఎందుకూ కొరగాని విషయాన్ని ముందేసుకొని అరగంటసేపు వాగేను. ఆ మందు జగదీశ్ పై బాగా పనిచేసింది. అతడి కంఠానికి బిగిసివున్న తాడు దానంతట అదే విడిపోయింది. "భారతీ, మీకు నామీద కోపం లేదా?" అన్నాడు నెమ్మదిగా. "వేరే చెప్పాలా జగదీశ్! కోపమైతే మీ యిల్లు వెతుక్కుంటూ యిలా వచ్చేదాన్నా?"

"ఆనాడు జరిగిన అవాంఛనీయ సంఘటన మిమ్మల్ని చాలా నొప్పించిందనీ, నా నీడ మీ మీద పడినా అసహ్యించుకొంటారనీ అనుకొన్నాను."

"ఆవేశంలో జరిగిన పొరపాటుని అర్థం చేసుకోలేకపోతే యింత స్నేహానికి విలువేముంది, జగదీశ్?"

"రక్షించేరు! క్షణికోద్రేకానికి గురై మీ అమూల్య స్నేహాన్ని కాళ్ళ తన్నుకొన్నానని రెండు రోజులై బాధపడు తున్నాను. మీ మాటతో నా గుండెలమీది బరువు దింపినట్లుంది."

"మాట వరసకి ఏదో అనగానే అంతా తీరిపోయినట్లు మాట్లాడుతున్నారు. కాని, చేసిన తప్పుకి శిక్ష మాత్రం అనుభ వించక తీరదు సుమండీ. కావాలని చేసినా అనుకోకుండా చేసినా నేరం జరిగినమాట వాస్తవం. దానికి దండన విధించే హక్కు నాకే వుంచుకొన్నాను."

"చేసిన నేరాన్ని ఒప్పుకొంటున్నాను. మీరే శిక్ష విధిం చినా సంతోషంగా స్వీకరిస్తాను. కాని ఒక షరతు. ఇప్పటి మన స్నేహానికి అది అంతరాయం కలిగించకూడదు. ఈ కారణంగా మీనుంచి దూరం కావడాన్ని నేను సహించలేను."

"ఆ మాట చెప్పలేను సుమండీ. మన స్నేహం యిదే విధంగా వుంటే మీ శిక్ష పూర్తి కానట్లే" అన్నాను.

నా మాటని తీవ్రంగా అర్థంచేసుకుని చేదుమింగిన వాడిలా ముఖం పెట్టేడు జగదీశ్. అతన్ని చూస్తుంటే నాకు నవ్వు

ఆగింది కాదు. నా నవ్వుచూసి నేనేదో తమాషా చేస్తున్నానని తెలుసుకొని "సరే, కానీండి, తప్పుతుందా?" అన్నాడు.

"ఇంట్లోకి వెళ్ళి మీ పిన్ని నడిగి కొంత కుంకం తెచ్చి నాకు బొట్టు పెట్టండి" అన్నాను, గంభీరంగా ముఖం పెట్టి. జగదీశ్ క్షణకాలం అయోమయంగా చూసేడు.

"నన్ను పరీక్షిస్తున్నారా, భారతీ. లేక నా బలహీనతకి పరిహాసిస్తున్నారా?"

"మీ రెందు కలా అనుకొంటున్నారు?"

"ఆ రోజు నిర్మల హృదయంతో అంతగా బ్రతిమాలితే సమ్మతించని మీరు... మొన్న యింత జరిగేక స్వయంగా వచ్చి..."

"అంత జరిగింది కాబట్టే నన్ను నేను తెలుసుకొని ఈ నిర్ణయానికి రాగలిగేనేమో, జగదీశ్! అలా జరగకపోతే యిలా జరగబోదనికాదు. ఈ కాయ పక్వానికి రావడానికి యింకా కొంత కాలం పట్టి వుండేది."

"భారతీ, మీరు ఈ వివాహానికి మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నారా? లేకపోతే మిమ్మల్ని యిరుకులో పెట్టి ఒప్పించేనన్న బాధ నన్ను విడిచిపెట్టదు."

"ఎంత అమాయకులు మీరు, జగదీశ్! నా వంటి ఆడది ఎంత ఆలోచించి ఒక నిర్ణయానికి రాకపోతే ఈ విధంగా ఒక మగవాడి ముందు 'నన్ను స్వీకరించు' అని నిలబడుతుంది? తను ఆదరిస్తాడనుకొన్న ఆ పురుషుడు తిరస్కరిస్తే ఆమెకు చావుతప్ప మరేదైనా మార్గం ఉంటుందా?

"ఆ నాటి మీ అభ్యర్థన నా మనసులోంచి చెరిగిపోలేదు, జగదీశ్. కాని చెయ్యి ముందుకి చాచేందుకు ఇంతవరకూ తెగింపు కలగలేదు. మీ మాట మీద నమ్మికతో ఈ మాట తెల్పేందుకు వచ్చేను. నా నుదుట తిలకం దిద్దుకొందుకు మీ చెయ్యి ఆసరా కావాలి."

ఒక్కసారిగా నా రెండుచేతులూ పట్టుకొని, "ఇది శిక్ష కాదు, భారతీ! ఇది వరప్రదానం!" అన్నాడు జగదీశ్ ఆనందంతో.

"శిక్ష అమలు జరిగేదాకా ముద్దాయి దూరంగా ఉండాలి!" చేతులు విడిపించుకొని బుగ్గమీద చిటికె వేసేను.

*　　　　*　　　　*

అందరి అంగీకారంతోనే వివాహం జరిగేలా ప్రయత్నించా లనుకొన్నాం. "అప్పుడుకి ఈ కారణంగా దూరమైతే భావి జీవితం లోని పూర్తి ఆనందాన్ని పొందలేం. కాలి కింద ముల్లులా ఆ లోటు కరేల్ కరేల్ కరేల్ మంటూనే ఉంటుంది" అన్నాడు జగదీశ్.

ఆ నాటి సంఘటన మినహా మిగిలినదంతా తన పిన్నికి తెలియజేసేడు. "భారతి అన్నివిధాలా నాకు తగిన పిల్ల పిన్నీ! నీ ఆశీర్వాదంతో ఈ ఇంటి కోడలవుతుంది" అన్నాడు.

రెండు నిమిషాలపాటు ఆమె మౌనం వహించింది. ఆ స్వల్ప కాలంలో ఏ ఆలోచనలు ఆమెమనసులోకి వచ్చి ఉంటాయో చెప్పడం కష్టం. కంటిలో నిలిచిన నీళ్ళని తుడుచుకుంటూ అన్నది. "అలాగే కానీ: నాయనా" ఆమె మనస్సులో ఏమో అనుకున్న ట్టుంది; కాని అది నాకు వ్యతిరేకంగా మాత్రం కాదు అను కున్నాను.

ఇద్దరం కలిసి ఆమెకి ప్రణామం చేసేం. అప్పుడే నేను ఆ ఇంటి కోడలినైనంత స్వేచ్ఛగా ఇంట్లో తిరిగేను. జగదీశ్ తన వస్తువులను, చిన్ననాటి ఫోటోలను, తల్లిదండ్రుల జ్ఞాపకాలని తవ్వి తీసి చూపించేడు. కమ్మని బాదంఖీర్ చేసి కూతురిచేత పంపించింది జగదీశ్ పిన్ని. ఆమె పేరు, అన్నట్టు, పంకజమ్మ.

"ఇప్పుడేందుకిదంతా?" అన్నాను.

"ఈ రోజు నా పుట్టిన రోజు. నా కిష్టం అని పిన్ని చేసింది. తినమని ఉదయం నుండి పోరుపెడుతున్నా తిండిమీద మనసు పోలేదు."

"అరె! ఈ రోజు మీ పుట్టిన రోజు అన్న సంగతే మరిచి పోయేను. మీ కీ రోజున ప్రెజెంటు చెయ్యాలని ఆ చిత్రాన్ని కష్ట పడి గీసేను. కాని, అది అలా పాడయి పోయింది." అన్నాను.

"పోనీలెండి! మీరు చిత్రించిన బొమ్మకు బదులు కనక

విగ్రహమైన మీరే దొరికారుగా నాకు" అన్నాడతను, ఉత్సాహంతో.

నా కొక కప్పు అందించి, తనొకటి చేతిలోకి తీసుకొన్నాడు జగదీశ్. చెమ్చాతో బాదంఖీర్ తీసి నోట్లో పెట్టుకోబోయేను. తటాలున చేయి కిందికి వాలిపోయింది. కప్పులోని బాదంఖీర్ సగానికి పైగా చీరమీద పడి చిందర వందరగా తుళ్ళింది.

జగదీశ్ నా కళ్ళలోకి చూసేడు. బలవంతాన ఆపుకొన్న కన్నీరు కంటి కొనల నుండి ధారలు ధారలుగా బుగ్గల మీదుగా జారేయి.

నా భావం గ్రహించి "మాధవ్‌కి బాదంఖీరంటే ప్రాణం. మేమిద్దరం ఎప్పుడు కలుసుకొన్నా బాదంఖీర్ యెక్కడ దొరికితే ఆ హోటల్లోనే కాఫీ, టిఫిన్లు, భోజనాలు చేసే వాళ్ళం. 'బాదంఖీర్ సముద్రంలో నన్నొక చిన్న పడవ మీద వదిలిపెడితే హాయిగా రాత్రీ పగలూ త్రాగుతూ ఉందును' అనే వాడు. 'ముఖం మొత్తుతుంది, జన్మలో బాదంఖీర్ పేరు తలవ్వ' అనేవాడిని. దీనిని చూస్తుంటే..." అంటూ జగదీశ్ మాటలు భారంగా ఆగిపోయేయి.

నాతోపాటుగా మాధవ్ జ్ఞాపకాలను మనసులో పెట్టుకొన్న వ్యక్తి జగదీశ్. అతని సాంగత్యంలో నాకు ఊరట కలుగుతుందనుకొన్నాను. కళ్ళు తుడుచుకుని, "మీ పిన్ని బాదంఖీర్ చేసేరు." అంటూ కప్పులో మిగిలింది పూర్తి చేసేను.

"మరికొంచెం పట్టుకు వస్తాను." అంటూ జగదీశ్ లేవబోతూ అన్నాడు.

"అంత తీపి ఒక్కసారిగా తింటే ముఖం మొత్తుతుంది. ఇప్పుడు కాదు; ఇంకో నాటికి" అన్నాను.

మనసు నిండిన మాటలతో కాలగమనం గుర్తుకి రాలేదు. బాగా చీకటి పడింది. మనకి తెలియకుండా కాలం దొర్లిపోవడం అంటే యిదే కాబోలు అనుకొన్నాను. గడిచిన మూడు రోజులు కూడా నే గుర్తించకుండానే గడిచిపోయేయి. కాని యిప్పటిలా కాదు; మనసుని, మనిషిని పీల్చి పిప్పి చేసే బాధతో.

నేను యింట్లో కాలు పెట్టేసరికి సర్కసు బోనులోంచి విడివడి, పెద్దపులి ప్రేక్షకుల మధ్యకి వస్తే వారిలో కలిగే సంచలనం లాంటిదే యింట్లో వున్నవారి మనస్సుల్లో తొక్కిసలాడింది. క్షణకాలం ఎవరూ మాట్లాడలేరు.

"మాటల్లో పడిపోయేము. ఇంతసేపైందని తెలియలేదు. చాలా ఆలస్యమయింది కాదూ? మీ భోజనాలయేయా?" అంటూ ముందుగా నేనే పలుకరించాను.

"ఎక్కడికి వెళ్ళేవు?" అంటూ నా మాట విననట్లే అన్నయ్య ప్రశ్నించేడు.

"జగదీశ్ ఇంటికి." అన్నాను నేను, ధైర్యంగానే.

"నువ్వేం చిన్నపిల్లవి కావు భారతీ, పదిసార్లు చెప్పించుకొందుకి. ఇలా ఎవ రేమనుకొన్నా లక్ష్యం లేనట్లు తిరిగితే ఎంతటి అపనిందలపాలవుతావో ఆలోచించావా?" అంటూ వదిన గట్టిగా మందలించింది. "తల చెడిన పిల్లవి. పరాయి మగాడితో కబుర్లూ, కాలక్షేపాలూ చేస్తున్నందుకే నలుగురూ నాలుగు రకాల అనుకొంటున్నారు. వద్దని నిర్బంధిస్తే నువ్వు మతిపోయిన దానిలా కూర్చుంటావని మేము చూసీ చూడనట్లు ఊరుకొంటున్నాం. వాళ్ళింటికి పోయి యింత రాత్రిదాకా వుండి వస్తే రేపొద్దున్న నలుగురిలో తలెత్తుకు తిరగాలా" అంటూ అత్తయ్య వదినకు వంత పాడింది.

"ఈ మూడు రోజులూ ఈ సాధక బాధకా లన్నీ బాగా ఆలోచించే నే నొక నిర్ణయానికి వచ్చేను అత్తయ్యా, నేను తిరిగి పెళ్ళి చేసుకోబోతున్నాను."

అక్కడ ఉన్న నలుగురూ అమిత ఆశ్చర్యంగా,ఒక్కసారిగా, "ఎవరిని?" అని ప్రశ్నించేరు.

"జగదీశ్ ని." అన్నాను నేను ధైర్యంగా.

"నీకు బుద్ధిలేదు. నువ్వేం చేయబోతున్నావో కనుకోకుండా లేకుండా ఉన్నావు!" అన్నాడు అన్నయ్య.

"భగవంతుడు నాకు ప్రసాదించిన బుద్ధితో ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చేను అన్నయ్యా. ఈ నాలుగేళ్ళ అనుభవంతో

పురుషుని ఆకర్షణ నుంచి తప్పుకోగల మనసు, వయసు నా కింకా లభ్యం కాలేదని తెలుసుకొన్నాను. మనసుని ఎదిరించి ఇదేవిధంగా జీవితం వెళ్ళబుచ్చుదామని ప్రయత్నిస్తే, ఏదో ఒక చెడు క్షణాన అవాంఛనీయమైన పరిస్థితి, అవకాశం సంభవిస్తే అణిచి ఉంచిన కోర్కెలు విజృంభిస్తే, నా పతనం తప్పదు. అటువంటి ఆపద రాకుండా, సురక్షితంగా నా జీవితం గడిచిపోడానికి నాకు పునర్వివాహం అవుసరం అనిపించింది. ఈ రోజుల్లో యిదేమంత చెయ్యరాని పనిగా పరిగణింపబడటం లేదు. దీనికి మీ అభ్యంతరం ఉండదనే ఉద్దేశంతోనే......"

"నువ్వు తిరిగి పెళ్ళి చేసుకుంటానంటే మా అభ్యంతరం ఏమీ లేదు, భారతీ! కాని, జగదీశ్ లాంటి ధనాశాపరుని మాత్రం చేసుకోకు. వాడి దృష్టి అంతా నీ డబ్బు మీదే. వాడు నీతో స్నేహం చేసిందే అందుకు. ఈ సంగతి నేను చాలా కాలం క్రిందటే గ్రహించేను. ఆ కారణంగానే వాడితో నీ స్నేహం ఆపు చెయ్యాలని చూసేను. కాని, నువ్వు తప్పుగా అర్థం చేసుకొన్నావు. నేను సంతోషంగా వుండడం అన్నయ్యకి యిష్టం లేదనుకొన్నాను. జగదీశ్ పథకం బాగా పారినట్టుంది భారతీ! తలచినదంతా తలచినదంతా సాధించుకొంటున్నాడు."

"నాపై ఎవరు అభిమానం చూపుతున్నా నా డబ్బుని చూసే అని నాకు తెలుసు అన్నయ్యా. గడిచిన కాలం నేర్పిన అనుభవాన్ని ఆకళింపు చేసుకుంటే, అది లేని మనిషి తారసపడడం కష్టమేమో అనిపిస్తున్నది. ఎక్కడైనా అటువంటి మనిషి వుంటే, అతడు జగదీశ్ అనే నా నమ్మకం" అన్నాను.

అక్కడవున్న నలుగురికీ చెంపదెబ్బలా తగిలింది నా మాట. ఆ అదురుపాటుకి తట్టుకొని ముందుగా వదిన నోరు తెరిచింది. "డబ్బు విషయంలో నీకు నమ్మకమున్నా, జగదీశ్‌ని పెళ్ళి చేసుకోవాలనుకోడంలో విజ్ఞత లేదనిపిస్తున్నది భారతీ! జగదీశ్, మాధవ్ స్నేహితులు. అతడి సామిప్యంలో నీకు మాధవ్‌తో గడిపిన జీవితం మరీ మరీ గుర్తుకు వచ్చే అవకాశం ఉంటుంది. అది నీ ఆనందానికి అడ్డుగా నిలుస్తుంది. ఆ జీవితంనుంచి దూరంగా పోయి

కొత్త జీవితం ఏర్పరుచుకోవాలనుకుంటున్న నువ్వు ఆ జీవితంతో సంబంధం లేని వ్యక్తిని ఎన్నుకోంటే మంచిదనుకొంటాను."

"నీ వన్న మాట నిజమే వదినా! జగదీశ్ మాటలలో మాధవ్‌ను గురించిన జ్ఞాపకాలు చాలా దొర్లుతుంటాయి. ఒక విధంగా అది నాకు తృప్తినిస్తుంది. నాతోపాటుగా మాధవ్ స్మృతులను జ్ఞప్తిలో ఉంచుకొన్న వ్యక్తి నా మానసిక పరిస్థితిని అర్థం చేసుకొని అటువంటి సమయంలో సానుభూతితో ప్రవర్తించ గలడు. సంతోషానికైనా దుఃఖానికైనా నాతోడు కావాలికదా వదినా? జగదీశ్ దగ్గర నాకా ఓదార్పు లభ్యమవుతుంది" అన్నాను.

"నీకు అన్నివిధాలా నచ్చితే మేము కాదనే దేముందమ్మా. మాకొక్కటే వలసింది నువ్వు సుఖంగా, సంతోషంగా ఉండడం. ఏనాడూ మేము కోరుతున్న దంతే" అన్నాడు మామయ్య, ఈ సంభాషణకి ముగింపు వాక్యంలా.

ఏదో కారణంగా అన్నయ్యకీ, వదినకీ ఈ పెళ్లి యిష్టంలేదు. అత్తయ్యా, మామయ్యా, కాదనేందుకేం ఆధారంలేక, అవునని తల వూపేరు. అందరిమధ్యా కలిసినట్టుగా ఉన్న ఆలోచనఒక్కటే. 'మనం కాదన్నా యిది మానే రకం కాదు. ఎందుకు రొష్టు పడడం?' అని.

సాధారణంగా పుట్టిల్లు చేరిన వితంతువులకి ఉండని అధికారాన్ని నాకు నా డబ్బు సంపాదించి పెట్టింది. దానిచుట్టూ మనుషుల్ని తిప్పుకోవాలనే ఉద్దేశ్యముంటే ఎంత వినోదమైనా పొంద వచ్చును. కాని ఆ డబ్బు ప్రమేయం లేని జీవితం కావాలని నా తపన. దానిలోభంలో పడి ఆప్తులు నన్ను మరిచిపోయేరు. నా వారిముందు నా కన్నా నా డబ్బు ఎక్కువ విలువ సంపాదించు కోవడం నాకు కష్టమనిపించింది.

అందుకే జగదీశ్‌తో కలిసి నే గడపబోయే జీవితంలోని ఆనం దాన్ని ఆ డబ్బు కప్పివేయకూడదనుకొన్నాను. దానిని ఏదైనా బాంకులో ఫిక్స్‌డ్ డిపాజిట్టులో చాలాకాలం నిలిచి ఉండేలా పడే యాలి. మా వార్ధక్య దశలోనో, పిల్లల పెళ్లిళ్ళూ, పేరంటాలకో అవసరమైతే అది వాడుకోవచ్చు. నాతోపాటు నా సవతిలా అది ఇంట్లో కాలు పెట్టకూడదు. కొత్త సంసారంలో జగదీశ్ దృష్టి అంతా నా మీదే ఉండాలి; ఆ డబ్బు మీద కాదు-అనుకొన్నాను.

# 8

నెల రోజులు ఉత్సాహంగా గడిచిపోయాయి. మూలపడి ఉన్న నా నగల్ని, పట్టు చీరల్ని తీసి శుభ్రం చేసుకోవడం లోను,నూతన జీవితానికి కావలసిన వస్తువులు సమకూర్చుకొనడం లోనూ రోజులు నిమిషాల్లా దొర్లిపోయేయి.

వివాహం నిర్ణయ మయేక నేను ముఖానికి బొట్టు పెట్టు కొన్నాను. తల్లో పువ్వులు పెట్టుకొన్నాను. మనసైన చీరలు కట్టుకుంటూ ఇంటా బయటా ఏ సంకోచం లేక తిరగసాగేను. నాలో కలిగిన ఈ మార్పు చూసి వదిన ఆశ్చర్యపోయింది. మాధవ్ పట్ల నాకుండే అనురాగం, ప్రేమ వదినకి తెలియనివి కావు.

"నీ గుండెను ఇంత బలంగా ఎలా పెంచుకొన్నావు భారతీ! మొదటిసారి బొట్టు పెట్టుకొంటుంటే, నీ చేతులు వణకలేదా? పూలు ముడుచుకొంటున్నప్పుడు నీ మనసు నీరై మాధవ్‌తో గడిపిన జీవితం, అతని దుర్మరణం తలపుకి రాలేదా?" అని ప్రశ్నించింది. "ఈ నెలరోజులూ మాధవ్ తలపుకిరాని క్షణంలేదు వదినా! కాని బాధతో కాదు, సంతోషంతో. మాధవ్‌కి నేనంటే ఎంత అభిమానమో నాకు మాత్రమే తెలుసు. నిజంగా అతని ఆత్మ ఏ లోకాల్లోనైనా సంచరిస్తూ వుంటే, ఈ వార్త విని సంతోషిస్తుందని నా నమ్మకం. ఈనాటి నా రూపు చూసి ఆనందిస్తుంది. నేను జీవితం పొడుగునా తన్ను తలుచుకొంటూ ఏడుస్తూ కూర్చోవాలనేటంత స్వార్థం మాధవ్ ప్రేమలో లేదు వదినా! అతను ఎప్పుడూ నా సుఖం, నా సంతోషం కోరేవాడు," అన్నాను, చాలా విశ్వాసంతో.

ముందురోజు అనుకొన్న ప్రకారం నాలుగు గంటలకి జగదీశ్ ఇంటికి బయలుదేరేను. వీధి చావిట్లో తన కొత్తబట్టలు చూసుకొంటూ కనిపించింది రమణి.

"ఓహో! కొత్తబట్టలా! చాలా బాగున్నాయే," అన్నాను, ఆ పిల్ల భుజం తట్టుతూ.

"బజార్లో ఇంకా చాలా మంచివి ఉన్నాయి," అంది రమణి నిరుత్సాహంగా.

"మరి కొనుక్కోలేదేం," అని ఓదార్పుగా అన్నాను.

"అన్నయ్య దగ్గర అంత డబ్బు లేదుట," అంటూ, ప్రపంచంలో ఉన్న పేదరికం అంతా తనే అనుభవిస్తున్నట్లు ముఖం పెట్టి, అంది.

"అలాగా?" అన్నాను - రమణి కో మంచి గౌను కొని తేవాలి అని మనసులో అనుకుంటూనే.

ఉన్నట్లుండి రమణిలో చురుకుపాలు ఎక్కువయింది.

"వదినా...వదినా! నీ పెళ్ళయేక నాకు చాలా చాలా మంచి బట్టలు కొంటావా? ఇంకా బంగారం గాజులు, నీ మెడలో ఉన్నలాటి నెక్లే..."

ఆ పిల్ల ముఖం ఉత్సాహంతో ఊగులాడింది.

"అల్లాగే! నీ కేమేం కావాలో చెప్పు. అన్నీ కొంటాను," అన్నాను.

రమణి ఆనందంతో ఇంకా మాట్లాడసాగింది.

"నీ దగ్గర చాలా డబ్బుందికదూ!" అని ప్రశ్నించింది చురుగ్గా.

"ఎవరు చెప్పేరు?" అన్నాను. నా కాళ్ళకింద నేల ఉన్నపాళంగా క్రుంగినట్లనిపించింది. నే పట్టుకోబోతున్న కొమ్మ విరిగి తలపై పడినట్లనిపించింది.

"మా అమ్మ చెప్పింది," అన్నది రమణి.

"ఏమని?"

"అన్నయ్యని పీక్కుతింటే వాడేం కొనగలడే? వాడిదగ్గర అంత డబ్బుందా? మీ వదిన్ని మంచి చేసుకో. నువ్వు కోరినవన్నీ

కొనిపెడ్తుంది - అంది. మరి, వదినా! అక్కయ్యకి కూడా నీ లాటి నెక్లెసు, చీర కొంటావా?" నేను కట్టిన పట్టుచీరని పట్టి చూస్తూ అంది రమణి.

"అమ్మ సరదాకి అని వుంటారు రమణీ! నా దగ్గర అంత సొమ్ము లేదు. అయినా ఫరవాలేదులే. నీ కొక్కవలసినవన్నీ నే కొని పెడతాను. అన్నయ్య జీతం వస్తుంది కదా! అన్నయ్యతో చెప్పి నీ కిలాటి నెక్లేసు తప్పక చేయిస్తాను," అన్నాను.

"మా వదిన చాలా మంచిది," అంటూ నా రాక తల్లికి తెలిపేందుకు ఇంట్లోకి పరుగుతీసింది రమణి.

ఆనాడు జగదీశ్ మా పెళ్ళి గురించి చెప్పినవెంటనే, వితంతువు నని ఏ పాటి సంకోచం లేకుండా పంకజమ్మ ఒప్పుకోనడం చూసి ఆమెది ఎంతో విశాలహృదయం అనుకొన్నాను. మారుతున్న కాలంతోపాటు ముందడుగువేసే తత్వం; బూజుపట్టిన ఆచారాల కోసం పాకులాడే మనిషి కాదు అని సంతోషించేను. అటు తరవాత నెల రోజులుగా నా పట్ల ఆమె చూపుతున్న అభిమానంతో, ఉక్కిరి బిక్కిరై పోయేను.

"నీలాటి పిల్ల మా ఇంటి కోడలు కావడం మా అదృష్టం, భారతి! ఆనాడు విశ్వామిత్రుని తపోభంగానికి మేనక దివినుండి భువికి దిగివచ్చినట్లే మా జగదీశ్ బ్రహ్మచర్యం వదిలించేందుకు బ్రహ్మ ఈ అందాల రాశిని సృష్టించేడు," అనేది. ఆ మాటలు ముఖస్తుతితో కూడివున్నా, అందులో ఎంతో కొంత ఆప్యాయత కూడా లేకపోలే దనిపించేది.

నలుగురు పిల్లల తల్లి పంకజమ్మ సవితి కొడుకు ఒక విధవరాలిని పెళ్ళి చేసుకుంటానంటే వెంటనే ఏ సంకోచం లేకుండా ఎందుకు ఒప్పుకొందో అర్థమయింది. రక్త సంబంధాలకి, బాంధవ్యాలకి కట్టుబడి వుండే కొడుకు డబ్బుగల విధవరాల్ని పెళ్ళాడితే, దానివల్ల లాభం పొందేవారిలో తన పిల్లలూ వుంటారు. మగపిల్లల చదువు సంధ్యలకి, ఆడపిల్ల పెళ్ళికి ఇంక ఆరాట పడ నక్కరలేదు.

ఇటునుండి భారతి యింట్లో కాలుపెడితే అటు నుండి ఆర్థిక

సమస్యలు వెళ్ళిపోతా యనుకొని వుంటుంది. ఆ స్వార్థానికి తేనె పూసిన పొగడ్తలనే మాత్రలని నా చేత అభిమానంగా మింగిస్తూ తన పబ్బం గడుపుకోవా లనుకొంది. కోడల్ని మంచి చేసుకొని డబ్బు గుంజుకోవా లనుకొంది. అందరిదీ ఒకటే ధ్యాస. ఎలాగైనా భారతిని మాయచేసి ఆ డబ్బు కొస్తా చేజిక్కించుకో గలిగితే...

రమణి వెనకగా, కాఫీ కప్పులతో పంకజమ్మ చావిట్లోకి వచ్చింది. "కూర్చో అమ్మాయి! అబ్బాయి ఇప్పుడే వచ్చేస్తాడు. బజారు కెళ్లా లనుకొన్నారుట కదా?" అంది, కాఫీ కప్పు టేబిలు మీద పెడుతూ.

"ఇప్పుడు కాఫీ వద్దండీ. తాగే వచ్చేను," అన్నాను.

"ఒకసారి తాగుతే నేం? కాఫీయేగా! పైగా నీ కోసం ప్రత్యేకం స్ట్రాంగ్ గా కలిపి తెచ్చేను" అంటూ ఎంతో అభిమానం ఒలికిపోతున్నట్లు అంది.

"ఏమైనా ఇప్పుడు తాగలేనండీ, తాగాలని లేదు," అన్నాను.

అది వరకు చాలాసార్లు ఆమె నాచే బలవంతంగా చాలా పనులు చేయించింది. కాని, ఆ పద్ధతి యింక చెల్లదనీ, తను చూపే అభిమానానికి వెనక ఉన్న కారణం నేను తెలుసుకున్నా ననీ ఆమెకి తెలియజేయ్యడమే నా తిరస్కృతిలోని భావం.

"సరే, నీ యిష్టం. ఆ పుస్తకాలు చూస్తూండు. నా కింట్లో పనుంది," అంటూ ముఖం మాడ్చుకొని వెళ్ళిపోయింది ఆవిడ. ఏవో రెండు కబుర్లుచెప్పి, స్నేహితురాళ్లు ఆటలకి రాగా, వెళ్ళిపోయింది రమణి.

కాస్తసేపు పత్రికలు తిరగవేసేను. ఏమీ చదవ బుద్ధికాక గదిలో అటూ అటూ పచార్లుచేసేను. జగదీశ్ టేబిలు మీద చిందర వందరగా కాగితాలు, ఉత్తరాలు, పుస్తకాలు పడివుంటే సర్ది పెట్టేను. జగదీశ్ తన స్నేహితుల కందరికీ మా వివాహ విషయం వ్రాసేడు లాగుంది. తలోకరీతిగా వ్రాసిన జవాబులు చాలా పడి వున్నాయి టేబిల్ మీద. ఈ వివాహం విషయమై జగదీశ్

స్నేహితుల అభిప్రాయాలు ఎలా ఉన్నాయో తెలుసుకోవా లని పించింది.

కొందరు రెండే మాటలలో, తాము పెళ్ళికి రాలేక పోతున్నందుకు తమ విచారం వెల్లడించేరు. "మరి కొందరు రాగల మని ఆశిస్తున్నాం," అంటూ ఆశాభావం వ్యక్తంచేసేరు.

"మరీ డాబులు కొట్టకు జగదీశ్! నీ కాబోయే పెళ్లాం అంత అందంగా వుందా? ఇంతదూరం నుంచి వీడు వచ్చి చూడ గలడా అని తమాషా చెయ్యబోయేవో, చూసుకో నా తడాకా. తల తాకట్టుపెట్టి అయినా బయలుదేరి వచ్చేస్తాను-" విదేశాలలో ఉన్న ఒక మిత్రుని బెదిరింపు.

"అయ్యా బక స్వాములవారూ! తమ బక ధ్యానమంతా ఈ తళుకుల చేపకోసమా? యింత కాలంగా తవారు వర్ణించే ఆర్థిక సమ స్యలు, దేశ జనాభా సమస్యలు, బాధ్యతలు, బరువులు, చదువులు, పెళ్ళిళ్ళు ఎక్కడికి పోయేయి? 'దాసరి పదం ముష్టితోసరి' అన్నట్లు అందమైన అమ్మాయి కనిపించగానే ఆవిరై పోయేయా?" అని యింకొక ఉత్తరంలోని సారాంశం.

"తన్నితే బూర్లగంపలోపడ్డ నిన్నెలా అభినందించాలో తెలి యడం లేదు, బ్రదర్. బా బ్బాబు! నాకూ ఒక బ్యూటిఫుల్ యంగ్ విడోని...అఫ్ కోర్స్ డబ్బుకూడా మస్తుగా వుండాలి. చూసి పెట్టేవంటే నీ కెంతేనా పుణ్యం వుంటుంది. ఉన్న పాళంగా వచ్చి నీ కాళ్ళముందు వాలుతాను,"—అదృష్టం తనని వరించలేదే అని ఒక అభాగ్యుని ఆరాటం.

"నీ ఉత్తరం అందుకొని ఆకాశమంత ఎత్తు ఎగిరేను జగదీశ్. భారతీ, నువ్వూ భార్యాభర్తలు కాబోతున్నారంటే నా ఒడిలో నిధినిక్షేపాలు పడ్డంత ఆనందమయింది.

"ఇదివరలో చెప్పించి, ఒప్పించి భారతీదేవి నా మిల్లులో భాగం తీసుకొనేలా చేస్తాననేవాడివి. మరి ఇప్పు డా బెడద లేదు కదా? కాంతా కనకాలకి హక్కుదారుడివి కాబోతున్నావు. ప్రయత్నాలు మొదలు పెట్టనా? ఏడాదిగా నే కంటున్న కలల కో రూపు దిద్దనా?"

ఈ ఉత్తరం మడిచి పెడుతుంటే జగదీశ్ వచ్చేడు.

"ఎవరేమిటి ఈ రమణ?" అన్నాను.

"హైస్కూలు రోజుల్లో నా క్లాసుమేట్. అనుకోకుండా ఆమధ్య వైజాగ్ లో కలుసుకొన్నాము."

"ఏమిటి, మిల్లు, భాగం అంటూ డేమిటి? అందులో నా పేరు ఎలా వచ్చింది?" అని జగదీశ్ ని ఏకదీక్షగా చూస్తూ ప్రశ్నించేను.

ఏపాటి తడబాటూ లేకుండా జవాబు చెప్పేడు జగదీశ్.

"అదా...పుట్టుక బ్రాహ్మణ పుట్టుక అయినా అన్నీ కోమటి బుద్ధులే వాడివి. వ్యాపారంలోనే డబ్బు గణించ బడు తుంది. ఉద్యోగం ఎంతకాలం చేసినా నాలుగురాళ్లు వెనకబడవు-" అంటాడు. రెండేళ్ళ క్రిందట తండ్రి మరణంతో, ఉన్న ఆస్తంతా అమ్మి ఒక పేపరుమిల్లు పెట్టాలని డబ్బు ముందు పెట్టుకొని కూర్చు న్నాడు. పెట్టుబడి అంతటికీ వాడిదగ్గర సొమ్ములేదు. వాటాదారులు కావాలి. 'తెలిసిన వారెవరైనా ఉంటే చూడరా' అంటూ ఉత్త రాలు రాసి పంపుతుంటే మీ పేరు చెప్పేను. మీకటువంటి ఉద్దేశం ఉన్నట్లు సారథి ఒకటి రెండుసార్లు నాతో అన్నాడు. ఆ విషయం గురించి మిమ్మల్ని అడగా లనుకొంటుండగానే కథ ఇలా తిరిగింది," అని తేలిగ్గా నవ్వుతూ అన్నాడు జగదీశ్.

కథ ఇలా తిరిగిందని అతడంటుంటే, డబ్బు నా చేతిలో పడింది - అన్నట్లు అనిపించింది నాకు.

"నా కటువంటి ఆలోచనలేం లేవు జగదీశ్! ఈ విషయం మీ స్నేహితుడికి వ్రాయండి. మీరుకూడా దాన్ని గురించి మరిచి పోవడం మంచిది," అన్నాను, కాస్త కటువుగానే.

"ఇప్పుడు అనగానే అయిపోయిందా భారతీ! మనం మాత్రం డబ్బుని భూమిలో పాతర వెయ్యబోవడం లేదుగదా. ఏది లాభసాటిగా ఉంటుందని తోస్తే అలాగే చేద్దాం. తొందరేముంది?" అన్నాడు.

ఆ ప్రస్తావనను అంతకన్న పొడిగించడం ఇష్టం లేకపోయింది. కంటిలోని నలుసులా కరకర మన్నది ఈ సంఘటన.

"బజారుకి వెళ్లా లనుకొన్నాం గదా? త్వరగా ఆ పని

పూర్తి చేసుకొని తిరిగివస్తే, ఈ రోజు అందరం డాబ పైన వెన్నెల భోజనాలు చేద్దాం అంటున్నది పిన్ని."

"ఈ రోజుకి షాపింగ్ వద్దు, జగదీశ్. తల నొప్పిగా వుంది. ఆ మాట చెప్పి వెళ్ళిపోవాలనే ఇప్పటి వరకూ కూర్చు న్నాను," అన్నాను.

"అరే. ఏమయింది? రాత్రి నిద్ర సరిగా పట్టిందా? మందు తెస్తాను. వేసుకొని కాస్తసేపు కళ్ళు మూసుకొని పడుకొంటే..."

"ఇప్పుడేం వద్దు, బడలికగా ఉంది. అంతకన్న మరేం లేదు. యింటికి వెళ్ళిపోతాను," అంటూ మాట పూర్తి చేస్తూనే కాలు కదిపేను.

వెళ్ళిపోయే ముందు పంకజమ్మతో చెప్పి వెళ్ళే అలవాటు వుంది. ఆ రోజు వంట యింటివైపు కన్ను తిప్పలేదు. మరుగుతున్న కుండెడు పాలలో ఒక్క మజ్జిగచుక్క పడినట్లు డబ్బు ప్రస్తా వనతో నా ఆనందం అంతా విరిగిపోయింది.

"అదేం, భారతి అలా వెళ్ళిపోతున్నది?" - అన్నది ఆమె ఆశ్చర్యంతో.

"ఒంట్లో సరిగా లేదుట పిన్నీ," అన్నాడతను.

"ఈ రోజు వచ్చిన దగ్గర నుంచీ అలాగే వుంది. తన కోసం ప్రత్యేకం కాఫీ కాచి తెస్తే ససేమిరా తాగనంది. ఏమయిందో మరి?" అనే పంకజమ్మ మాటలు వీధిలోకి మెల్లగా వినిపించేయి. 'నా కయింది కేముంది? అంతా చేస్తున్నవారు మీరు. నా బ్రతు కుతో ఆటలాడుతున్నది మీరు అనుకొన్నాను.

నా బ్రతు కెందుకిలా అయింది? నే నేం పాపం చేసేను? నమ్మినవారంతా నన్నెందు కిలా అవమాన పరుస్తున్నారు? వారికి నాతో ఏం సంబంధం లేదా? అంత అనుబంధం నా డబ్బుతో నేనా? రాత్రి నిద్రలేక పక్కమీద దొర్లుతూ పిచ్చిగా జుట్టు పీక్కున్నాను.

ఈ యజ్ఞానికి దూరంగా ఉన్నాడనుకున్న జగదీశ్ అందరి కన్నా ముందుగా నన్ను తన స్వార్థానికి బలిచేయ బోతున్నాడా? జగదీశ్ కి నా కన్న ముందుగా నా డబ్బుతో స్నేహమయిందా? ఈ

స్నేహానికి మూలకారణం, ఈ వివాహంలోని ముఖ్య తంత్రం అంతా డబ్బులోనే ఉందా? అతడి ఆకర్షణంతా నన్ను గురించి కాదా? నా డబ్బులోనా? ధనమూల మైనదేనా ఈ అనురాగం, అభిమానం? బాధతో మెలికలు తిరిగింది మనసు.

'జగదీశ్ వంటి ధనాశా పరునితో నువ్వు సుఖపడలేవు భారతీ!' అని అన్నయ్య అన్న మాటలో అర్థం తెలిసివచ్చింది. నీ డబ్బుకోసం ఇక్కడికి బదిలీ చేయించుకు వచ్చేడు అన్న వదిన మాట నిజం; మేకతోలు కప్పుకొని మెల్లగా మందలో చేరి నాతో స్నేహం చేసేడు జగదీశ్. పెళ్ళవగానే ఆ తోలు తీసిపారేసి తన నిజరూపం చూపి కబళించా లనుకొన్నాడు. ఆలోచనలకే ఇంత భయంకరంగా వున్న ఆ జీవితం దగ్గర పడుతున్నది. దాన్ని ఆహ్వా నించేందుకు, అనుభవించేందుకు నేను సిద్ధంగా వున్నానా?

*　　　　*　　　　*

రాత్రి అంతా తెగని ఆలోచనలు తెల్లవారేసరికి తేలి పోయేయి. చిక్కని రాత్రిలో, తలుపులు మూసిన గదిలో చీకటి దెయ్యాల్లా అపోహాలు రేపిన ఆలోచనలు సూర్యకాంతితో మంచులా కరిగిపోయేయి.

అంతా నా భ్రాంతి. జగదీశ్ అటువంటివాడు కాడు. ఎవడో కొక్కిరాయి వ్రాసిన ఉత్తరం పట్టుకొని జగదీశ్ ప్రేమని అనుమానించడంలో అర్థంలేదు. అతడికి నేను, నాకు అతడు కావాలి. ఈ డబ్బు ఏ ఊబిలో కూరుకుపోయినా మాకు లక్ష్యం లేదు. మా బ్రతుకుల్ని, మా ప్రేమని కలుషితం చేసే శక్తి దానికి లేదని మనసుకి సమాధానం చెప్పుకొన్నాను.

ముందురోజు మానుకొన్న షాపింగు ఆ రోజు పూర్తిచెయ్యా లనుకొని అవసరమైన డబ్బు హాండ్ బ్యాగ్‌లో పెట్టుకొని బయలు దేరేను.

"ఎవరు, భారతా?" అంది పంకజమ్మ తలుపుతీస్తూ.

"జగదీశ్ వున్నారా?"

"ఏదో పనుందిట, ఆరు గంట లైతేకాని రానన్నాడు. నువ్వు ఈ వేళప్పుడు వస్తావని వాడికి తెలుసా?"

"నిన్న వెళ్ళిపోయే ముందే అనుకోలేదు. మరేం మించి పోయింది లేదు. జగదీశ్ వచ్చేకనే బజారుకి వెళ్లొచ్చు. ఈ రాత్రికి నా భోజనం ఇక్కడే అత్తయ్యా. నా కోసం ప్రత్యేకం మీరేం చేస్తారో," అన్నాను.

ముందురోజు మనసులో నింపుకున్న మాలిన్యం అంతా ఆ రోజు పూర్తిగా కడుక్కుపోవాలని నా ప్రయత్నం. నా మాటతో ఆవిడమనసు తేలికపడినట్లే అనిపించింది. నాకు కాఫీ ఇచ్చి ఆవిడ వంట ప్రయత్నంలో పడింది.

తిన్నగా జగదీశ్ గదిలోకి దారితీసేను. ముందురోజు నేను సర్దిన పుస్తకాలు, ఉత్తరాలు దొంతులుగా అలాగే వున్నాయి. ఆ రోజు వచ్చిన రెండు ఉత్తరాలు మాత్రం పేపర్ వెయిట్ కింద పెట్టి వున్నాయి. వాటిపక్కనే, పైకి కొద్దిగా కనిపిస్తూ, పుస్తకం లోకి దూర్చి పెట్టిన ఒక కాగితం వుంది. నా కోసం జగదీశ్ ఏమైనా వ్రాసి పెట్టేడేమో అని పైకి తీసేను.

అది తన మిత్రుడు రమణకి వ్రాసి, పోస్టు చెయ్యడం మరచిన ఉత్తరం. ముందురోజు రమణ ఉత్తరం చూసేక దానికి ఏ విధంగా జగదీశ్ జవాబు వ్రాసేడో తెలుసుకోవాలన్న ఆత్రంతో కాగితం అటునుండి ఇటు తిప్పేను.

చాలావరకు, కానున్న తన పెండ్లి ముచ్చట్లను గురించి వ్రాశేడు జగదీశ్. అక్కడక్కడ ఉన్న నా అందచందాల వర్ణనలు నా కొంచెం గర్వాన్ని కలిగించేయి. జగదీశ్ దృష్టిలో నా రూపుని చూసుకొని మురిసిపోతూండగానే మనసులో మసక చీకటి ముసురుకొంది.

"మొన్నటి నీ ఉత్తరానికి జవాబు వ్రాస్తుంటే నీ రెండో ఉత్తరం అందింది. నువ్వు మరీ యింత హంగామా చేస్తే ఎలా చెప్పు? అన్నీ ఒక ప్లాన్ ప్రకారం జరుపుకొంటూ పోవాలి కాని, ఊరకనే తొందరపడితే పనులు సవ్యంగా కావు.

"నీ వ్యాపారంలో భాగం పెట్టడం యిష్టం లేకా, నీ మీద నమ్మకం లేకా నేను మౌనం వహించలేదు. ఇప్పుడిప్పుడే నా ఆశ లకి, ఆలోచనలకి ఒక రూపు తేలుతున్నది. జీవితం ఒక చదరంగం

అటలాటిది రమణా! జాగ్రత్తగా బలాన్ని నప్పుకొంటూ పోవాలి. ఒక తప్పు ఎత్తుతో ఆ టంతా నాశనమై రాజు బందీ అయిపోయే ప్రమాద ముంటుంది.

"భారతి ఈ వ్యాపారాల పట్ల ఎందుకో విముఖత చూపు తున్నది. అందుచే వెంటనే అంటే నే నేం చెయ్యలేను. ఆమె డబ్బుని ఆమె యిష్టానికి వ్యతిరేకంగా నేను ఖర్చు చెయ్యలేను కదా?

"వివాహం పూర్తయేక మంచి చెడ్డలు చూసి ఆమెని ఒప్పించగలననే ధైర్యం నాకుంది. కాదూ కూడదూ అంటూ ఎదురు తిరిగే రకం కాదు భారతి. మా సొమ్మే నీకు దానం చేయ మనలేదు కదా! మదుపు పెడతామో, లాభాలు పుచ్చుకొంటామో.

"నీ ఉత్తరంలోని ఆఖరి వాక్యం నన్ను ప్రలోభ పెడు తున్నది కూడా. రాత్రీ పగలూ అనక ఈ వెధవ ఉద్యోగాలు ఎంత చేసినా గొర్రెతోకలా ఎదుగూ బొదుగూ వుండవు. అటు వంటి అదృష్టం కలిసి వస్తే అంతకంటేనా! భాయీ, డబ్బంటే ఎవడికి చేదు? సిరి వస్తానంటే కాదంటూనా? నాలుగు నెలలు తిరిగే సరికి అన్నీ సర్దుకొంటాయి. మరి వుండనా?" అని వుంది ఉత్త రంలో.

రమణ వ్రాసిన రెండో ఉత్తరం కోసం గదంతా గాలిం చేను. అందులో జగదీశ్‌ని అంతగా ప్రలోభపెట్టిన మాట ఏమిటో తెలుసుకోవాలని నా ఆరాటం.

ఇతరుల ఉత్తరాలు చూడడం సభ్యతకాదని నాకు తెలుసు. అయినా నన్ను పట్టిన ఈ అనుమాన పిశాచం వదలాలంటే రమణ వ్రాసిన రెండో ఉత్తరం చూడాలి. ఉద్యోగం చెయ్యనక్కరలేకుండా సులభంగా డబ్బు కూడబడే మార్గం రమణ అందులో సూచించి వుంటాడు. దానికి

తాళం వెయ్యడానికి జగదీశ్ సిద్ధపడుతున్నాడు. వీళ్ళిద్దరూ ఆడ బోతున్న ఈ చదరంగంలో ఎత్తు లేమిటో నేను తెలుసుకోవాలి. వీళ్ళ బలాల మధ్య నేను బందీ కాకూడదు.

గదిలో బట్టలు, కాగితాలు, పుస్తకాలు చిందరవందరగా తయారయేయి. కాని ఆ ఉత్తరం కనిపించలేదు. కావాలనే జగదీశ్ దానిని దాచి పెట్టి వుంటాడు. లేక కాల్చివేసి ఉంటాడు. అందులో నేను చూడకూడని విషయం ఏదో వుండి వుంటుంది. నన్ను డబ్బుతో సహా యిరికించే పన్నాగం ఏదో వుండి వుంటుంది: అది జగదీశ్ కి సమ్మతమే అని అతడి జవాబు వల్ల తెలుస్తున్నది.

ఆలోచిస్తున్న కొద్దీ నాలో వేడి పెరగసాగింది. వేడితో ఓర్పు నశించింది. వెంటనే నాలో అనుమానం ఆక్రమించుకొంది. నిమిష నిమిషానికి రాక్షసిలా పెరిగి నా శరీరమంతా వ్యాపించింది. ఎందు కిలా జరిగింది? తెలిసి తెలిసి నే నెందు కీ బంధనాల్లో ఇరు క్కోవాలి? ఈ ధనాశాపరుని చేతిలో నా బ్రతుకు నెందుకు నాశనం చేసుకోవాలి?

జగదీశ్ రాలేదు. ఉత్తరం దొరకలేదు.

నమ్మిన వాళ్ళనే నాశనం చెయ్యాలన్న కోర్కె ఎందుకో ఈ మనుషులకి...అంతా ఒక్కటే. మోసం...అన్యాయం... అబద్ధం...వీళ్ళందరికీ కావలసింది డబ్బు...డబ్బు...డబ్బు...దాని కోసం గాలిలోకి బంతిలా నన్ను ఎగరేసి ఆడుతున్నారు. ఎవరి చేతిలో పడితే వాళ్ళకి దక్కుడు. కిందపడి కాలు విరిగితే... ప్రాణం పోతే? నా బాధ ఎవరికీ అక్కరలేదు. నా గోల ఎవరికీ వినపడదు.

ఈ ప్రపంచంలో నా కెవ్వరూ లేరు. నాకు నేనే మిగిలేను. మాధవ్, నీ దగ్గరికి నన్ను తీసుకుపో, నే నీ మనుష్యుల మధ్య బ్రతకలేను, నన్ను తీసుకుపో.

తల గోడకేసి బాదుకొన్నాను. కణతలు గట్టిగా నొక్కుకొన్నాను. జుట్టు పీక్కున్నాను. పగిలిపోతున్న తలలోంచి ఏదో శక్తి ఒళ్ళంతా ప్రవహించింది. మనసంతా మత్తుగా, ఒళ్ళంతా చల్లగా మారిపోయింది. క్షణంలో వేదనంతా హరించిపోయినట్లు అనిపించింది.

తల మునకలైన ఆవేశంతో తల్లడిల్లిపోయిన శరీరం ఇంక ఆ ధాటికి తట్టుకోలేనట్లు పట్టు విడిచింది. అవయవాలన్నీ ఒక పొంతనం అన్న మాట లేక వేటికి తోచినట్లు అవి పనులు చేసుకు పోసాగేయి. మనిషికి ఆలోచనలందించే మెదడు మొద్దుబారి పోయింది. మనసు మచ్చిక లేని గుర్రంలా అడ్డ దారులు పట్టింది. వేటినీ అదుపులో పెట్టే శక్తి నా కా క్షణంలో లేదు.

మెల్లగా వీధి తలుపు తీసుకొని రోడ్డు మీద నడక ప్రారంభించేను. మనసు ఏదో సలహా నిచ్చింది. కాళ్ళు ఎటో లాక్కుపోయేయి. ఎదురుగా కదలబోతున్న రైలు. గార్డుతో చెప్పి పెట్టెలో ఎక్కేసేను.

నేను చేస్తున్న పనిలోని ఔచిత్యం గురించి కాని, మంచి చెడుల గురించి కాని ఆలోచించే పరిస్థితిలో లేదు నా మనస్సు. నా వంటి ఆడపిల్ల ఒంటరిగా ఇంటి నుండి కాలు కదిపితే ఎన్ని ఇబ్బందులు ఎదురుకోవలసి వుంటుందో అన్న దృష్టే లేదు.

నా డబ్బు కోసం జలగల్లా పట్టుకొన్న ఆ మనుషుల మధ్య నుంచి తప్పుకోవాలి అన్న ధ్యాస తప్పితే ఆ సమయంలో యింకో ఆలోచన మనసులో దూరే అవకాశం లేదు. ఇంకో కోర్కె లేదు. ఇంకో భయం లేదు. ఎవరికీ అవసరం లేని ఈ బ్రతుకు ఎలా పరిణమిస్తేనేం అన్న నిర్లిప్తత అలుముకొంది.

హేండ్‌బ్యాగ్‌లో వున్న డబ్బూ, వంటిమీది నగలూ కొంత కాలం నన్ను నిలబెట్టగలవు. ఆటు తరువాత సంగతి ఎలా జరగ వలసి వుంటే అలా జరుగుతుంది అనుకొన్నాను.

రైలు వేగం హెచ్చి చల్లగాలి ముఖానికి తగలటంతో మనసు కొంత కుదటపడ్డది. అంత వరకూ మసక మసకగా కనుపించిన మనుష్యులు సరిగా కనిపించసాగేరు. అది సెకండ్ క్లాస్ పెట్టె. ఒక పక్కగా వున్న రెండు బెర్తులమీద ఏడెనమండుగురు మగాళ్ళు కూర్చొని ఉన్నారు. రెండోవైపు బెర్తు మీద ఎవరో ముసుగు తన్ని పడుకొన్నారు. దాని కెదురుగా వున్న దానిమీద ఒక ముసలాయనా, ముసలావిడా కూర్చున్నారు. మెల్లగా వెళ్ళి వారి పక్కన కూర్చున్నాను.

వెనక బెంచీలోని వారి మాటల్ని బట్టి ఆ పడుకున్న వ్యక్తికి జ్వరం అనీ, వారంతా ఒక జట్టుకు చెందినవారనీ తెలిసింది. రాత్రి పది గంటల వేళ ఆ జ్వరంలో వున్న వ్యక్తిని లేపి, కొంచెం పాలు త్రాగించేందుకు చాలా ప్రయత్నించేరు. కాని ఆ వ్యక్తి కళ్ళు విప్ప లేదు. నోరు తెరవలేదు. ఆ పాల లోటాని అక్కడే వున్న పెట్టె మీద పెట్టి ఎవరికి వారు నిద్రకి జోగేరు. నా పక్కనున్న ముసలావిడా, ముసలాయనా కూడా అలా కూర్చున్న పళంగానే కునుకు తీస్తున్నారు.

నాకు నిద్ర రాలేదు. గడిచిన రోజుల్ని, గడవబోయే కాలాన్ని ఆలోచిస్తూ అలా కూర్చున్నాను. జగదీశ్ ఇంటికి రాగానే నే చేసివచ్చిన బీభత్సాన్ని చూసి వుంటాడు. ఏం జరిగిందో అర్థం కాక తికమక పడతాడు. పోస్టు చెయ్య మరచిన ఉత్తరంతో తన నిజరూప దర్శనం అయిందనీ, దాని ధాటికి తట్టుకో లేక ఇలా దారీ తెన్నూ లేక పరుగులు తీస్తున్నాననీ అతనికి తెలియదు. కోపంతో అన్నయ్య ఇంటికి వెళ్ళిపోయా ననుకొంటాడు. అన్నయ్య జగదీశ్ యింట్లోనే వుండిపోయాననుకొని చిందులు తొక్కుతాడు. ఈ ముసుగులో గుద్దులాట బయట పడేసరికి దారి కందనంత దూరం వెళ్ళిపోతాను నేను. ఇటువంటి ఆలోచనలు నేను ప్రయాణం చేస్తున్న రైలుకన్న జోరుగా సాగిపోతున్నాయి. నేను చూడని ప్రదేశాలకి, నేను ఊహించలేని లోకాలకి లాక్కుపోతున్నాయి.

అర్ధరాత్రప్పుడు ఆ జబ్బు మనిషి "దాహం" అన్నట్లు ఏదో అన్నాడు. అంతా గాఢ నిద్రలో వున్నారు. ఎవరిని లేపేం దుకూ లేదు. ఏం చెయ్యనా అని నేను తటపటాయిస్తుంటే అతడు మళ్ళా "దాహం" అన్నట్టు మూలిగేడు. ఎదురుగా ఉన్న లోటాలో పాలు తెచ్చి అతడి నోటి దగ్గర పెట్టేను. అలా ఒత్తిగిలి పడుకునే నాలుగు గుక్కలు త్రాగాడు. తిరిగి మత్తుగా కళ్ళు మూసు కొన్నాడు.

నాకు పరిచయం, సంబంధం లేని ఆ వ్యక్తికి ఏమీ ఆశించ కుండా చేసిన చిన్న పనితో నా మనసు కేదో ఊరట కలిగింది. జీవితంలో సంతృప్తి పొందడానికి యిది కూడా ఒక మార్గమేమో అనిపించింది.

తెల్లవారేసరికి అతడి జ్వరం తగ్గిపోయింది. రెండవపూట మెల్లగా లేచి కూర్చున్నాడు. అతను ఒక సాధువు. మిగిలిన వారంతా అతని శిష్యులు. తీర్థయాత్రలు చేసుకొని తిరుగు ప్రయా ణంలో వున్నారు. ఆ శిష్యుల్లో అన్ని రాష్ట్రాలకి, అన్ని తరహాలకి చెందినవారు వున్నారు. భుక్తి కోసం కొందరూ, ముక్తి కోసం కొందరూ శిష్యులుగా చేరినట్లు అనిపించింది. అందరూ కలిసికట్టుగా వాంఛించేది గురువుగారి అనుగ్రహం. దానికోసం అతడు కన్ను తెరిచింది మొదలు "బాబాజీ...బాబాజీ..." అంటూ సపర్యలు చేస్తూ చుట్టు ముట్టేరు.

ఎదురుగా కూర్చుని బాబాజీని పరీక్షగా చూస్తాంటే ఎక్కడో చూసినట్లే అనిపించింది. ఎంత ఆలోచించినా గుర్తు మాత్రం రాలేదు. పేరు తెలుసుకొంటే జ్ఞాపకం రావచ్చని శిష్యుల్లో ఒకరిని ప్రశ్నించేను. ఇంత ప్రసిద్ధులైన బాబాగారిని తెలి యక పోవడమా అన్నట్లు నా వంక ఆశ్చర్యంగా చూసి "హృషీ కేశ్ బాబా" అన్నాడు మెల్లగా. ఆ పేరు వినగానే పాత జ్ఞాప కాలు తవ్వుకు వచ్చేయి.

మాధవ్‌తో వివాహం...ముసూరి...స్నోఫాల్...ఆనాటి సుందర స్వప్నం......ఈనాటి భగ్నజీవితం...గమ్యం లేని ప్రయాణం...ఒంటరితనం...

ఎదుట అందరు మనుష్యులు వున్నారన్న జ్ఞానమైనా లేకుండా రెండు చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చేను. సాగర తరంగాల్లా ఉవ్వెత్తుగా లేచిన దుఃఖం నన్ను పూర్తిగా వశం చేసుకొంది. అలిసిపోయేదాకా అలా ఏడుస్తూనే వున్నాను. "ఊరుకో తల్లీ! ఎంతకని ఏడుస్తావు." అని బాబాజీ మెల్లగా నా తల నిమురుతూ అన్నాడు.

ఆ మాటలో ఓదార్పు వుంది. ఆ స్పర్శలో ఆప్యాయత వుంది. ఒక వ్యథిత హృదయానికి తోడి మనిషి చూపే సానుభూతి వుంది అతని చూపులో.

బాబాజీ నా నుంచి ఏమీ ఆశించి నన్ను ఊరడించ లేదు. నా అందంతో, వయస్సుతో ఆ వృద్ధునికి నిమిత్తం లేదు. నా దగ్గర డబ్బు వుందని అతనికి తెలియదు. నగలన్నీ రైలు ఎక్కగానే తీసి హాండ్ బ్యాగ్‌లో పడేసేను. నిద్రలేక ఎర్రబారిన కళ్ళు, వ్యథా భారం వల్ల వాడిన ముఖం, రేగిన జుట్టు, నలిగిన చీర ఆ తీరులో వున్న నన్ను గురించి అతను ఆరా తియ్యగలిగింది ఏమీ వుండదు.

అయినా నన్ను సాటి జీవిగా ఓదార్చేడు. నాకు కావల సింది యిటువంటి ఆత్మీయతే; ఇటువంటి అభిమానమే. నన్ను నన్నుగా చూసి అభిమానించే వాళ్లు కావాలి. నా డబ్బుతో నిమిత్తం లేకుండా ప్రేమించ గలిగేవాళ్ళు కావాలి. ఎంత కాలంగానో వెతుకులాడుతున్న ఆత్మీయుల్ని కలిసిన అనుభూతి కలిగింది.

వెంటనే లేచి "బాబాజీ," అంటూ అతడి కాళ్ళు పట్టు కున్నాను. "నన్ను మీతో పాటు తీసుకు పొండి. మీ ఆశ్రమంలో నా కింత చోటివ్వండి." అన్నాను ఏడుస్తూ.

"లే తల్లీ...ఏడవకు: దుఃఖం మనిషిని వివేక శూన్యునిగా చేస్తుంది. కష్టాలకి వెరచి జీవితం మీద విరక్తి పెంచుకోవడం మంచిది కాదు. సహనం అలవరుచుకోవాలి తల్లీ. పరిస్థితుల్ని అరం చేసుకొని అనుకూలంగా మలుచుకోవాలి.

"బాధతో కుమిలిపోయే హృదయాలకి నా ఆశ్రమంలో స్థానం ఎప్పుడూ ఉంటుంది. కాని నువ్వు చిన్న పిల్లవి. ఇంట్లో ఏదో కలహించి వచ్చి ఆరాటపడుతున్నట్లున్నావు. ఇది సరియైన మార్గం కాదమ్మా. నిర్మలమైన మనసుతో నీ వాళ్ళ దగ్గరికి వెళ్ళిపో. భగవంతుడు నీకు మేలు చేస్తాడు."

"లేదు బాబాజీ. నా కెవ్వరూ లేరు." అన్నాను గద్గద స్వరంతో.

"ఆవేశంలో ఏదో అంటున్నావు తల్లీ. ఈ ప్రపంచంలో ఎవరూ ఒంటరివాళ్లు లేరు. ఎవరో ఒకరి సానుభూతి, ప్రేమాభిమానాలు అజ్ఞాతంగా ఉండనే వుంటాయి. నువ్వెవరో, నీదుఃఖ కారణం ఏమిటో నాకు తెలియదు. అయినా నువ్వలా ఏడుస్తుంటే చూస్తూ ఊరుకోలేక పోతున్నాను. ఈ బిడ్డకి కాస్త ఊరట కలిగించే మాట చెప్పమని భగవంతుడు నన్ను ప్రేరేపిస్తున్నాడు. ఈ పెట్టెలో వున్నవారంతా నీ దుఃఖంలోని విషాదాన్ని అనుభవించి వుంటారు. 'నా కెవరూ లే'రని ఎలా అనుకోగలవు తల్లీ!

"మనసుకి కొంత ఊరట కలిగి తాపీగా ఆలోచిస్తే నీ మాటల్లోని లోటు నీకు తెలిసివస్తుంది. నీ ఆలోచనలు తొక్కిన వక్ర మార్గం నీకు బోధ పడుతుంది. నీ మనసుకి నచ్చినంత కాలం నా ఆశ్రమంలో వుండవచ్చు. అందుకు అభ్యంతరం లేదు. కాని, ఈ వార్త నీ వారికి అందజెయ్యి. తోడి మానవుల్ని బాధపెట్టే హక్కు నీకు లేదు."

"నా చరిత్ర వింటే అంతా వున్నా నా కెవరూ లేనట్లే

అని మీరే ఒప్పుకొంటారు బాబాజీ. 'నా' అనుకొన్న వారివల్ల నే పొందిన మనస్తాపం, వారు నాకు చేయదలచిన ద్రోహం..."

"వద్దు తల్లీ, యిప్పుడు నువ్వేం చెప్పవద్దు. ఈ సమయంలో నువ్వు సత్యాన్ని చూడలేవు. ఉద్రేకంలో వున్న నీ మనసు నిష్పాక్షికమైన తీర్పు చెప్పలేదు. నీ ఆవేదన తగ్గిన తరువాత సమయం వచ్చినప్పుడు నేనే అడుగుతాను." అన్నాడు బాబాజీ.

రైలులో కూర్చునే అన్నయ్యకి ఉత్తరం వ్రాసేను:

"నాకోసం మీరు కంగారు పడనవసరంలేదు. బ్రతికి వుంటే, ఎప్పటికైనా రావాలనిపిస్తే తిరిగి వస్తాను. లేకపోతే బ్యాంకులో ఉన్న ఆ డబ్బు వినియోగానికి అవసరమైన కాగితాలు మీకు సకాలంలో అందుతాయి.

"మనుష్యుల స్వార్థ పరాయణత్వంతో, ధనలాలసతో విసిగి పోయి నేను మనశ్శాంతి కోసం పారిపోతున్నాను. అన్నీ కోల్పోయిన ఈ జీవితంలో ఇదేనా నాకు లభ్యమయేలా, మనసంటూ ఉంటే, ఆశీర్వదించు.

"జగదీశ్ కి ఈ విషయమే వ్రాసేను. పాపం! అతడికి నా వల్ల ఆశాభంగమే అయింది. దానికి కారణం చాలా వరకు అతడే. నా బాధ్యత కూడా ఉండిఉండవచ్చు. దానికి నేను పశ్చాత్తాప పడడంలేదు. ఆ జీవితం చేజారి పోయినందుకు నేను చింతించడం లేదు."

మరుసటి స్టేషనులో రెండు ఉత్తరాలు పోస్టు డొక్కులో వేసి వచ్చేక ఆ జీవితం నుంచి పూర్తిగా స్వేచ్ఛ పొందిన అనుభూతి కలిగింది.

# 9

హృషీకేశ్ బాబాకి హిమాలయ సానువులలో గంగకి ఈవలి ఒడ్డున మునీకిరేతిలో చక్కని ఆశ్రమం వుంది. వచ్చీ, పోయే భక్తులకు వసతీ సౌకర్యాలూ కూడా వున్నాయి. అతన్ని అనుసరించి వుండే భక్తుల్లో ఆడా, మగా అన్ని తరహాలకి చెందిన వారూ, అన్ని వయస్సుల్లో ఉన్నవారూ వున్నారు. ఆశ్రమంలో పనులన్నీ ఆడవారు చూస్తుంటారు. ఆర్థికమైన సర్దుబాట్లు, ఆశ్రమం దినచర్య సక్రమంగా జరిగేటట్లు మగవాళ్ళు చూసుకొంటారు.

మొదట్లో ఆశ్రమ విధులు కొంచెం కష్టంగా అనిపించినా, అలవాటు పడేక ఆలోచనకి అవసరం లేకుండా జరిగిపోతూండేవి. ఆ ప్రశాంత వాతావరణంలో రెండు నెలలు వేరొక ఆలోచన లేకుండానే గడిచిపోయేయి.

గడిచిన ఆ కాలంలో నా జీవిత గాథ చెప్పమని బాబాజీ ఏ రోజైనా అడుగుతారని ఎదురుచూసేను. అతడు అటువంటి ప్రయత్నమేమీ చేయలేదు. ఆశ్రమంలో నా లాటి ఒక స్త్రీ కొత్తగా వచ్చి చేరిన గుర్తింపే అతనికి వున్నట్టు లేదు. అక్కడ ఉండేందుకు అనుమతి ఇయ్యడంవరకే అతని పని అనీ, అటు తరువాత బాధలు, దుఃఖం వాటంతటవే తొలగిపోతాయనీ అనేవారు అక్కడ వున్నవారు.

ఆశ్రమంలో ఉన్న స్త్రీలలో చాలామంది జీవితంలో ఎదురు చూడని దెబ్బలు తిని చితికిపోయినవారూ, వయస్సులో నిబంధనలను తప్పి చరించి, బంధువులూ స్నేహితులూ బహిష్కరించగా, నిరా

శ్రయంగా, తిండికి లేక అక్కడ చేరినవారూ వున్నారు. కొందరు ముక్తి కోసం చేరితే, మరికొందరు బాబాజీ ఎడల భక్తితో చేరిన వారూ వున్నారు.

కాని, నాలా డబ్బుకి, బంధువులకి వెరచి పరుగెత్తు కొచ్చిన వాళ్ళు లేరు. నా జీవితం గురించి ఏం చెప్పాలోనూ? నేనూ మీ వంటి అభాగ్యురాలినే - విధి వంచితనే అనేదాన్ని.

వర్షాకాలం పూర్తవడంతో అంతవరకు గట్టులు ఒరుసు కొంటూ నిండు గర్భిణిలా మెల్లగా పారుతుండే గంగ తేలిక పడింది. స్నాన ఘట్టాలలో మెట్ల వరసలు బయటపడ్డాయి. ఒండు మన్ను నదిలో అడుగుకి దిగబడిపోయి, గంగాజలం నిర్మలంగా వుంది. అప్పుడే శివజటాజూటం నుంచి భూమిపై కాలు మోపిన గంగాదేవి ముందుకి అడుగు పెట్టేందుకు తటపటాయిస్తున్నట్లు, కదలికలో మందకొడిగా, నిండు తటాకంలా వుంది ఆ జలప్రవాహం.

ఏ కాలంలోనూ మంచుకెరళ్ళు కరిగి ప్రవహిస్తున్నంత చల్లగా ఉంటుంది గంగ. చలికాలంలో ఎండ వేళల్లో ప్రవాహ జలంపై తెల్ల తెల్లగా తేలిపోతున్న మంచు పలకలు కూడా కన బడుతా యంటారు స్థానికులు. మండు వేసవిలో, ఎండ వేళల్లో గంగలో మునక వేసినా, గజగజ వణికిపోతూ బయటికి వస్తారు యాత్రికులు.

అలవాటు పడిన ఆశ్రమ వాసులంతా సూర్యోదయానికి పూర్వమే గంగలో స్నానం చేసి, జపం, తపం ముగించుకొని ఏడు గంటల వేళ ఆశ్రమంలో జరిపే ప్రార్థనకి హాజరవుతారు.

మొదటి రోజున గంగలో మునిగి లేచిన నాకు ఆ నీటి చల్ల దనానికి కొంతసేపటివరకూ ఊపిరి అందలేదు. బట్టా, ఒళ్లూ తడిసీ తడియక ముందే స్నానం ముగించుకొని తల ఆరబెట్టుకొని, పొడి బట్టలు కట్టుకొన్నాను. అయినా సాయంకాలం అయేసరికి తల

భారమైపోయి మరునాటికి జలుబు చేసింది. ఆ రాత్రి కొంచెం జ్వరం కూడా వచ్చింది.

ఆశ్రమంలో కొత్తగా వచ్చిన వారి మంచి చెడ్డలను చూసే ఆమెని "మాయీ" అంటారు. ఆమె వచ్చి నా పరిస్థితి చూసి మరునాటి నుండి నా కోసం బాల్చీతో వేడినీళ్ళు పంపేది. అందరూ చీకటితోనే గంగకి స్నానానికి వెళ్ళిపోతుంటే, నేనొక్కదాన్ని వేడినీళ్ళ కోసం గదిలో కాచుకు కూర్చోడం చిరాగ్గా వుండేది.

"ఈ గాలికి, తిండికి కొంతకాలం అలవాటుపడితే నువ్వూ మాలాగే గంగలో స్నానం చెయ్యగలుగుతావు. అప్పుడు రొంపా, జ్వరం దగ్గరికి రావు," అంది మాయీ.

వేడినీళ్ళ స్నానంచేసి బయటికి వచ్చినా గంగపై నుండి వచ్చే చల్లని గాలికి ఒళ్ళు గగుర్పొడిచింది. అక్టోబర్ నెల అంతం కాక ముందే కొండల్లోంచి చలి తొంగి చూసింది. బదరీ యాత్రికుల ఆఖరి జట్టు తిరుగుముఖం పట్టి జోషీమట్ చేరుకొన్నట్లు ముందురోజుకే వార్త అందింది. హిమాలయాలు పదిలంగా ఒక్కొక్క తలుపు బిగించుకొంటూ దేశవాసులతో సంబంధం లేకుండా, అయిదు నెలలు పాటు మంచు గృహంలో నిద్రపోయే సమయ మాసన్న మయిందన్న మాట.

పైటకొంగుని బుజాలమీదుగా నిండుగా కప్పుకొని గంగవైపు చూస్తూ ఒడ్డున నిలబడ్డాను. తొలి అరుణరేఖ గంగపై ప్రతిఫలించే సరికి స్నానం పూర్తిచేసి తడిబట్టలతో గట్టు పొడుగునా నిలిచిన అందరి చేతులూ బాలభానుని ఆహ్వానిస్తూ పైకి లేచేయి. గంగాతీరం పొడుగునా ఆదిత్యనామం శ్రవణానందకరంగా తేలియాడింది.

గంగా జలంలో ఏదో పవిత్రత, ఏదో ప్రశాంతత, మనసునీ, మనిషినీ ఆకర్షించే ఏదో మహత్తర శక్తి ఉన్నాయంటారు. ఈ గంగలో మునిగేందుకు యాత్రికులు వందలకొలది మైళ్ళ

ప్రయాణం చేసి వస్తారు. గంగాజలాన్ని పదిలంగా తీసుకువెళ్ళి తమ ఇళ్ళలో భద్రపరుచు కొంటారు. అటువంటి పవిత్ర గంగా తటాన నిలబడివున్నా ఆ రోజు నా మనసు స్థిరంగాలేదు. జీవితంలో మరిచిపోవాలనుకొన్న అనుభవాలన్నీ కళ్ళముందు తిరగసాగేయి. వాటిలో కూరుకుపోయి కంఠంవరకూ మునిగి పోనున్న సమయంలో "బహెన్‌జీ! బాబాజీ పిలుస్తున్నారు" అంటూ మాయీ వచ్చింది.

ఎంత కాలంగానో ఎదురు చూస్తున్న బాబాజీ పిలుపు ఆ సమయంలో రావడం నిజంగా నాకు ఆశ్చర్యం కలిగించింది. నన్ను యింటికి తిప్పి పంపేందుకు నా మనసు బలహీనంగా ఉన్న ఈ సమయాన్నే బాబాజీ ఎన్నుకొన్నారా అనుకొన్నాను.

ఆశ్రమంలో తనకోసం నిర్దేశింపబడిన గదిలో జింక చర్మం మీద పద్మాసనంలో కూర్చున్నారు బాబాజీ. ఆ సమయంలో ఎవరైనా చూస్తే, ఆయనవయస్సు యాభైకి మించి ఉండదను కొంటారు. దృఢంగా ఉన్న శరీరం, ఎదుట వున్న పుస్తకంలోని భావాన్ని తరిచి తరిచి చూస్తున్న తేజోవంతమైన కళ్లూ! ఎదుటి వారిని యిట్టే ఆకర్షించే శక్తి ఉంది ఆ మనిషిలో.

నేను మెల్లగా గదిలో అడుగుపెడుతూ "నమస్తే బాబాజీ!" అన్నాను. ఆయన చేతిలోని గుర్తు కాగితాన్ని ఎదురుగా ఉన్న రామాయణ గ్రంథంలో ఒకచోట పెట్టి "రామ్...రామ్...బేటీ! అన్నారు.

బాబాజీకి గజం దూరంలో తివాసీమీద కూర్చున్నాను.

ఎటువంటి ఉపోద్ఘాతం లేకుండా "ఇప్పుడు చెప్పు: నీ చరిత్ర" అన్నారు బాబాజీ.

ఏ ఒక్క సన్నివేశం వదలకుండా అన్నిరకాల అనుభూతులీన్నీ, సుఖదుఃఖాలనీ నేను నిజమని నమ్మి అనుభవించినంత

వరకూ చెప్పేను. మాధవ్ చనిపోయిన తరవాత నా ఆవేదనని ఎంత నిర్లిప్తంగా విన్నారో, జగదీశ్‌తో నాకు కలిగిన అనుభవాన్ని కూడా అంత నిదానంగా విన్నారు. జాలీ, విసుగూ, చీదరింపూ, అవహేళన మొదలైన భావాలేవీ అతని కళ్ళలో నేను చూడలేదు. రైలులో బాబాజీ తారసపడే వరకూ చెప్పి ఊరుకొన్నాను.

"ఇక్కడెలా ఉంది? నువ్వు వాంఛించిన శాంతి నీకు లభ్యమైందా? మనసులోని మలినమంతా గంగాజలం కడిగివేసిందా?" అని ప్రశ్నించేరు బాబాజీ.

బాబాజీ ఈ ప్రశ్న ఒకరోజు ముందు వేస్తే నేను కోరిన శాంతిని పొందగలిగేనని ధైర్యంగా చెప్పగలిగి ఉండేదాన్ని. కాని ఆ రోజు కన్ను తెరిచింది మొదలు గత జీవితపు ఛాయలు గాలి దెయ్యాలలా వెంట తరుముతున్నాయి. పుట్టి పెరిగినచోటు. ఆత్మీయులనుకొన్న మనుష్యులు చుట్టుముట్టి పలుకరిస్తున్నారు. మనసు ఆంధ్రలో, శరీరం మాత్రం హృషీకేశ్‌లో ఉన్నట్లుగా వుంది. నేను భావించినంత సులువుగా గడిచిన జీవితపు జ్ఞాపకాల నుంచి నాకు విముక్తి కలగబోదని తెలుసుకొన్నాను.

"లేదు. బాబాజీ! ఆ జీవితం నుంచి నా కింకా బంధవిముక్తి కలగలేదు. దాని ప్రభావం నా మీద యింకా తరగలేదు. అటు ఆశలు యింకా లాగుతూనే ఉన్నాయి," అన్నాను.

"తిరిగి వెళ్ళిపోవా లనిపిస్తున్నదా?"

"నా కా జీవితంమీద వ్యామోహం లేదు బాబాజీ. నా కా డబ్బుమీద మమకారం కూడా లేదు. ఈ క్షణంలో, నా కళ్ళముందు, దాన్ని గంగలో కలిపేసినా నేను బాధపడను. కాని, నన్ను మభ్య పెట్టి, నా మంచికోసమే చేస్తున్నట్లు మోసగించి దానిని పొందా లనుకొన్నవారిని నేను క్షమించలేను. ప్రేమించలేను.

"వారికి కావలసింది డబ్బు, నాకు కావలసింది ఆ డబ్బుతో లంకె లేని ప్రేమ. నన్ను నన్నుగా అభిమానించే ఆత్మీయులే ఆత్మీయులు.

"నన్ను ప్రేమించలేని మనుష్యుల ముఖస్తుతులు వింటూ, వారి ఆలోచనలోని కలుషభావాన్ని అర్థం చేసుకొంటూ నేను బ్రతకలేను. ప్రశాంతమైన ఈ ఆశ్రమంలో, ఏ నాటికైనా మీ పాదాల సన్నిధిని, నేను కోరుకున్న తృప్తిని పొందగలనని నాకు నమ్మకముంది. తిరిగి వెళ్ళిపొమ్మని నాకు సలహా ఇవ్వకండి, బాబాజీ!" అన్నాను.

నేను చెప్పిన విషయాన్నంతా అవగాహన చేసుకొంటున్నట్లు బాబాజీ రెండు నిమిషాలు కళ్ళు మూసుకొని మౌనంగా ఉండిపోయేరు. "నీవు చెప్పిన దాన్నిబట్టి నీ బంధువులకి, అభిమానులకి డబ్బుపై ఎంత వ్యామోహ ముందో, నీకూ అంతకి మించే వుందనిపిస్తున్నది, తల్లీ. డబ్బు లేకపోయినప్పుడు వారు నిన్ను నిర్మలంగా ప్రేమించేవారనీ, ఆ డబ్బే మీ మధ్య బాంధవ్యాలను పాడు చేసి, అభిమానాన్ని కలుషితం చేసిందనీ చెపుతున్నావు.

"అటువంటి సందర్భంలో ఆ డబ్బు అనే అడ్డంకిని తొలగించి నిర్మల ప్రేమ వాహినికి ఎందుకు దారి చూపలేకపోయేవు? నీ అత్త, మామల ఆదరం కోసం, అన్నగారి అభిమానం కోసం ఆ ధనాన్ని ఎందుకు త్యాగం చెయ్యలేక పోయేవు? నీ జీవితాన్ని, అందాన్ని, ఆనందాన్ని అణుమాత్రం సంశయం లేకుండా, స్వయంగా చేతుల్లో పెట్టడానికి సిద్ధపడిన నువ్వు నీ ప్రియుణ్ణెందుకు నమ్మలేక పోయేవు?"

"వాటన్నిటికన్నా ధనం నీకు ప్రధానమవడం వల్లనే కదా? నీకు వారి ఆదరాభిమానాలకన్నా డబ్బు మిన్న అన్న భావం కలగడంవల్లనే కదా? ప్రేమించేవారు లేకపోయినా, డబ్బుంటే బ్రతగ్గలననే ధైర్యం ఉండడం వల్లనే కదా?

"డబ్బుని కాంక్షిస్తున్నంత మాత్రాన మనిషి మనిషిని ప్రేమించలేడని ఎలా అనుకొన్నావు తల్లీ! తను ప్రేమించిన వ్యక్తిని సుఖపెట్టేందుకూ, జీవితనౌక నిరపాయంగా ప్రయాణించేందుకూ ధనాన్వేషణ చేస్తాడు మానవుడు.

"'డబ్బు లేనంత మాత్రాన ప్రేమించే మనసు కరువౌతుందా బాబాజీ అని ప్రశ్నించేవు ఒకరోజున. ప్రేమించే మనసు కరువు కాదు. ఆ ప్రేమని చూపే మార్గం మూసుకుపోతుంది. భార్యా బిడ్డల ఆకలి తీర్చలేని గృహస్థు మనస్సునిండా ప్రేమ పేరుకొని ఉన్నా, అది కరిగి, ప్రవహించే మార్గంలేక, కఠిన శిలగా మారి పోతాడు. దారిద్ర్యంవల్ల ప్రేమకు ఉన్న విలువ తగ్గకపోవచ్చు. కాని, గ్రహణ కాలంలోని సూర్యకాంతిలా స్వచ్ఛతని కోల్పో తుంది. మనిషిలోని మంచి గుణాలని పైకి రాకుండా అణిచి వేయ గల శక్తి లేమికి ఉంది తల్లీ!

"డబ్బు చుట్టూ మనిషి పెట్టే పరుగులకి ఇంత వెనక వుంగు ఉండగా, నీ డబ్బు మీద దృష్టి లేకుండా నిన్ను మాత్రమే ప్రేమించేవారు కావాలనుకోడం చిన్న పిల్లలు విరిగిన బొమ్మే కావాలనీ, నేల ఒలికిన పాలే తాగాలనీ పంతం పట్టినట్లే.

"ఎదుటివారి తప్పుల్ని వేలెత్తి చూపేముందు నీ లోని లోటుపాట్లని కూడా తరచి చూసుకోవాలి తల్లీ! ఒక వేలుతో ఎదుటి వారి చెడుగును చూపుతుంటే, మిగిలిన నాలుగు వేళ్లూ నీవైపు తిరిగి ఉంటాయన్నది గుర్తు వుంచుకో. ఆత్మవిమర్శ చేసు కొని, నిజాన్ని సూటిగా చూసే ధైర్యాన్ని సంపాదించుకో. అప్పుడు యింకోసారి నీ మనస్సులోని భావం తెలియజేద్దువు గాని," అన్నారు బాబాజీ.

ప్రార్థన సమావేశానికి భక్తులు ఒక్కొక్కరే రావడం మొదలు పెట్టేరు. బాబాజీకి నమస్కారం చేసి ఎడంగా వెళ్ళి

కూర్చున్నాను. ఆ రోజు ప్రార్థనలో శ్రద్ధగా పాల్గొనలేక పోయేను. ఒకటి రెండుసార్లు భజన సమయంలో లయ తప్పి పాడు తుంటే మాయీ హెచ్చరించారు కూడా.

తిరిగి పదిహేను రోజులు గడిచేవరకూ బాబాజీని ఒంటరిగా కలుసుకోలేదు. నా మనసు ఏమిటో నాకు తెలియక పోవ డమే దానికి కారణం. బాబాజీ నా ముందు ఉంచిన ప్రశ్నలకి సరి యైన సమాధానం పొందలేక పోవడం కూడా ఒక కారణమే. రోజంతా ఆలోచనల్లో మునిగి ఉన్నా ఒక చివరంటూ కనిపించేది కాదు. ఉదయ సంధ్యల ప్రార్థనలతో ఒక రోజు గడిచిందన్న విషయం గుర్తింపుకు వచ్చేది.

గంగపై తెప్పమీద పోతూ చూస్తే నీలాకాశంలో ధవళ కాంతులతో మెరిసే వేణుగోపాలుని కోవెల కన్నులకి హత్తుకుం టుంది. ఆకాశంలో తిరుగులాడే మేఘాలు కోవెల శిఖరాన్ని కుశల మడిగి వెళ్ళిపోతున్నట్టు రాసుకొంటూ పోతాయి. ఎత్తైన గుట్టమీద పొందికగా కట్టబడిన ఆ కోవెలలో బాలభోగం జరుగుతున్నది. రోజూ పూజ పూర్తయ్యే వరకూ అక్కడ వుండి ప్రసాదం తీసు కొని వెళ్ళటం అలవాటు.

ఎవరో భక్తురాలు శ్రావ్యమైన కంఠంతో భగవంతుని వేడు కొంటున్నది: "దరిశెన దో ఘనశ్యామ్‌నాథ్, మొంరె అఖియా ప్లాసీరే" అని విలపిస్తున్నది. భగవంతుడు అంత సులువుగా, పిలవ గానే వచ్చి, మనుషుల తాపత్రయాలు చల్లారుస్తుంటే ఇంక కావల సింది ఏముంది? అంతా అతడే చూసుకు పోతాడని హాయిగా కాళ్లు చాపుకొని కూర్చోవచ్చు. ఈ సంకుచితత్వం, మోసం, స్వార్థం లేకుండా మనుషులంతా మహాత్ములయి పోదురు. మానవుడికీ, దేవునికీ మధ్యగల దూరం తగ్గిపోయి ఉండేది.

ఆమె ప్రార్థనని గంగ మీదుగా మోసుకుపోయి ఆ కైలాస నాథునికి అందజేస్తున్నదా అన్నట్లు గాలి సాగింది. ఎండలో నదిలో నీళ్ళు మిలమిల మెరిసేయి. నదిలో ఈ ఒడ్డుకి ఆ ఒడ్డుకి తిరుగుతున్న తెప్పలు, చిన్న నావలు నీటి కదలికకి ఇటు అటు ఊగులాడేయి.

పూజారి బాలగోపాలుని ఆరగింపు పూర్తి చేసి, అక్కడ చేరిన వారందరికీ ప్రసాదం పంచిపెట్టేడు. అరటి ఆకులో పెట్టిన వేడి వేడి కిచిడీ అందుకొని మెల్లగా మెట్లు దిగుతూ కిందికి వచ్చేను. ఆశ్రమ ఆవరణలో బాబాజీ, మరి యిద్దరు కొత్త మను ష్యులు ఏదో మాట్లాడుకొంటున్నారు. వారిని తప్పించుకొని పక్క మెట్లమీదుగా వంటశాలవైపు కాలు కదిపేను. పదడుగులు వేయక ముందే "బాబాజీ పిలుస్తున్నారు" అన్నాడు, ఆవరణలో ఒక పక్కగా నిల్చుని వారి మాటలు వింటున్న వ్యక్తి. బాబాజీ ముందుకు వచ్చి అక్కడ ఉన్న ముగ్గురికీ నమస్కారం చేసేను.

"రా, తల్లీ, కూర్చో, నీతో కొంచెం పని పడి పిలిచేను."

"చెప్పండి, బాబాజీ" అన్నాను దగ్గరగా ఉన్న బల్లమీద కూర్చుంటూ.

"వీరు నీ సహాయం కోరి వచ్చేరమ్మా" అన్నారు బాబాజీ.

నేనేం మాట్లాడలేదు.

"నువ్వు లక్ష్మణఝూలా చూసేవా?" అని బాబాజీ ప్రశ్నించేరు.

"చూసేను బాబాజీ. బడీబహిన్, రోజూ, ఆశ్రమంలో అందరూ తినగా మిగిలిపోయిన ఆహార పదార్థాలని తీసుకుపోయి అక్కడి కుష్ఠురోగులకి పెడుతుంది. ఒక రోజు నేను ఆమెతో వెళ్ళేను."

"నేను చెప్పబోతున్న మాట దగ్గరికే వచ్చేవమ్మా! మిగిలిన నాడు ఇంతపెట్టి, లేనినాడు లేదు అన్నట్లు కాకుండా రోజూ వారిలో కొంతమందికైనా తిండి దొరికే మార్గం ఏర్పాటు చెయ్యాలని ఈ ధర్మాత్ములు తలపెట్టేరు. ఆ ధర్మకార్యానికి నీ వంటి నిస్వార్థపరుల అండ ఉంటే వారి ప్రయత్నం త్వరితగతిని ఫలప్రదం అవుతుంది.

"వీరు తాము వచ్చిన పని తెలియజెయ్యగానే నాకు నీ మాట జ్ఞాపకం వచ్చింది. నిజాయితీగా, కావాలని అడిగి పుచ్చుకొంటే, డబ్బు ఇచ్చేందుకు నీకేం అభ్యంతరం లేదన్నావు. వీరు నిన్ను మోసం చెయ్యడం లేదు. మాయమాటలు చెప్పడం లేదు. తమ కోసం అర్థించడం లేదు. ఒక ధర్మకార్యానికై నిర్మలమైన మనసుతో అడుగుతున్నారు. నీ డబ్బు నీ కళ్ళ ముందు వెచ్చించడం నువ్వు చూడగలుగుతావు. కాబట్టి, ఇందులో అనుమానానికి ఆస్కారం లేదు.

"నీకు విలువలేని ఆ ధనానికి ఇంతకిమించిన సద్వినియోగం ఏముంటుంది బేటీ! ఆకలి అన్న ఒకరికి అన్నం పెడితేనే పుణ్యం అంటారు. నీ మూలంగా అందరి కడుపులు నిండుతుంటే ఆ పుణ్యం నిన్ను ఏ లోకాలకి చేరుస్తుందో?"

బాబాజీ అన్నదానం ఫలితం గురించి ఇంకా చెపుతూనే వున్నారు. మధ్య మధ్య మిగిలిన యిద్దరూ కూడా 'బాబాజీ సెలవిచ్చినట్లు' అంటూ ఒకటీ, అరా మాటలు అందిస్తున్నారు. ఆ క్షణంలో పూజ్య బాబాజీ ముఖంలో అత్తయ్య, మామయ్య, అన్నయ్య, వదిన, జగదీశ్, పంకజమ్మ—అందరూ వరుసతీరి కన్పించేరు.

"నన్ను ఆలోచించుకోనీండి బాబాజీ!" అన్నాను.

"అలాగే కానీ తల్లీ! తొందరేం లేదు. ఇటువంటి ధర్మ కార్యాలు ఒకరి బలవంతంవల్ల కాక ఆత్మప్రేరణవల్ల జరగాలి. అప్పుడే నిజమైన తృప్తి లభిస్తుంది." అన్నారు బాబాజీ.

ఆరోజు సాయంకాలం ప్రార్థన సమావేశానికి వెళ్ళ బుద్ధి కాలేదు. "తలలు బోడులైన తలపులు బోడులా" అన్న వేమన సూక్తి జ్ఞాపకం వచ్చింది. డబ్బు అనే ఇరుసు మీద ప్రపంచం అంతా తిరుగుతున్నదని ఎప్పుడో మామయ్య అన్న మాట గుర్తుకు వచ్చింది. ఇదా బాబాజీ నిజరూపం?—అనుకొన్నాను.

అన్నయ్య, మామయ్య, జగదీశ్ తమ తెలివితేటల్ని నాపై నేర్పుగా ప్రయోగించి నన్ను వలలో బంధింప జూస్తే, వారందర్నీ మించిన ప్రజ్ఞాశాలి అని ఋజువు పరిచేడు హృషీకేశ్ బాబా! ఇంత కాలంగా నా గురించి ఏమీ తెలియనట్లే నటించి, మెల్లగా ఇరుకున పెట్టి డబ్బంతా ఆశ్రమానికి లాగాలని ఎత్తు వేసేడు. నా పరిస్థితిని చూపు మాత్రంగానే ఆ నాడు రైలులో అర్థం చేసుకొని వుంటాడు. పిచ్చి కాక బాబా వెలుస్తున్న ఈ రోజుల్లో ఈ హృషీకేశ్ బాబా ఏదో మహాత్ముడని నమ్మి వెంటపడి ఇంతదూరం రావడం. ఇక్కడ నాకేదో ఒరిగిపోతుందని ఆశించడం నా తెలివి తక్కువే.

ఆశ్రమంలో నాకోసం జరుగుతున్న ప్రత్యేకమైన ఏర్పాట్ల అంతర్యం అప్పటికి అర్థమయింది. మూడు నెలలు గడవనున్నా వేడి నీళ్ళు యింకా అందుతూనే ఉన్నాయి. ఆశ్రమవాసులంతా నులక మంచాలు ఉపయోగిస్తుంటే నాకు నవారు మంచం లభ్యమయింది. భక్తులు బాబాజీకి తెచ్చే పళ్ళూ మిఠాయిలలో భాగాలు, ప్రసాదం పేరిట, మాయి తెచ్చి యిస్తూనే ఉంది. ఈ రాజ మర్యాదలన్నీ నాకు ఎందుకు జరుగుతున్నాయో ఆ నాటికి అర్థమయింది.

"నీకే అన్నమాట లేదమ్మా! గాయపడిన ఏ హృదయా న్నయినా బాబాజీ తన ఆదరణతో, ఆత్మీయతతో ఇలాగే సేద తీరుస్తారు" అంది మాయా.

అప్పటికి ఆమె మాట నమ్మేను. బాబాజీ మంచితనానికీ, దయార్ద్ర హృదయానికీ జోహారు లర్పించేను. కాని ఆ తెర తొలగి తొలగి నాటకానికి నాందీ ప్రస్తావన అయింది. ఇక నటీ నటులు రంగం మీదికి రావడమే తరువాయి.

సాయంకాలం ప్రార్థనలో ఆఖరి భాగమైన రామభజన్ జరుగుతున్నది. అటు తరువాత ఆశ్రమవాసులంతా బాబాజీకి నమస్కారం చేసి బయటికి వచ్చి తమ తమ పనుల్లో మునిగిపోతారు. ప్రార్థనకి నేను రాకపోవడం బాబాజీ గ్రహించే వుంటారు. తను చెప్పిన విషయం మీద ఆలోచిస్తూ సమయం మించ బెట్టుకొని ఉంటా ననుకొంటాడు! కాని నా ఆలోచనలు తొక్కిన మార్గాన్ని మాత్రం బాబాజీ పసికట్టలేదు. తన మంత్రం బాగా పారిందని ముచ్చట పడుతూంటారు.

రోజూ రామభజన్ ఎంతో యింపుగా, మనస్సుకి ప్రశాంతిగా వినిపించేది. ఆ రోజు రామనామం వెనుక అది ఉచ్చరిస్తూన్న మనుష్యుల్లోని కుళ్ళు, మోసం, మాలిన్యం కంఠం కలుపుతున్నట్లనిపించింది.

సాయంకాలం వరకూ నేను గది విడిచి బయటికి రాలేదు. చీకటి పడబోతూంటే గంగ ఒడ్డుకి వెళ్ళి కూర్చున్నాను. ఎదురుగా ఎత్తుమీద వేణుగోపాలుని కోవెల. నదికి ఆవలి గట్టున స్వర్గాశ్రమం, గీతాభవన్ సుందరంగా కనిపిస్తున్నాయి. దూరంగా కనుచూపు దూరంలో గంగ మీదుగా రెండు గట్లని కలుపుతూ లక్ష్మణఝూలా మసకగా కనిపిస్తున్నది. ఇంత ప్రశాంత వాతావరణంలో మసలు

తున్న మనుష్యుల మనస్సులో కూడా ఎంత స్వార్థమో, ఎంత కుత్సితమో అనుకున్నాను.

ఆలోచనలు గాలి తాకిడికి లేచిన గంగ అలల్లా కదులుతున్నాయి. కళ్ళముందు దృశ్యాలను చీకటి మింగి ఊరుకొంది. గల గల మనే గంగా ప్రవాహపు ధ్వని మాత్రం వినిపిస్తున్నది.

"నీ కోసం అక్కడంతా వెదికేను. ఒంట్లో సరిగా లేదని తిండి మానుకొని యిక్కడ చల్ల గాలిలో ఎందుకు కూర్చున్నావు" అంది మాయీ.

"ఈ చల్లగాలి, ఈ గంగా భవాని అయినా నా తాపాన్ని తీరుస్తాయేమో అని చూస్తున్నాను" అన్నాను నిరాశగా.

నా మాట ఆమెకి ఎలా ధ్వనించిందో? "పద బహిన్ జీ, చీకటి పడింది. రాత్రిపూట గంగలోంచి పాములు వచ్చి ఒడ్డు చేరతాయంటారు" అంటూ చెయ్యి పట్టుకొని తనతోపాటు తీసుకు పోయింది ఆమె.

ఆ రాత్రి బాబాజీ పంపిన ప్రసాదం నోట్లోవేసుకొంటుంటే నోటికి చేదుగా తగిలింది. ఆ రాత్రల్లా వెయ్యి రాత్రులకి పెట్టు. జాగరణ చెయ్యగా తెల్లవారుతున్న సందళ్ళు ఆశ్రమంలో విని పించేయి. నా వి అనుకొన్న వస్తువులను ఒక చేతి సంచిలో వేసుకొని గది వదిలి బయటికి నడిచేను. ఆశ్రమ ముఖద్వారం చేరుకొనేందుకు బాబాజీ గది ముందునుంచే పోవాలి. బాబాజీ గది తలుపులు ఎప్పుడూ తెరిచే ఉంటాయి. అతి నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ అతని దృష్టిని తప్పించుకొని వెళ్ళిపోయేందుకు ప్రయత్నించేను. తిరిగి ఒకసారి అతని ముందు నిలవవలసి వస్తే, ఆ మాయా వాగురలో చిక్కుకోవడం తప్పదు. అందుకే దొంగలా

జారుకోబోయేను. సరిగా నేను గుమ్మం దాటబోతున్న సమయంలో బాబాజీ దృష్టి నా మీద పడింది.

తప్పు చేసిన దానిలా తల వంచి "బాబాజీ, నేను వెళ్ళిపోతున్నాను." అన్నాను.

బాబాజీ చేయెత్తి మెల్లగా ఏదో అన్నారు. అతని మాటలైతే నాకు వినిపించలేదు. ఆ అభయ హస్తం మాత్రం నా కాళ్ళకెంతో బలం ఇచ్చినట్లు అనిపించింది. త్వరగా అడుగులు వేస్తూ రైల్వే స్టేషను చేరేను. ఇంకా రైలు వచ్చేందుకు చాలా వ్యవధి ఉంది. తెల్లవారిన తరువాత ఆశ్రమం విడవడం ఇష్టంలేక చీకటినే బయలుదేరేను.

ఏడు గంటల వేళ రైలు వచ్చింది. ఎక్కబోతూంటే ఆశ్రమవాసి ఒకడు వచ్చి "బహీన్ జీ, బాబాజీ ఇవి మీకు ఇమ్మన్నారు" అంటూ రెండు గోల్డ్ గడ్ ఏపిల్ పళ్లూ, మడచి వున్న ఒక కాగితం నా చేతిలో పెట్టేడు. అది యాపిల్ పళ్ళు దొరికే ఋతువు కాదు. అపురూపంగా ఎవరో భక్తులు తనకి తెచ్చి ఇచ్చిన ఆ పళ్ళని నాకు పంపడంలో బాబాజీ అభిప్రాయం ఏమిటి? మడిచి ఉన్న ఆ కాగితంలో ఏమి వ్రాసి ఉంది?

హృషీకేశ్ బాబా ఆశ్రమానికి సులువుగా తిరిగిపోలేనంత దూరం ప్రయాణించేక, సంచిలోంచి ఆ పళ్ళూ, కాగితం తీసేను. ఎదురు బెంచీమీద కూర్చున్న దంపతులకు ఆ రెండు పళ్ళూ ఇచ్చేసేను.

"ఏపిల్ పళ్ళూ!" అంటూ ఎంతో ఆశతో చిన్న పిల్లాడిలా చూసేడు ఆ వృద్ధుడు. "ఇది కాలంకాదే!" అంది అతని భార్య.

"అకాలంలో కూడా అపురూపంగా అక్కడక్కడ దొరుకుతుంటాయి" అన్నాను.

"మేము కాశీవెళ్ళి వస్తున్నాము, ఏదో కొట్టుమీద కనిపించినా ఇంతంత ఉసిరికాయల్లా ఉన్నాయి కాని...ఎర్రగా ఇంత పెద్దవి..." అంత అపురూపమైన వస్తువుని అపరిచితులైన తమకెందుకు ఇస్తున్నారని ఆశ్చర్యంగా చూసేరు ఆ దంపతులు.

"ఎవరో స్నేహితులు ఇచ్చేరు. నాకు ఏపిల్ పళ్ళంటే ఇష్టంలేదు" అన్నాను.

నిజానికి బాబాజీ ఇచ్చిన ఆ ఏపిల్ పళ్ళు తింటే తిరిగి మనసు నన్ను మాయచేసి అతని ఆశ్రమానికి లాక్కుపోతాయేమో అన్న భయంతో వాటిని తినడం మానుకొన్నాను. వాళ్ళు వాటిని ఆప్యాయంగా కోసుకు తింటుంటే అటు చూడకుండా బాబాజీ వ్రాసిన ఉత్తరం తీసి చదువసాగేను.

"నువ్వు ఈ విధంగా ఏదోరోజున వెళ్ళిపోతావని నాకు తెలుసు తల్లీ! నీకు జీవితంమీద ఇంకా మమత తీరలేదు. సుఖించాలన్న కోరిక పోలేదు. ఆ కారణంగానే అంత భయాన్ని, అనుమానాన్ని నీ చుట్టూ పోగుచేసుకొన్నావు. నీ డబ్బుని ఎవరు కాజేస్తారో, నీ జీవితాన్ని ఎవరు నాశనం చేస్తారో అనే బెంగతో పగలూ, రాత్రీ అనిలేక, కన్ను మూయకుండా బతుక్కి కాపలా కాసేవు.

"చీకటిరాత్రి ఏ చిన్న ధ్వనైనా చౌకీదారుకి హెచ్చరిక చేసేటట్టు అతి సహజమైన సన్నివేశాలు కూడా నిన్ను అప్రమత్తతగా ఉండమని మేలుకొల్పేయి. వేయి కళ్ళతో నీ ధనాన్ని నువ్వు రక్షించుకొంటూనే 'నాకు డబ్బంటే ఆసక్తిలేదు. నాకు దానిమీద వ్యామోహంలేదు' అనుకొన్నావు.

"నీ గురించి నువ్వు సరిగా తెలుసుకోలేదని నిన్నటి సంఘటన ఋజువు చేసింది. పవిత్రమైన ఈ ఆశ్రమంలో శాంతిని, తృప్తిని పొందగలనని నమ్మికతో వున్న నువ్వు డబ్బు ప్రస్తావన

రాగానే దొంగలా జారుకున్నావు. అంతవరకూ పరమ పూజ్యుడూ, ఆత్మీయుడూ, దయాశీలీ అని నమ్మిన బాబాజీ స్వార్థపరుడుగా, మోసగాడుగా, బందిపోటు దొంగగా నీ దృష్టిలో మారిపోయి ఉండవచ్చు. నీకు డబ్బుమీద ఉన్న మమకారానికి ఈ దృష్టాంతరం చాలదా బేటీ?

"నీకు ఉన్నది ఇతరులకిచ్చి, వారిచ్చినది సంతోషంగా స్వీకరించడంలోనే ఆనందం ఉంటుంది తల్లీ. నీ ఆలోచనల్ని నీమట్టుకే పరిమితం చేసుకోక నీకు సంబంధించిన వారిని కూడా అందులో ప్రవేశపెట్టు. అప్పుడే జీవితపు విలువల్ని, అనుబంధాన్ని, అభిమానాన్ని అర్థంచేసుకో గలుగుతావు.

"నువ్వు సంకల్పించిన ఈ ప్రయాణం నిన్ను ఇల్లుచేర్చాలనీ, నీ కళ్ళముందు ఉన్న పొర తొలగిపోయి యథార్థ జీవితాన్ని, ఆత్మీయుల అభిమానాన్ని చూడగలగాలనీ భగవంతుని ప్రార్థిస్తున్నాను."

ముందు అనుకొన్న విధంగా దిగిపోకుండా ముందుకు పోగాను. పక్క స్టేషనులో దిగి టికెట్టు తీసుకొని "నేను తిరిగి వస్తాను. జగదీశ్ కి చెప్పవలెను" అంటూ అన్నయ్యకు టెలిగ్రాం ఇచ్చేను. బాబాజీ ఉత్తరంలో ఏ విషయం నాలో ఈ మార్పుకి కారణమో చెప్పడం కష్టం. కాని అతడు చేసిన ఆరోపణలలో నిజమున్నదనిపించింది...

కిటికీలో తలదూర్చి అరటి పళ్ళు కొంటున్న ఆవిడ "అమ్మడూ, నువ్వు ఇక్కడేకదూ దిగిపోతానన్నావు?" అంటూ ప్రశ్నించింది.

"లేదండీ. మా దేశంలో కొందరు బంధువులున్నారు. వారిని చూసి రావాలనిపించి, ముందుకే వెళుతున్నాను" అన్నాను.

''మంచిపని చేశావమ్మా? ఇంతదూరం వచ్చి చూడకుండా వెళ్ళిపోతే బాధపడి ఉందురు'' అంది.

తను కొన్న అరటి పళ్ళలో రెండుతీసి నా చేతిలో పెట్టింది. ఆ పళ్ళు నా నోటి కెంతో రుచిగా ఉన్నాయి. అటువంటి పళ్ళు ఎప్పుడూ తినలేదన్నంత ఇష్టంగా తిన్నాను.

''మరోటి ఇవ్వనా?'' అంది ఆమె నేను తిన్న తీరు చూసి.

''వద్దండీ. పళ్లు మాత్రం చాలా బాగున్నాయి'' అన్నాను.

ముసలాయన నా వైపు వింతగా చూసేడు. తిన్నగా పండని ఆ పళ్ళు అతని నోటికి కసగా తగిలి ఉంటాయి. ఆప్యాయంగా ఇచ్చి పుచ్చుకోడంలోని ఆనందం ఎటువంటిదో అర్థమైంది.

ఆ రాత్రి పూర్తిగా ఆలోచనల మధ్యనే గడిచిపోయింది. నేను ఆశ్రమం విడిచేందుకు కారణమైన బాబాజీ కోర్కెకి, అటు తరవాత అతడు వ్రాసిన ఉత్తరానికి సమన్వయం చెయ్యలేక సత మతమయేను. ఈ రెండింటిలో ఏది బాబాజీ అసలు రూపం? ఆడదాన్ని తీయని మాటలతో మోసంచేసి ఆశ్రమంలో డబ్బంతా గుంజాలనే స్వార్థపరత్వమా? తనని అవమానపరచినట్టు, మాటమాత్రం చెప్పకుండా వెళ్ళిపోతున్న స్త్రీ బాగును కాంక్షిస్తూ భగవంతుని ప్రార్థిస్తానన్న మంచితనమా? ఇందులో ఏది రూపం, ఏది పై తొడుగు? లేక నా మనసు మార్చేందుకు బాబాజీ మాటల గారడీ చేసేరా? ఆశ్రమానికి డబ్బు యివ్వమనడం నన్ను పరీక్షించేందుకా? ఈ ఉత్తరంలోని మాటలు నన్ను మధ్య పెట్టేందుకా? తన మంచితనం అనే గాలాన్ని మెడకి తగిలించి వెనక్కి లాక్కుపోయేందుకా?

రాత్రి అంతా సాగిన ఆలోచనలు తెల్లవారినా మనసు అడుగున కొంచెం కొంచెం యింకా కదులుతూనే ఉన్నాయి. "అమ్మడూ! సూర్య గ్రహణం పట్టింది, స్నానం చెయ్యవూ?" అంది ఆ ముసలావిడ.

అప్పటికి వారు ఉభయులూ రైలులోనే స్నానం ముగించేరు. ఆయన మెల్లగా పెదిమలు కదుపుతూ జపం చేసుకొంటున్నాడు.

"ఇన్నిసార్లు స్నానం చేస్తే నా ఒంటికి పడదండీ. ఇంటికి చేరేక విడుపు స్నానం చేస్తాను" అన్నాను.

నా మాటలు ఆవిడికి రుచించలేదని ఆవిడ ముఖమే చెపుతున్నది. మెల్లగా ఏదో గొణుక్కొంటూ తనో చిన్న పుస్తకం చేతిలోకి తీసుకొని చదువుకోసాగింది.

ఆకాశంలో కాంతి తగ్గుతున్న సూర్యుణ్ణి చూస్తూ కూర్చున్నాను. దీర్ఘరోగిని మృత్యువు కొద్దికొద్దిగా కబళిస్తున్నట్లు సూర్య బింబం మెల్ల మెల్లగా నీడలోకి జారిపోతోంది.

"ఉట్టి కళ్ళతో సూర్యుణ్ణి అలా చూడకూడదు. కావాలంటే ఈ కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుచూడు." ఎవరో తల్లి పిల్లడిని మందలిస్తున్నది.

ఆ మాట నాకూ వర్తిస్తున్నట్లు కళ్లు తిప్పుకొన్నాను. నిమిషాలు నేను ప్రయాణిస్తున్న రైలు చక్రాల్లా గబగబ దొర్లిపోయి గంటల్లో కలిసిపోయేయి. గంటలు కాలాన్ని ముందుకు నెట్టాయి.

ఎదుటి బెంచీమీద కూర్చున్న ముసలావిడ బట్టలన్నీ తీసి,

జాగ్రత్తగా మూటగట్టి, ట్రంక్ మీద పెట్టింది, "సజ్జబుట్ట, టిఫిన్ క్యారియర్, మరచెంబు, చేతికర్ర" అంటూ అన్ని సామానులనీ లెక్కపెట్టుకొంటున్నది... నా సంచి చేతిలోకి తీసుకొని తలుపు దగ్గర నిలబడ్డాను. ఇంత దూరప్రయాణంచేస్తూ యింతేనా సామాను అన్నట్లు నా వైపు వింతగా చూసి మళ్ళీ తన పనిలో నిమగ్నమై పోయింది ఆమె.

గజి బిజిగా ఉన్న పట్టాలని ఎంచుకొంటూ, నడక వేగం తగ్గిస్తూ, స్టేషను చేరుకొన్న రైలు ప్లాట్ ఫారమ్మీద మెల్లగా ప్రాకుతున్నది. తమని ఎదురుకో వచ్చిన వారికోసం ఆత్రుతగా రైలు కిటికీల్లోంచి తలలు బయటికిపెట్టి చూస్తున్నారు ప్రయాణికులు. అంతే ఆత్రతగా ప్లాట్ ఫారమ్ మీద జనం రైలుతో పాటు పరుగులు పెడుతున్నారు.

సూర్యగ్రహణం రమారమి విడిచిపోయింది. అతిస్వల్పంగా మాత్రం యింకా మిగులుంది. కిరకిరమనే చప్పుడుతో రైలు ఆగుతున్నది. ఎదురు సన్నాహాలకి ఎవరూ రారని నాకు తెలుసు. ఇల్లువిడిచి పోయిన చెల్లెలికోసం అన్న వస్తాడా? పెళ్ళి నాలుగు రోజులు ఉండనగా నలుగురిలో అవమానంపాలు చేసిపోయిన భారతికోసం జగదీశ్ వస్తాడా?

అందరి చూపులూ నేలమీద బంధువులకోసం, స్నేహితుల కోసం వెతుకులాడుతుంటే, నేను మిగిలివున్న ఆ కొద్ది గ్రహణం ఎప్పటికి విడుస్తుందా అని చూస్తున్నాను. రైలు ఆగేసరికి గ్రహణం పూర్తిగా విడిస్తే బాగుండునని కోరిక. ఆ కోరికకి కారణం వేరు. ఏ క్షణంలోనైనా ఆ కాస్త నీడా తొలిగిపోయేలా ఉంది. రెప్ప వెయ్యకుండా అటే చూస్తున్నాను.

"భారతీ!" అని ఎవరో గట్టిగా పిలిచినట్లయింది. నా చూపు ఆకాశంనుండి భూమిపైకి దిగింది. కళ్ళ కెదురుగా అన్నయ్య, వదిన, అత్తయ్య, మామయ్య, రమణి, పంకజమ్మ...ఒక్కొక్క అడుగే ముందుకుపోయి జగదీశ్ ముందు ఆగిపోయింది రైలు. "గ్రహణం విడిచింది" అని పక్క పెట్టెలోంచి దిగుతున్న ఎవరో అంటున్నారు.

జగదీశ్ మీద నుంచి దృష్టి మళ్ళించి ఆకాశంవైపు చూసేను. అంతవరకూ మిగిలివున్న ఆ కొద్దిపాటి మచ్చా తొలిగి పోయింది. జాతిరత్నంలా కాంతి విరజిమ్ముతున్నాడు సూర్యుడు. గ్రహణం పూర్తిగా విడిచిపెట్టింది అనుకొన్నాను.

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్,
మద్రాసు-1.

## దేశంలో అన్ని రేట్లూ పెరిగాయి. కానీ హెచ్.ఎల్.పి. చందా పెంచలేదు. నేడే మా ప్రణాళికలో చేరి నెలకి రు 5/- తో మీ యింట్లో చక్కటి స్వంత గ్రంథాలయం నెలకొల్పండి!

ఇప్పటికి 21,000 పైగా ప్రణాళికలో చేరారు!






ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక

### నెలనెలా రు 5/- చొప్పున వరుసగా 18 నెలలు కట్టండి

మీరు కట్టే ఆ మొత్తం రూ. 90 లకూ మీకు రూ. 134 ల ప్రతిఫలం దొరుకుతుంది.

★ రూ. 100 లకు — దేశంలోని పెద్దపెద్ద సంస్థలన్నీ ప్రచురించిన సుమారు 3000 ఉత్తమ పుస్తకాల క్యాటలాగులోనుంచి మీయంతట మీరే ఏరి కోరుకొనే మంచి మంచి పుస్తకాలు వస్తాయి.

★ రూ. 17 లకు — ఒకటి కాదు రెండు కాదు - మా ఉచితపుస్తకాల పెద్ద జాబితా నుండి మీరుగా ఎన్నుకొనే మరి 10 పుస్తకాలు అదనంగా ఉచితంగా వస్తాయి.

★ రూ. 7-50 ఖరీదుచేసే మా మాస పత్రిక 'పుస్తకప్రపంచం' సంచికలు ఆ 18 నెలలూ మీకు మా ఖర్చుతో వస్తాయి.

★ రూ. 8 దాకా — రిజిస్టర్ అన్నింటి రవాణాకూ అయ్యే ఖర్చును మేమే భరిస్తాము.

★ రూ. 1-50 ఖరీదుచేసే పెద్ద క్యాటలాగు ఉచితంగా పంపుతాము.

మీరు కట్టే మొత్తానికి పైన అందులో సగానికిసగం అదనంగా వస్తుంది. లెక్కగడితే మీకు దాదాపు 50 శాతం లాభమన్నమాట!

మొదటినెల చందా రూ. 5 కట్టగానే-

1. మీరు ఏరి కోరుకొనే 3 ఉచిత పుస్తకాలూ.

2. 'పుస్తకప్రపంచం' పత్రికా.

3. దాదాపు 3000 తెలుగు పుస్తకాల వివిధ వివరాలున్న పెద్ద కేటలాగూ.

4. మీ ఖాతా వివరాలు మీకై మీరు వ్రాసిపెట్టుకోవడానికి ఒక రికార్డు పుస్తకమూ

మరుటపాలో టంచన్‌గా మీకు అందుతాయి.

7 నెలల చందా కట్టేసరికి-

మా కేటలాగులోనుంచి మీకై మీరు ఏరి కోరుకొనే 30 రూ. ల పుస్తకాలూ, ఆపైన మరి రెండు ఉచిత పుస్తకాలూ అందుతాయి.

13 నెలలు తిరిగేసరికల్లా-

మరో 30 రూ. ల పుస్తకాలూ,

మరో 2 ఉచిత పుస్తకాలూ

18 నెలలు పూర్తికాగానే-

మరో 40 రూ. ల పుస్తకాలూ,

- అందుతాయి.

ఎప్పుడైనా ఏదైనా అవాంతరం
వస్తేనో? లేక అసలు మానేస్తేనో?
మీకేం నష్టముండదు.

చందాదారులు ఒకవేళ ఎప్పుడైనా, ఏ కారణంచేతనైనా అర్ధాంతరంలోనే చందా మానివేయదలిస్తే నిరాక్షేపణగా మానివేయవచ్చు. అప్పటికీ వారు కట్టిన సొమ్ము వారికి పుస్తకాలరూపంలో ముట్టి తీరుతుంది. కాకపోతే, ఈ లెక్కలో, వారికి అంతవరకూ పంపిన ఉచిత పుస్తకాలూ, 'పుస్తకప్రపంచం' సంచికల ధరా, రవాణాఖర్చులూ మినహాయిస్తాం.

## గడువు పూర్తయ్యాకమాటేమిటి?

18 నెలలూ పూర్తిచేస్తే మీకు కొన్ని యావజ్జీవిత సదుపాయాలుంటాయి

యావజ్జీవితమూ మా పంపిణీపుస్తకాలన్నిటిపైనా 10% కమిషన్. 20 రూ. లకు పైబడ్డ ఆర్డర్లకు అదనంగా రవాణా, ప్యాకింగులు ఉచితం. అవసరమైనప్పుడు రూ. 50 లకు మించకుండా నెలరోజుల అరువు.

'పుస్తకప్రపంచం' చందాలో కూడ 10% తగ్గింపు.

ఉత్తరోత్తరా వచ్చే పెద్దా, చిన్నా క్యాటలాగులన్నీ ఉచితం.

ఆంధ్రలో మంచిస్వంతగ్రంథాలయాలు ఉంటకలవారి పేర్లు, ఛాయాచిత్రాలతో సహా, పలువురికి ఉపయోగించగలవిధంగా తీర్చిదిద్దిన సువర్ణ గ్రంథంలో పేర్ల నమోదు.

## మీ మొదటి 3 ఉచిత పుస్తకాలూ ఈ కింది వాటినుండి ఎన్నుకోండి









**F 58**
విరిగిన కలలు
జనమంచి రామకృష్ణ
ఒక కుటుంబం కోరి 'కన్న వాటిలో విరిగిన కొన్ని కలలను వివరించే విశిష్ట నవల.

విడీవిడని చిక్కులు
వీరాజీ



**F 59**
విడీవిడని చిక్కులు
వీరాజీ
సంసారంలో పొటమరించి, ఆటుపోటులకు అగ్గలమై, విడీవిడని చిక్కులను చిత్రించే వీరాజీ మరొక నవల.










**F 60**
హుసేన్ సాగర్
రేవనూరి శమంత

హృదయాన్ని కరిగించే శక్తినీ, కరుణమునిష్పత్తి చేసే ప్రభావాన్నీ హుందాగా, హుషారుగా ప్రదర్శించే ఇంచక్కని కథలు.



**F 62**
అక్షరాల గవాక్షాలు
డా॥
సి. నారాయణరెడ్డి
అకాడమీ అవార్డు అందుకొన్న ఆంధ్రమహాకవి విశ్వవిలోకనాన్ని, విశ్వవిజ్ఞానాన్ని విశదపరిచే అభినవ కవితాసంపుటి.

**F 63**
అర్ధాంగి
ఉన్నవ విజయలక్ష్మి
ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆమధ్య ధారావాహికంగా వెలువడి, విశాలాంధ్రుల శేషాంధ్రులను అలరించిన అద్భుత నవల.




**F 70** అత్తగారి కథలు
నంబర్ టూ
భానుమతీ రామకృష్ణ
'రమణీయ రచన
బాపూ చిత్రాలంకరణ
సాహిత్య అకాడమీ అవార్డు అందుకొని, రెండో ముద్రణకూ ఎక్కి, అందరినీ ఉర్రూతలూచి, తరువాయి ముద్రణకూడ పొందిన సత్తా
'అత్తగారి కథలు' నంబర్ వన్‌కు తదనంతర కథలు.

# చందా కట్టే విధానం

1. వెనుకపేజీలో ఇచ్చిన ఆరు ఉచిత పుస్తకాల జాబితానుంచి మీకు నచ్చిన 3 పుస్తకాలు ఎంచుకొని కూపనులో ఆ నంబరు గుర్తుపెట్టండి.
2. పూర్తిచేసిన కూపనూ, మొదటి నెల చందా రూ. 5 లకు మనియార్డరు–రెండూ దిగువ అడ్రసుకు పంపండి.

   'ఇంటింటా స్వంతగ్రంథాలయం' ప్రణాళిక,
   ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు,
   రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు.
3. తరువాత నెల నెలా రూ. 5 వంతున ఆయానెల ఆఖరులోగా. చందా మొత్తం రూ. 90 పూర్తి అయేదాకా పై అడ్రసుకు పంపుతూ ఉండాలి.

---

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు**

అయ్యా, మీ 'ఇంటింటా స్వంతగ్రంథాలయం' ప్రణాళికకు నన్ను ఒక చందాదారుగా చేర్చుకొనగోరుతున్నాను. మొదటి నెల చందా రూ. 5 లూ మనియార్డరు ద్వారా పంపినాను. తొ[illegible] మూడూ ఈ క్రింద గుర్తించిన (√) నంబర్లవి ప[illegible]గోరుతున్నాను. మీ నిబం[illegible] బద్ధుణ్ణి. (అక్కరలేని నంబర్లు కొట్టివేయండి.)

F 58    F 59    F 60    F 70    F 62    F 63

18/8

సం||

ఇట్లు

తేదీ ..........

పేరు ..........

చిరునామా ..........

ఊరు ..........




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు



భారతికి జీవితంమీద ఇంకా మమత తీరలేదు. సుఖించాలనే కోరికా పోలేదు. మరి, ఆమెకు డబ్బు ఉంది. ఆమె చుట్టూ ఉన్నవారికి కావలసింది ఆమె డబ్బు; ఆమెకు కావలసింది ఆ డబ్బుతో లంకెలేని ప్రేమ. తనను తనుగా అభిమానించే ఆత్మీయులు కావాలి తనకు. అది కొరవడటంతో భయాన్నీ, అనుమానాన్నీ చుట్టూ పోగుచేసుకొంది. బెంగతో తన బ్రతుకు తాను కాపలాకాసుకొంది. ఎవరికీ చెప్పకుండా ప్రశాంతమైన హృషీకేశానికి పలాయనం చిత్తగించింది. అక్కడ——

ఆమె తెలుసుకొన్న దేమిటి? తిరిగి ఆత్మీయుల వద్దకు చేరుకోవడంతో ఆమె సాధించిందేమిటి?





యం. శేషాచలం అండ్ కో.
మచిలీపట్టణం . మద్రాసు . సికింద్రాబాద్

